

మన సాహితీ స్నేహానికి సంకేతంగా

**మానసలహరి**

అందిస్తున్నాము.

"ప్రతిభాలహరి" కోసం

మీ సాహితీమిత్ర సభ్యత్వాన్ని

పొడిగించి

మన సాహితీస్నేహాన్ని

కొనసాగించండని అర్థిస్తున్నాము




---

**2-12-1973 నాటికి సాహితీ మిత్రుల సంఖ్య 5,000**

యువభారతిని మీ మిత్రులలో

కనీసం మరొక్కరికి పరిచయం చేసి

**10,000 మంది సహృదయులకు**

సన్నిహితమయ్యేందుకు సహకరించండి

---




**భారతీమిత్రులుగా చేరి**

యువభారతి సుస్థిర భవిష్యత్తు

నిర్మాణానికి సహకరించి

ఆకర్షణీయమైన

సదుపాయాలను

శాశ్వతంగా పొందండని

విన్నవిస్తున్నాము.

**యువభారతి**



# మందార మకరందాలు

మీ ద్వారా మరొకరికి మరో ప్రతి అందేలా చూడండి

## లక్ష ప్రతులు

### అందించాలనే

## మా లక్ష్యానికి తోడ్పడండి!

'సాహితీవాహిని'లో
రెండవ తరంగం

*

వేమన్న సూక్తుల్లో
మన్నికైన
కొన్ని మౌక్తికాలు

*

ఆవిష్కరణ :
'ఆనంద' ఉగాది
**24-3-1974**

వెల : రూపాయే !
పోస్టేజి 0-25 అదనం

త్వరపడి
మీ ప్రతిని సొంతం
చేసుకోండి !



# వికాసలహరి

వి కా స మూ ర్తు లు

నన్నయ, పోతన, పింగళిసూరన, కందుకూరి వీరేశలింగం, తిరుపతి వేంకటకవుల ప్రతిభాప్రాభవాలను గూర్చి

ప్రసిద్ధాంధ్ర సాహిత్యాచార్యులు

ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ సి. నారాయణరెడ్డి

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, శ్రీ ఆరుద్ర గారల ఉపన్యాసమంజరి

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

ప్ర చు ర ణ




యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

# VIKASA LAHARI

*A Collectionof Lectures on*
NANNAYA, POTHANA, PINGALI SURANA, KANDUKURI VEERESHALINGAM AND TIRUPATHI VENKATA KAVULU.

*Delivered by*
Prof. Divakarla Venkatavadhani, Dr. C. Narayana Reddy, Dr. G. V. Subrahmanyam and Sri Arudra.



యువభారతి

ప్రచురణ ; 18

ప్రథమ ముద్రణ : 11,200

డిసెంబరు 2, 1973

ముఖపత్ర రచన : శ్రీ శీలావీర్రాజు

అక్షరాలంకరణ : సుధామ

ముద్రణ : నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు-20.

ముఖచిత్ర ముద్రణ : విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

**యు వ భా ర తి**
6, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500003.
లేదా
**యు వ భా ర తి**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500001.

యువభారతి సాహితీమిత్రులకు ఉచితంగానూ, మూడు రూపాయలు ప్రచురణ పూర్వ విరాళమిచ్చిన సాహితీ ప్రియులకు కానుకగా అందజేయబడింది.

వెల : [redacted]పాయలు

# ప్రేరణ



"ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము
నరుడు నరుడౌట యెంతొ దుష్కరము సుమ్ము"

బహుశః ఏకొద్దిపాటివాటినో మినహాయిస్తే, చెప్పుకోదగ్గధ్యేయాలు- అనేవాటికి పరిసీమితంచేస్తే, "ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము"- లోని నిజం- స్పష్టంగా అవతరిస్తుంది. అసలు- ఆలోచన కలగడమే కష్టం. ఏ ప్రేరణవల్లనో- ఆ ఆలోచన కలుగుతుంది. కలిగిన ఆలోచన స్పష్టంగా రూపుకట్టడం మరీకష్టం. రూపుకట్టిన ఆలోచనకు- మాటలరూపంలో సరైన ఆకృతినిచ్చి- అ ఆకృతిని నిలపగలగడం ఇంకా కష్టం. ఆలోచనలో లీలగా మెదిలిన ఆకృతికి- అక్షరాకృతి కల్పించి- నలుగురి ఎదుట ఆవిష్కరించి- నచ్చచెప్పగలగడం కష్టం తాను చేయబూనడం కష్టం. చెప్పి చేయించబూనడం మరీకష్టం మెదిలిన ఆలోచనలన్నీ- ఎక్కడో ఓచోట, ఈ వైకుంఠపాళిలో జారి పడిపోతాయి- మొదటికొస్తాయి ; కొన్ని మొదలంటూ లేకుండా మాయమైపోతాయి. కార్యక్షేత్రంలో శ్రీకారానికి నోచుకునే భాగ్యం- ఏ కొద్ది ఆలోచనలకు మాత్రమే కలుగుతుంది. ఆ కురుక్షేత్రంలో- ఓటమి - గెలుపు, ఏ సూత్రాల బట్టి నిర్ణయింపబడుతుందో- ఆ సూత్రాలకు భాష్యాలు, ఆ భాష్యాలకు తాత్పర్యాలు ఏ మాత్సర్యాల కారణంగా మారుతుంటాయో- అదో పెద్ద భారతం. శ్రీకారభాగ్యానికి నోచుకున్న ఆలోచన- ఏ శ్రీరామరక్ష కారణంగానో తప్ప- సాధ్యపడటం కష్టం. అందుకే......"ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము". గాలిబ్ గట్టిమాటే చెప్పాడు.

అనుభవమున్నవాళ్ళకు-కనీసం ఆలోచన ఉన్నవాళ్ళకు తెలుస్తుంది- ధ్యేయాన్ని నిర్ణయించడం- నిర్ణయించిన ధ్యేయాన్ని సాధించడంలోని కష్టనష్టాలు. ఆలోచనలకు అవకాశమిస్తే- అవకాశాలకు ప్రోత్సాహం లభిస్తే- కృషి వికసిస్తుంది. కానీ, అన్ని సందర్భాలలోనూ, అనేకఆలోచనలు ఈ అదృష్టాన్ని నోచుకోవు.

ఏ కొందరు మహనీయుల ఆలోచనల కారణంగానో, కృషి ఫలితంగానో, ఈనాడు మనం ఎన్నింటినో ఆనందిస్తున్నాం, అనుభవిస్తున్నాం. కష్టంతో సాధ్యమైన దానిలో కష్టాన్ని విస్మరించిన సందర్భాలే ఎక్కువ. ఆ కష్టం- గుర్తింపబడక పోవడంవల్ల- మరెంకెంత మంచి కృషికి ప్రేరణ కావలసింది, మత్తుగా మట్టిలో కూరుకుపోతోంది. అందుకే- గతంలోని మంచిని గమనించడం అవసరం. అది పునాది. పునాదులు లేని కట్టడాలు, ఏపాటి నిలుస్తాయి ! గతంలో కాపురం చెయ్యమని కాదు, భావం. గతంలోని మంచిని గమనించగలిగినప్పుడు- వర్తమానం విస్పష్టంగా అర్థమౌతుంది. అప్పుడే, భవిష్యత్తును ఊహించగల్గడం, బాధ్యతలను నిర్వర్తించడానికి

సరైన పద్ధతిలో పూనుకోవడం సాధ్యమౌతుంది. ఈ విషయం గురించి - సమగ్ర మైన అవగాహన, సమ్యక్‌దృష్టి ఏర్పడినప్పుడే- జాతిలో, వికాసవీచికలు వెల్లివిరుస్తా యని యువభారతి విశ్వాసం.

అందుకనే- యువభారతి కార్యక్రమాలు తప్పుదారిబట్టిస్తున్నాయని విమర్శించే సహృదయులకు, నమస్కరించి, ఈ సమగ్ర అవగాహన, ఈ సమ్యక్‌దృష్టి కల్పిం చడం జాతి చైతన్య వికసనానికి అవసరమని, మా కృషిని కొనసాగిస్తున్నాం.

ఆలోచనల్లో నిర్మాణాత్మక దృక్పథం ఉండాలనీ- సమాజంలో సామరస్యాన్ని పెంపొందించాలనీ- ఈధ్యేయసాధనకు, సాహిత్యంకంటే ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో- యువభారతి, ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది.

ప్రతిక్షణం-ప్రతిదినసులభమ్ముగా సాధ్యపడదులెమ్మ అని గుర్తుకువస్తూఉంటుంది.

మనిషి మనిషిగా, మర్యాదగా బ్రతికేందుకు అవసరమైన వాతావరణం సృష్టింప బడాలనీ- కనీస విలువలపై నమ్మిక, మానవతామర్యాదలపై విశ్వాసం చోటుచేసుకోని చోట, అలాంటి వాతావరణం ఏర్పడటం కష్టమనీ మా నమ్మిక. అనువైన అవకాశా లను కల్పించి, అలాంటి కృషికి దోహదం చేయడం సమష్టిగా సమాజం బాధ్యత- సమాజంలోని, అనేక సంఘాల బాధ్యతగా యువభారతి గుర్తిస్తున్నది. ఆలోచనాపరు లైన మేధావులు- తమ కర్తవ్యాన్ని ఎందుకు విస్మరిస్తున్నారో అని విస్తుపోతున్నది. అధికసంఖ్యాకులు ఎందుకిలా స్తబ్ధ స్థితికి తలలొగ్గి- ఊరుకుండిపోతున్నారో అని, విచారిస్తున్నది. రాజకీయాల, ఇజాల నిజానిజాల ముసుగుల ఆవల- కావలసినదాన్ని గమనించి, కార్యక్రమాన్ని నిర్ణయించి, సంఘటితంగా మెలిగి, మంచిని సాధించ బూనడం అందరి బాధ్యత అనీ- కనీసం అక్షరాస్యులైనవారి బాధ్యత అనీ మా విశ్వాసం. ఈ మేరకు సక్రమమైన ఆలోచనా పద్ధతినీ, నిర్మాణాత్మక దృక్ప థాన్నీ కలిగించే ధ్యేయంతోనే, యువభారతి కృషిచేస్తున్నది. చైతన్యవంతమైన ధ్యేయ సాధనా సంరంభాన్ని జడమైన అచ్చుసిరా ద్వారా అందించబూనడం కష్టం. మా కృషి వెనుకనున్న ఆలోచనల స్వరూపాన్ని, సహృదయులు పోల్చుకోగలరనీ- తమ మనస్ఫూర్తి సహాయసహకారాలు అందించగలరనీ ఆశిస్తున్నాము.

ఏ ముహూర్తబలాన గిరీశం అన్నాడో- "మనవాళ్ళు ఉట్టి ...." అని. ఆ మాట వమ్ముచేద్దామని మా పట్టుదల. "మంచిపనులు చవకగానే చేయవచ్చు" అని నిరూపించాలని మా ధ్యేయం. అనేక సాంకేతిక రంగాలలో సాధించిన ప్రగతి- అధికోత్పత్తివల్ల కలిగే లాభాలను, ప్రజాసామాన్యంలోకి, చౌకగా తీసుకురాగలుగు తుండగా- ఎందుకోమరి, అక్షరాస్యుడైనవాడికి, చౌకగా ఉత్తమసాహిత్యం అందించే విషయంలో మాత్రం- ఇది ఇంతవరకు సాధ్యపడలేదు. ఏం కారణమో, ఎవరు అడ్డు కుంటున్నారో- తెలియడంలేదు. అచ్చుపోసిన అక్షరాలద్వారా, ఆలోచనలను వెదజల్ల వచ్చుననీ- ఆ ఆలోచనలే ఉత్తేజాన్ని కల్గించి కార్యోన్ముఖుల్ని చేయగలవనీ- గుర్తిం

చడం అవసరం. ప్రజాస్వామ్యం విలువలు పదికాలాలపాటు పదిలంగా కాపాడబడ టానికి- అధిక జనావళి ఆలోచనాశూన్యత ప్రాతిపదిక కాకూడదనీ, ఈ అజ్ఞానాంధకా రాన్ని ఛేదించడానికి అచ్చుయంత్రాన్ని విరివిగా వాడటంలోని లాభాలను అందరికీ అందుబాటులోకి తేవాలనీ, మా ఆశయం.

అచ్చు ఆదరణను నోచుకోనప్పుడు కృషి స్తంభిస్తుంది. ఆలోచనే ఆదరణను నోచుకోదు. మానవతా మర్యాదలమీద ఏమాత్రం నమ్మకమున్న సమాజమైనా, ప్రగ తిని వాంఛిస్తున్న ఏ జాతిఐనా చూస్తూచూస్తూ స్తబ్ధతను ఆమోదించదు. అందుకే ఆలోచన అందరికీ అందుబాటులో ఉండాలనీ- అందరూ ఆలోచించాలనీ- అందుకు దోహదంగా అచ్చుయంత్రాన్ని వీలైనంత ఎక్కువగా వాడుకోవడం అవసరమనీ, గుర్తించడం ఎంతైనా అవసరం.

వాణిజ్య నాడి తెలిపిన విషయాలను, జాతి సాహిత్యపరమైన అవసరాలకు అను సంధించడం ద్వారా-సమగ్రవ్యక్తిత్వ నిర్మాణానికి అవసరమైన నిర్మాణాత్మక ఆలోచనా సరళిని సృష్టించగలిగే సాహిత్యాన్ని- వీలైనంత ఎక్కువ మందికి, వీలైనంత తక్కువ వెలకు అందించడం ద్వారా ప్రజాస్వామ్య వ్యవస్థకు నారుపోసే ప్రతిభా సౌమనస్యాలు జనావళిలో ఇతోధికంగా పెరగడానికి తోడ్పడగలమని మా "యువభారతీయు"ల విశ్వాసం.

ప్రచురణ పూర్వ విరాళాల పద్ధతిని, ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టి, వేలకొద్దీ సంఖ్యలో ప్రతులను అందంగా ముద్రించి విజయవంతంగా అందించాం. మా కృషిలోని ఔచిత్యాన్ని, అవసరాన్ని గమనించి, కొందరు సహృదయులు ముందుకువచ్చి సాయం చేశారు. ఇలా కృషి జరుగుతున్న విషయం మరింత విస్తారంగా తెలియాలనీ- ఈ కృషిలో పాలుపంచుకునే మిత్రులకోసం, ఈ సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకునే సహృదయుల సహకారం కోసం- రూపొందించిన పథకం సాహితీ మిత్ర. పుస్తకాలు కొని చదవడం అలవాటుచేయాలని మా కృషి. సాహితీ మిత్రుల సంఖ్య - ఈ నాటికి దాదాపు 5,000. ఇది పదింతలుగా పెరగాలనీ, ఈ పరిచయాలు వృద్ధిపొంది, ఈ కృషి విస్తరిల్లాలనీ ఆశిస్తున్నాం.

యువభారతి సాగిస్తున్న కృషి- సాధిస్తున్న ఫలితాలు, అనంతమైన ఆవసరాల దృష్ట్యా—స్వల్పమైనవే. కష్టాలు ఇబ్బందులు అనల్పమైనవే. ఐనా - ఈ కృషి సాగించ డంలోని ఔచిత్యం దృష్ట్యా, యువభారతి సుస్థిర భవిష్యత్తుకు పటిష్టమైన ఏర్పాట్లు జరగాలని, నిధిసేకరణ ధ్యేయంతో, భారతీమిత్ర భారతీభూషణ పథకాలను ప్రారంభి స్తున్నాం. యువభారతి కృషిని సహృదయులు పోల్చుకోగలరనీ, ధ్యేయసాధనలో సహ కరిస్తారనీ ఆశిస్తున్నాం.

పాతికేళ్ళ స్వతంత్ర జీవనం గడిపిన జాతి, సాధించినప్రగతి- ప్రోత్సాహజన కంగా లేదు. వివిధరంగాల్లో, సమర్థవంతమైన నాయకత్వం ఉబికిరాలేదు. ఇది వాస్తవం. స్పందనలేని స్తబ్ధ వాతావరణం ఆవరించుకొని ఉంది. అందుకే చుట్టూరా

ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ ఊరికే కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నైనా వెలిగించడం మంచిదన్న మా విశ్వాసంతో, ఉడుతాభక్తిగా ప్రయత్నిస్తున్నాం.

అభిలాష, అభిమానం, కృషికి ప్రేరణను కల్పించగలవని భావిస్తున్నాం. అభిమానం అవసరం. విజృంభిగే స్థితికి చేరి విపరీతమైన దురభిమానంగా పరిణమించకూడదు. అభిమానం ఏ మూలైనా ఏ కాస్తయినా, మెదలనిదే, అసలు పనులుసాగవు. ఆలోచనలు పారవు. తెలుగువాళ్ళం-ఎవరికీ, ఎందులోనూ తీసిపోమనీ, తీసిపోకూడదనీ, పట్టుదల కలిగించగలుగుతే తెలుగుజాతి సగర్వంగా తలెత్తుకు తిరిగేలా కృషి జరగడానికి అంకురార్పణ చేసిన వాళ్ళమౌతాము. ఈ అభిమానం కలిగించడానికి, సాహిత్యాభిమానం కలిగించడం అవసరమన్న ధ్యేయంతో- యువభారతి పెద్దఎత్తున, లహరి పరంపరలో ఉపన్యాస కార్యక్రమాలను ఏర్పాటుచేసింది. తెలుగువాళ్ళ సాహిత్య సభలకు సైతం, సహస్రాధిక సంఖ్యలో సహృదయులైన సభికులు హాజరౌతారని నిరూపించగలిగింది. క్రమశిక్షణతో, దీక్షతో కృషిచేయడంలో ప్రయోజనవంతమైన ప్రయోగ ఫలితాలను సాధించగలిగింది. సాహిత్యం సమాజాన్ని చైతన్యలహరిగా పొంగులెత్తించాలని, సమాజ భవితవ్యం వికాసలహరిలా వినూత్న శోభనలతో వెల్లివిరియాలనీ, యువభారతి సాహిత్యసభలను తెలుగువారి తియ్యని పండుగలుగా పండించాలని యత్నిస్తున్నాం.

భాగవత పద్యాలతో పరిచయం, తెలుగుభాషా సౌందర్యంతో పరిచయం. పోతన్న పద్యాలు ఏవైనా నోటికి రాకుంటే, తెలుగుతనం ప్రకటించుకోవడం కష్టం. సాహిత్యాభిమానం కల్పించాలన్న లక్ష్యంతో, పుస్తకాలు కొనిచదివే అలవాటు కలిగించాలన్న ధ్యేయంతో పోతన పద్యాలలో కొన్నింటిని, డా॥ సి. నారాయణరెడ్డిగారి మకరంద వ్యాఖ్యానాన్ని జతచేసి, ఒక్కరూపాయికే 'మందారమకరందాలు' అందిస్తున్నాం. సాహితీ వాహినిలో మొదటి తరంగంగా వెలువడిన మందారమకరందాలు, ప్రతి తెలుగింటిలో వెలుగులు విరజిమ్మాలనీ-కనీసం లక్షప్రతులైనా అందించాలనీ సంకల్పించి ప్రచురించిన మొదటి ముద్రణప్రతులు 25,000 ఐదువారలలో చెల్లిపోయాయి. ఈ డిసెంబరు 2 వ తేదీ నాడు, రెండవ ముద్రణ వెలువడుతోంది. సాహితీవాహినిలో రెండవ తరంగంగా, రానున్న ఆనంద ఉగాదికి, రసార్ద్రమైన ఆరుద్ర వ్యాఖ్యతో వేమన్న వేదం'వెలువడుతోంది'. 'సాహితీవాహిని'ని ద్వైమాస పత్రికగా వెలువరించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ పరంపరలో-తెలుగు సాహిత్యంలోని సౌరభాలనే కాక, విశ్వసాహిత్యంతో కూడా పరిచయం కలిగించాలనీ, సాహిత్యపరమైన విషయాలేకాక, సాంస్కృతిక విజ్ఞాన విషయాలను సైతం అందించాలనీ సంకల్పిస్తున్నాం. వీలున్నంత త్వరగా 'సాహితీవాహిని'ని మాసపత్రికగా వెలువరిద్దామని యత్నం. ఈ ప్రయోగ ఫలితాల ఆధారంగా తెలుగులో రీడర్స్ డైజెస్ట్‌లాంటి పత్రికను వెలువరించి తెలుగు సారస్వత సేవ చేయాలని సంకల్పం. ఒక్కరూపాయికే ఈ తరంగాలను అందించాలన్న మా ప్రయత్నంలోని సహృదయాన్ని సాహిత్యాభిమానులు పోల్చుకో

గలరనీ, ఆదరిస్తారనీ, ఆశిస్తున్నాం.

సమకాలీన సారస్వత ప్రక్రియలను సమన్వయ దృక్పథంతో సమీక్షించడం, సమాజంలో రచయిత నిర్వహించవలసిన పాత్రను, ప్రపంచ భావపరిణామంలో యువత వహిస్తున్న పాత్రను, వివిధ దృక్కోణాలతో వివేచించడం-అన్న అంశాలపై, యువభారతి- 'రచన', 'మహతి' విజయవంతంగా నిర్వహించి, వ్యాస సంకలనాలను ప్రచురించింది. 'యువత' గోష్ఠి-అభిప్రాయ సేకరణ-వ్యాస సంకలనం ప్రచురణలను తలపెట్టింది.

భారత రజతోత్సవ ప్రచురణగా-34 ఇంగ్లీషు వ్యాసాల సంకలనం Free India Forges Ahead ను ప్రచురించింది. తెలుగు నవల విశిష్టతను చాటిచెప్పేందుకు, వేయిపడగలు మొదలుకొని ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించిన 22 నవలలను భాషేతరులకు పరిచయం చేద్దామన్న సంకల్పంతో Telugu Novel ప్రచురణను ఇంగ్లీషులో వెలువరించనున్నది.

## వికాసలహరి

ముకుళించిన మొగ్గలు ముగ్ధమోహనంగా వికసించటం వికాసం. సుప్తచైతన్యం ప్రతిభోర్మిలనంగా ప్రగతివీచికలను ప్రసరిస్తూ ప్రస్ఫుటం కావటం వికాసం. ఆంధ్ర సాహిత్యనందనంలో కావ్యవచస్సులను, కవితాపయస్సులను, కల్పనారోచిస్సులను, సంస్కరణోద్యమఉషస్సులను, అవధానకళాయశస్సులను వినూత్నశోభలతో వెల్లివిరియించిన వికాసమూర్తుల సాహిత్యసేవాసమీక్ష 'వికాసలహరి'.

గాసటబీసటగా గాథలల్లుకొనే తెలుగుజాతికి మహాకావ్యదక్షమైన పద్యవిద్యను ప్రసాదించిన ప్రథమాంధ్రమహాకవి నన్నయభట్టారకుడు, తెలుగు ప్రజాజీవితాన్ని భక్తిభావబంధురమైన భాగవత కవిత్వంతో వరవశింపజేసిన సహజపాండితీమండితుడు బమ్మెరపోతనామాత్యుడు, అపూర్వకథాకల్పనామహనీయ ప్రతిభతో ప్రబంధజగత్తులో మరోప్రపంచాన్ని సృష్టించిన సాహిత్యకళాప్రపూర్ణుడు పింగళిసూరనామాత్యుడు, నవ్యాంధ్రసాహిత్యపితామహుడు, గద్యతిక్కన, సారస్వతాన్ని సాంఘిక సంస్కరణాని కుపకరణంగా మలచుకొన్న మహామనీషి మానవతామూర్తి కందుకూరి వీరేశలింగంపంతులు; తెలుగుకవిత్వానికి రాజాస్థానపు రాణీవాసాన్ని తొలగించి అవధానసభారంగం కల్పించి పండితపామరజనరంజకంగా భారతిని పూలపల్లకిలలో ఊరేగించిన అద్వైతనాంధ్ర కవిప్రపంచనిర్మాతలు తిరుపతివేంకటకవులు-వికాసలహరికై ఎన్నిక చేయబడిన కవితామహితాత్ములు.

ఆంధ్రమహాభారత కావ్యావతరణం నుండి అవధానకవితావిస్తరణం వరకు ఆంధ్రసాహిత్యనందనంలో ప్రసరించిన ప్రతిభాసౌగంధ్యలహరి 'వికాసలహరి'.

లహరి పరంపరలో, మూడవదిగా వికాసలహరిని తెలుగు సాహిత్యానికి కానుకగా సమర్పిస్తున్నాం. రానున్న 1974 లో ప్రతిభాలహరి పేరిట-కార్యక్రమాన్ని

ప్రకటిస్తున్నాం. ప్రతిభాలహరికై ఎన్నికైన ప్రతిభామూర్తులు కవిసార్వభౌమ శ్రీనాథుడు, తెనాలిరామకృష్ణుడు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, మహాకవి శ్రీశ్రీ. ఈ లహరి పరంపర ఉపన్యాసాలను తెలుగు సోదరులు ఇంకా ఎక్కువగా ఆదరిస్తారనీ, అధిక సంఖ్యలో సాహితీమిత్రులుగా భారతీమిత్రులుగా, భారతీభూషణులుగా చేరి, ఈ కృషి కొనసాగించడానికి దోహదం చేస్తారనీ ఆశిస్తున్నాము.

మా అనుభవం ఆసరాగా, సోదరసాహితీసంస్థలు కొన్ని ప్రచురణపూర్వ విరాళాల పద్ధతిపై ప్రచురణలను వెలువరించేందుకు పూనుకోవడం, మాకు ఆనంద దాయకంగాఉంది. మా ప్రయోగానుభవాలు పదిమందికీ ఉపయోగపడి, మరింత విస్తృత ప్రాతిపదికపై కృషి జరగాలనే మేము కోరుతున్నాము.

పెరుగుతున్న ధరలు- తెల్లకాగితంనుంచి, అచ్చుఖర్చువరకూ, అన్నీచికాకు కలిగిస్తున్నాయి. ప్రభుత్వవర్గాలవారు-మరీ పెళ్ళినడక నడుస్తారు. దట్టంగా అలుముకున్న ఉపేక్షాభావం అడుగడుగునా కనిపిస్తుంది. ఉత్సాహం నీరుకారిపోయిన సందర్భాలే అనుభవంలోకి వస్తూండడంవల్ల, ఈసారి ప్రభుత్వసహాయాన్ని అర్థించనేలేదు. ప్రజల ఆదరాభిమానాలే పెట్టుబడిగా సాగిస్తున్న కృషిలో- ఆశించినమేరకు ప్రోత్సాహం లభించనందువల్ల ఏర్పడేచిక్కులు, మా పట్టుదలను పెంచుతున్నాయనే నివేదిస్తు న్నాము. మా వేదనను, ఆవేదనను, త్వరలో పోల్చుకుంటారనీ తెలుగులోకం అర్థం చేసుకొని ఆదరిస్తుందనీ ఆశిస్తున్నాము.

యువభారతి వ్యాపార సంస్థకాదు. తీరిక సమయాన్ని సాహితీసేవకు వినియో గించి, తద్వారా జాతి వికసనానికి తోడ్పడాలన్నదే మాధ్యేయం. మూడుసంవత్సరా లుగా కొనసాగుతున్నయత్నంలో-25,000 ప్రతులు వేయగలుగుతే బావుంటుందని ఆశించాం. లహరి పరంపర-10,000 సంఖ్యను దాటగలుగుతోంది. 25,000 లక్ష్యాన్ని అందుకోడానికి, సహృదయులైన ప్రజానీకం తమ సహకారాన్ని అందించగలరని ఆశిస్తున్నాం. "వికాసలహరి"ని అందుకుంటున్న సహృదయులందరూ, సాహితీమిత్రు లుగా చేరుతారనీ, మీ మిత్రులందరికీ ఈ కృషిని పరిచయంచేయడంద్వారా, సాహితీ మిత్రుల సంఖ్య సహస్రాధికంగా పెరగడానికి తోడ్పడగలుగుతారనీ, 'లహరి' పరంపరను ఆదరించగలరనీ ఆకాంక్షిస్తున్నాము.

ఇది యువభారతికి సాహితీ చైతన్యంలో పదోవసంతం. ఈ సంవత్సరంలో, మూడుపుస్తకాలను పునర్ముద్రించడం, తొమ్మిది పుస్తకాలను ప్రచురించడం జరిగింది. తెలుగుతల్లికి మరిన్ని మణిహారాలను సమర్పించాలన్న మాప్రయత్నాలకు, అందరి ఆదరణా, మనఃపూర్వక సహకారమూ అందగలవన్న ఆశతో, నిరీక్షణతో—

వంగపల్లి విశ్వనాథం
సమావేశకర్త

2-12-1978

యువభారతి

# స్వాగతించి




మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం ఏర్పడుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

ఆలోచనా స్వేచ్ఛ జాతిప్రగతికి, దేశపురోగతికి దోహదం కలిగించే విధంగానూ, కళాసృష్టికి ప్రతిభా వ్యుత్పత్తులు ప్రాతిపదికలు కాగలిగే విధంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం సాంఘికాభ్యుదయంతో పెనవేసుకునిపోయే విధంగానూ, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలను సజీవజాతి నిర్వహించుకుంటుంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు నారు పోసేవీ ప్రతిభా సౌమనస్యాలే.

యువభారతి కడచిన పదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని, అందంగా శక్తివంతంగా, అర్థవంతంగా మాట్లాడ గలిగే సామర్థ్యాన్ని, నైపుణ్యాన్ని ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్ని, ఆలోచనను రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయన శీలతనూ అలవరచేందుకు వివిధ దృక్కోణాలతో రూపొందించిన కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఉత్తమ సాహిత్యాన్ని ప్రజానీకానికి అందిస్తే సాహిత్యపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ పూర్వవిరాళ పద్ధతిని ప్రవేశపెట్టి సరస్వతీ సాక్షాత్కారం, జీవనగీత, కావ్యలహరి, చైతన్యలహరి, వికాసలహరి వంటి సాహితీ తపోమూర్తుల సందేశాల నందించే గ్రంథాలను వేనవేల

సంఖ్యలో ప్రచురించి ఉభయ నగరాలలోని రసికులవే కాక యావద్భారత దేశంలోని సాహితీప్రియుల మన్ననలను పొందగలిగింది. 'మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు' అనే ఒక గోష్ఠిని నిర్వహించి ఆ గోష్ఠీవ్యాసాలను 'రచన'గా ప్రచురించింది. భారత స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా కడచిన 25 ఏళ్లలో తెలుగు దేశంలో సాంస్కృతిక సాహిత్య భాషా సంబంధమయిన తీరు తెన్నులను వివరిస్తూ నూరుగురు ప్రముఖుల వ్యాసాల సంపుటిని 'మహతి'గా ప్రచురించిది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే-యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు రసికులకు సాహితీమిత్ర పథకాన్ని రూపొందించింది. ఇప్పటికి దాదాపు 5 వేలమంది సహృదయులు సాహితీమిత్రులుగా చేరినారు. ఈ సాహితీ మిత్రుల సాహితీ వికాసానికి తోడ్పడేందుకు ఒక కవితా సంకలనం 'ఉషస్సు'ను, 'కథావాహిని' అనే రెండు కథాసంకలనాలను ప్రచురించింది. యువభారతి సభ్యుల కవితా కథా సంకలనాలు 'పీచికలు-అక్షరాలు-స్వరాలు-ఉదయం' కూడా వెలువడినవి.

యువభారతికి మూలనిథి ఏర్పరచి దానివల్ల వచ్చే ఆదాయంతో మీ సాహిత్య కార్యక్రమాలను మరింత సుకరంగా, ప్రయోజనాత్మకంగా, విస్తృతంగా, నిర్దుష్టంగా నిర్వహించాలనే ఉద్దేశ్యంతో 'భారతీమిత్ర', 'భారతీభూషణ' పథకాలను రూపొందించినాము.

జంట నగరాలలో వేనవేల సంఖ్యలలో భాషాభిమానులను ఆకర్షించి, పెద్దఎత్తున సాహిత్య సభలను యువభారతి నిర్వహించ గలిగింది. తెలుగు సాహిత్యం గురించి తెలుగువారికి తెలుపడమేకాదు, అన్యభాషీయులకు గూడా తెలుపబూనుకోవడంలో ఔచిత్యముందని అలాగే అన్యసాహిత్య సంస్కృతుల విశేషాలను తెలుగువారు తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉందని మా విశ్వాసం. దీనికి నాందిగా 34 ఇంగ్లీషు వ్యాసాల సంకలనం 'Free India Forges Ahead' ను వెలువరించింది.

బమ్మెర పోతన భాగవతంలోని యాభై రెండు పద్యాలను 'మందార మకరందాలు' గా మహాకవి డా॥ సి. నారాయణరెడ్డిగారి కమనీయ వ్యాఖ్యతో ప్రచురించి, లక్షప్రతులు అందించాలనే సంకల్పంతో మొదటిముద్రణ 25 వేల ప్రతులను ఒక రూపాయికి అందించి, రెండవ ముద్రణకు పూనుకున్నారు. మన తెలుగులోనే కాకుండా విశ్వ సాహిత్యాన్ని తమ ప్రభావాలతో సంపన్నం చేసిన మహనీయుల సందేశాలను కూడ 'సాహితీవాహిని' పరంపరలో వెలువరించాలని, ద్వైమాసిక పత్రికగా ఈ 'సాహితీవాహిని'ని నిర్వహించి ఒక్కొక్క సంచికలో ఒక్కొక్క కవినో, సాహిత్య

ప్రక్రియనో, విజ్ఞాన విషయాన్నో తెలుగు పాఠకలోకానికి అందించాలని ప్రణాళిక రూపొందించినాము.

నూరేళ్ల తెలుగు నవల ప్రపంచ సాహిత్యానికి అందించిన కానుకగా చిరకాలం నిలువ గలిగే దాదాపు 22 నవలలను గురించి సాహిత్యాత్మక పరిచయ వ్యాసాలను ఇంగ్లీషులో వ్రాయించి 'Telugu Novel' గా 1974 లో ఆనందఉగాదినాడు వెలువరించనున్నది. ఆనంద ఉగాదినాడు 'సాహితీవాహిని'లో రెండవ తరంగంగా 'వేమన్న వేదం' ను వెలువరించ నున్నది. 1974 లో 'యువత' గోష్టిని నిర్వహించడానికి ప్రణాళికను సిద్ధం చేసింది. దేశంలో యువకులు నిర్వహించిన, నిర్వహిస్తున్న, నిర్వహించవలసిన పాత్రను గూర్చి సమగ్రపరిశీలన ఈ గోష్టి లక్ష్యం. దాదాపు 70 వ్యాసాల సంకలనం 'యువత' అనే పేరుతో వెలువడుతుందికూడా.

ఉడుతాభక్తితో మేముచేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు, వారి సౌహార్దం, భాషాప్రియత్వం. ఇదే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం, సామరస్యం వెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

2-12-1973

యువభారతి

---




**యువభారతి పక్ష సమావేశాలు**

యువభారతి ప్రతినెలా,
మొదటి ఆదివారం, మూడవ ఆదివారం
సుల్తాన్‌బజారులోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో
మధ్యాహ్నం 2-30 గం॥లకు సమావేశమవుతుంది.
సహృదయులందరూ ఆహ్వానితులే!

---

# పీఠిక

**శ్రీ దేవులపల్లి రామానుజరావు**

నేటి సమాజంలో అక్షరాస్యతను వ్యాపింపచేయటం ఎంత అవసరమో సాహిత్య కళాభిరుచిని కలిగించటం అంత అవసరము. తెలుగుదేశంలో సాహిత్యసాంస్కృతిక సంస్థ లెన్నో యీలక్ష్యంతో కృషిచేస్తున్నవి. యువభారతి పదిసంవత్సరాలనుండి సమాజంలో సాహిత్యచైతన్యము కలిగించటానికి ప్రయత్నిస్తున్నది. సాహిత్యసభలను పెద్ద యెత్తున జరపటం, వేలాది సహృదయులను ఆకర్షించటం, సామాన్యుల కందుబాటులో ఉండేటట్లు పుస్తకాలను ప్రచురించి తక్కువధరకే అందచేయటం, చర్చాసమావేశాలను నిర్వహించటం మొదలైన కార్యక్రమాలను యువభారతి ఉత్సాహముతో నిర్వహిస్తున్నది. పదివసంతాల వికాసానికి గుర్తుగా ఈ'వికాసలహరి'ని ప్రచురిస్తున్నందుకు ముందుగా యువభారతి నభినందిస్తున్నాను.

యువభారతి కార్యకర్తలు నాయందు గౌరవము కలవారు. నాకు వారి సాహిత్య కార్యకలాపములతో సన్నిహితమైన పరిచయ మున్నది. వారు కొన్ని ముఖ్యవిషయము లలో నాసలహాలను కూడ తీసుకొనుచుందురు. వారి ఉత్సాహము, కార్యదీక్ష నాకు వారిపై స్నేహభావము కలిగింపచేసినవి.

యువభారతి పదిసంవత్సరాల సాహిత్యసేవలో మొదటి ఆరుసంవత్సరాల కాలము ఒకయెత్తు; గత నాలుగేళ్లకాలము మరొకయెత్తు. 1970లో యువభారతి 'మారుతున్నవిలువలు - రచయితల బాధ్యతలు' అను చర్చాసమావేశమును నిర్వహించి 'రచన' అనే వ్యాససంకలనాన్ని ప్రచురించింది ఆ తరువాత 1971లో 'లహరి' ఉపన్యాసపరంపర కార్యక్రమాన్ని ఆరంభించింది. క్రమముగా- కావ్యలహరి, చైతన్యలహరి ఇప్పుడు వికాసలహరి ప్రకటితమైనవి స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా సమకాలీనసాహిత్య సమీక్షాగ్రంథమైన మహతిని విశేషకృషి చేసి యువభారతి ప్రచురించింది. ఈగ్రంథాల ప్రచురణము, సాహిత్యసభల నిర్వహణము యువభారతి ప్రతిష్ఠకు ప్రధానకారణాలు.

తెలుగు సాహిత్యము ఒక ప్రవాహము వంటిది. 'ప్రవాహినీ దేశ్యా' అనికదా పెద్దల వాక్యము. ఆప్రవాహములో కవిత, చైతన్యము, వికాసము, ప్రతిభ కనుపించును. తెలుగుకవులలో మూర్తీభవించిన వీగుణములు. ఆ కవుల సాహిత్యాన్ని సమీక్షించు ఉపన్యాస తరంగాలకు 'లహరి' అను పేరు పెట్టటం ఎంతో సమంజసంగా ఉన్నది.

ఈగ్రంథము వికాసలహరి. నన్నయభట్టు, బమ్మెరపోతన, పింగళి సూరన,

కందుకూరి వీరేశలింగము పంతులు, తిరుపతివేంకటకవులు అను సాహిత్యమూర్తులపై ఇప్పించిన ఉపన్యాసవ్యాసములసంపుటి ఇది. ఆంధ్రసాహిత్యమునకు ఆయాయుగాలలో ఆయాకవులు వికాసము కలిగించిన మాట నిజమే. కాని, వారిలో ఒక్క వికాసగుణమే కాదు, పైనచెప్పిన సాహిత్య గుణము లన్నియు ఉన్నవి. ఇందులో ఈకవుల సాహిత్యమును ఆ వికాసదృష్టితో సమీక్షించుట జరిగినది. అది ప్రధాన వివక్ష.

వికాసలహరిలో మొదటి కవితామూర్తి నన్నయభట్టారకుడు. నన్నయ ఆది కవిగా తెలుగువారికి సాహిత్యభిక్ష పెట్టినవాడు. ఆయన కావ్యకవితకు శ్రీకారము చుట్టి పది శతాబ్దాలైనది. పది వసంతాలు నిండిన యువభారతి ఈసంవత్సరం ఆమహాకవిని స్మరించటంలో ఔచిత్యమున్నది.

నన్నయభట్టు మొట్టమొదటిసారి ప్రజలభాషలో పద్యకావ్యమును నిర్మించినవాడు. సాహిత్య నిధిని సంస్కృతకోశమునుండి వెలికి తీసి సామాన్యప్రజానీకానికి పంచిపెట్టిన ఔదార్యం అతని ఉచితజ్ఞతను వెల్లడిస్తున్నది. భారతీయసంస్కృతికి భారతము పట్టుకొమ్మ. వ్యాస విరచిత మైన ఆ పంచమవేద తాత్పర్యమును తెలుగు వారికి అందింపు మని రాజరాజనరేంద్రుడు కోరగా నన్నయ కంకణము కట్టుకొనినాడు. ప్రథమాంధ్ర మహాకావ్య మైన భారతము ప్రజలలో సాహిత్యసాంస్కృతిక వికాసము కలుగుటకు ఉద్దేశించిన గ్రంథము. దాని ప్రశస్తిని నన్నయగారే ఇట్లని కీర్తించినారు-

సీ. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని, యధ్యాత్మవిదులు వేదాంత మనియు,
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, యైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీన మైపరఁగుచుండఁ జేసె భారతంబు."

భారతీయ విజ్ఞాన సర్వస్వము మహాభారతము.

నన్నయభట్టు పై ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు వ్యాసము వ్రాసిరి. వారు జగ మెరిగిన వక్తలు, పండితులు. విశేషించి నన్నయమీద సిద్ధాంత గ్రంథమును రచించిన పరిశోధకులు. వారు వ్యాసము వ్రాసినను, ఉపన్యాస మిచ్చినను విషయమును సమగ్రముగా సమీక్షించే సామర్థ్యము వారికి ఉగ్గుతో వచ్చిన విద్య. నన్నయభారతానువాదము, అతని కవితావిశేషములు, కథాకథన పద్ధతి, అక్షరరమ్యత, సూక్తినిధిత్వము మొదలైన వానిని గూర్చి విలువైన అంశములను సంగ్రహముగాను, సారవంతముగాను చెప్పినారు.

ఇక రెండవవ్యాసము బమ్మెరపోతనామాత్యుని గూర్చి. తెగులో భారతరామాయణములు ముందు వచ్చినను తరువాత వెలసిన భాగవతమే ప్రజలలో బహుళ ప్రచార మందినది. అందుకు కారణము పోతన భక్తకవియే కాక ప్రజాకవి కావడమే. భక్తిరసభరితమైన ఆయన అంతరాత్మయే రాగరంజితముగా పద్యవీణెలమీద పరవశించి

పలికినది. ఆత్మీయత ఆయన కవిత్వమును అందగించిన లక్షణము. ఆయన పద్యాలు తెలుగువారి నాలుకలకు తేనెరుచుల నందించినవి. ఆయనపద్యపాదాలే తెలుగునానుడులుగా, లోకోక్తులుగా జాలువారినవి. నేటికికూడా జనులనాలుకలపై నిత్యంగా నివసిస్తున్న తెలుగుమేటికవులలో పోతన మున్నెన్నదగినవాడు.

డా॥ సి. నారాయణరెడ్డిగారు ప్రసిద్ధకవులే కాక చక్కని వ్యాస రచయితలు, విమర్శకులు. పోతన్నకు పూర్వ మున్న సాహిత్యసంప్రదాయాలు ఆయన రచనను తీర్చిదిద్దిన విధము, భాగవతావతారికలో ప్రస్ఫుటమైన పోతన్న వ్యక్తిత్వము, ఆయన భాగవతములో నవవిధ భక్తులను ప్రపంచించిన విధము, పోతన ప్రజాకవిగా ప్రసిద్ధి పొందటానికి హేతువులైన కవితాలక్షణాల సమీక్ష-మొదలైన అంశములను రసవత్తరమైన వచనశైలిలో ఆవిష్కరించినారు నారాయణరెడ్డిగారు.

పింగళి సూరనను గూర్చి మూడవ వ్యాసము. అపూర్వ కథాకల్పనామహనీయమైన కళాపూర్ణోదయమును రచించి తెలుగుసాహిత్యములో తొలినవలగా, తొలి నాటకముగా వెలయించిన వికాసమూర్తి పింగళి సూరన. ఆంగ్లమహాకవియైన షేక్స్పియరుకు దాదాపు సమకాలికుడే కాక ఆయనవలె తబ్బిబ్బుల ప్రహసనము నూహించి ఆయన కంటె విశిష్టముగా రచించిన మనీషి పింగళి సూరన. ఈకవిని తెలుగువారి షేక్స్పియర్ అనవచ్చును.

పింగళి సూరన వ్యక్తిత్వమును గురించి, కావ్యతత్త్వమును గురించి విపులమైన వ్యాసమును రచించిన డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు కవులు, పండితులు, ఉత్తమవిమర్శకులు డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారినుండి కళాపూర్ణోదయ కావ్య పర్యాలోచనము మొదలైనది. తరువాత ఎందరో మహానుభావు లెన్నియో అంశములను పేర్కొనినారు. డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు కొన్ని విశేషములైన నూత్నాంశములను ఈ వ్యాసములో ప్రతిభావంతముగా ప్రతిపాదించినారు. వానిలో కలభాషిణీ కథాకల్పనలకు బీజములు సరస్వతీచతుర్ముఖుల ప్రణయకేళీ ఘట్టమున ప్రవర్తిల్లినవారి ముఖబింబ ప్రతిబింబ సంచలనాత్మకమైన చేష్టా విశేషములలో వ్యంగ్యముగా నిక్షిప్తమై యున్నవని వారు చేసిన నిరూపణము నిపుణముగా ఉన్నది.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు నవ్యాంధ్ర సాహిత్యయుగపురుషులు. కట్టమంచి రామలింగారెడ్డిగారి మాటలలో ఆయన 'ఆంధ్రసాహితీ పునరుద్ధరణ ప్రభావుడు.' 'దక్షిణదేశవిద్యాసాగరుడు.' పంతులుగారి సమాధిమీద కత్తిని చిహ్నముగా చెక్కించవలెనని రామలింగారెడ్డిగారు చేసిన సూచన సమంజసముగా ఉన్నది. సాహిత్య కర్మవీరు డని ఆ సంకేతమునకు వ్యాఖ్యానము. పంతులుగారు వినూత్న సాహిత్య ప్రక్రియావిష్కర్తలే కాక గొప్ప సంఘసంస్కర్తలు. స్త్రీ విద్యావ్యాప్తి, వితంతు వివాహము ఆయన చేపట్టిన సాంఘికసంస్కరణలలో ముఖ్యము లైనవి. ప్రఖ్యాత కవయిత్రి, రాజనీతిదక్షురాలు అయిన సరోజినీదేవి నాయుడు గారి వివాహము హైదరాబాదులో పంతులుగారి అధ్వర్యముననే జరిగినది. తమిళదేశములో వీరేశలింగము పంతులుగారు ఆదరగౌరవాలు పొందుటయే కాక వారి సాహిత్యములో ఒకస్థానము

సంపాదించుకొనిరి. సుబ్రహ్మణ్య భారతి తమిళరచనలో వీరేశలింగముగారి ప్రశంస కలదు. చంద్రికకథ దానికి తార్కాణము.

శ్రీ ఆరుద్ర అభ్యుదయకవులేకాక, సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర రచయితలు. నవయుగ వైతాళికుడైన వీరేశలింగము పంతులుగారి వ్యక్తిత్వము, జీవిత విశేషములు, సంఘసేవ, సాహిత్యకృషి, అభ్యుదయ భావములు, తరాల అంతరాలవలన చరమ జీవితములో ఆయన ఎదుర్కొనిన సమస్యలు, భాషాసాహిత్యములను గూర్చి ఆయన కున్న అభిప్రాయములు, మూఢాచారములను ఆయన సంస్కరించిన విధానము మొదలైన అంశాలను శ్రీ ఆరుద్రగారు తమ సహజమైన నిశితవిమర్శ దృష్టితో సమీక్షించినారు.

వికాసలహరిలో చివరివ్యాసము తిరుపతివేంకటకవులను గురించి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు వ్రాసినది. ఆజంటకవులలోని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారికి స్వయముగా తమ్ముని కుమారులైన అవధానిగారు ఆకవులను గురించి వ్రాయుటలో ఔచిత్య మున్నది. తిరుపతివేంకటకవులు అవధాన ప్రక్రియను చేపట్టి ఆశుకవితకు మారుపేరుగా నిలిచినవారు. అవధానిగారు పేరులోనే ఆ ప్రక్రియను సాధించి తరువాత సాధనచేసి సార్థకనామధేయులైనారు. రాజాంతఃపురాలలో, శబ్దాలంకారాల పంజరాలలో చిక్కుకొని యున్న తెలుగుభారతిని ప్రజల నడుమకు తెచ్చి పూలపల్లికిలో ఊరేగించి, కవితను ఒక మహోద్యమముగా ప్రజలలో వ్యాప్తి చేసిన వాఙ్మయమూర్తులు తిరుపతి వేంకటకవులు. వారి ఆశువులు, నానారాజ సందర్శనములు, శ్రవణానందాది కృతులు, భారతనాటకములు, వాదములు, వివాదములు, కథలు గాథలు సాహిత్య చరిత్రలో ఒక నూతనాధ్యాయమును సృష్టించినవి. వారు అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాతలు ప్రసిద్ధాధుని కాంధ్ర మహాకవులందరు వారి శిష్యులో, ప్రశిష్యులో, ఏకలవ్య శిష్యులో అయి ఉన్నారు. వారు కవితనే కాక కవికుటుంబమును సృష్టించిన మహానుభావులు.

తిరుపతివేంకటకవుల సాహిత్యవైభవము నంతటిని ప్రత్యక్ష మొనర్చినట్లు ప్రత్యంశ వివేచనాత్మకముగా డా॥ అవధానిగారు వ్యాసమును సంతరించినారు.

ప్రాచీన సాహిత్యములోని నిగ్గును, నవ్యసాహిత్యములోని నాణ్యమును సమాజము గుర్తించి నప్పుడే సాహిత్యమును ఒక సమన్వయ మార్గముతో సమీక్షించుటకు వీలుండును. అట్టి వికాసమును యువభారతి 'లహరి' ఉపన్యాస పరంపర వలన సాధింప యత్నించటం ముదావహమైన విషయము.

యువభారతివారి రాబోవు ప్రచురణము 'ప్రతిభాలహరి.' తెలుగుకవులలో ప్రతిభారూపమున భాసించు అయిదుగురుమహాకవులను గూర్చి ఆ గ్రంథము వెలువడ నున్నది. భావి కార్యక్రమముల ప్రణాళికను ముందుగానే నిర్ణయించుకొని క్రమబద్ధముగా, నిర్మాణాత్మకముగా నిర్వహించుట యువభారతి సహజలక్షణము. అట్టి సుశిక్షితశీలము యువతరమునకు అవసరము. యువభారతికి ఉజ్జ్వలభవిష్యత్తు కలుగవలె నని ఆశించుచున్నాను.



# వికాసలహరి

# అనుక్రమణిక

# ఆదికవి, వాగనుశాసనుడు

# నన్నయభట్టారకుడు

## ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

వాచా మాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమోఽభవత్
ఆచార్యం తం కవీంద్రాణాం
వందే వాగనుశాసనమ్.

ఆంధ్ర భాష క్రీ.శ. ప్రథమ శతాబ్దినుండియు జనవ్యవహారములో నుండెనని యూహించుట కాధారములున్నను, ఆఱవ శతాబ్దిలో రేనాటి చోళులు దానిని శాసనములలో వాడునంతవఱకును దాని లిఖితస్వరూపము మనకుఁ గానిపింపదు. ఇంతవఱకు లభ్యములైన తెనుఁగు శాసనములలో క్రీ.శ. 575 నాఁటి ధనంజయుని కలమళ్ళ శాసనము మొదటిదని చెప్పవచ్చును. తరువాత తూర్పు చాళుక్య రాజులును వారికడ దండనాథాదులుగఁ బనిచేసిన యుద్యోగులును తెలుఁగుభాషలోఁ బెక్కు శాసనములను వ్రాయించిరి. వానిలోఁ గొన్ని కేవల గద్యమయములుగను, గొన్ని కేవల పద్యమయములుగను, గొన్ని గద్య పద్యమయములుగను గానవచ్చుచున్నవి. ఆరంభ శాసనములు ప్రాకృత శబ్దమయములుగా గోచరించుటచేఁ గొంతవఱకు దుర్బోధములుగా నుండును. క్రమముగాఁ దత్సమములు ప్రాకృతశబ్దముల స్థానము లాక్రమించియున్నవి. చాళుక్య భీముని కొఱవి శాసనమునందలి వచనము కొంచెమించుమించుగా నన్నయ భారతమునందలి వచనమునే పోలియుండును. పద్యమయములైన శాసనములలో తరువోజ, సీసము, మధ్యాక్కర, గీతము మున్నగు దేశిమార్గమునకు చెందిన పద్యములే వాడఁబడినవి. క్రీ.శ. 11 వ శతాబ్ది ఆరంభమునందలి కామసాని గూడూరు శాసనములో సంస్కృతమునుండి గ్రహింపఁబడిన వృత్తములుగూడ వాడఁబడినవి. ఆ కాలములో పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున పేర్కొన్న వాలేశు పదములు, గొబ్బిపదములు, వెన్నెల పదములు మున్నగు దేశిమార్గమునకు చెందిన పదములును, పాటలును కొన్ని వ్రాయఁబడి యుండవచ్చును. అవిగాక పద్మకవి, సర్వదేవుఁడు మున్నగువారు రచించిన ప్రౌఢసాహిత్యముగూడఁ గొంత యుండెనని విమర్శకు లూహించుచున్నారు. కాని యది యిప్పుడు లభ్యము కాకపోవుటచే దాని యథార్థ

స్వరూపమునుగూర్చి చెప్పుట కవకాశము లేకున్నది. కాఁగా మన కిప్పుడు లభించుచున్న యాంధ్రకావ్యములలో నన్నయ రచించిన భారతభాగమే యాద్య మని చెప్పఁదగి యున్నది. అందుచేతనే యాతని కాదికవి యను బిరుదముగూడ లభించినది. దానికంతకు ముందు తెలుఁగునఁ గావ్యములు వ్రాసినవారు లేనేలేరని యర్థముకాదు. మొట్టమొదట సలక్షణమైన భాషలో నుదాత్త వస్తుకమైన మహాకావ్యమును వ్రాసినవాఁ డతఁడే యగుటచే నతని కాబిరుదము కల్గినది. అతఁడు తన కాలమున వాడుకలో నున్నట్టియు, అంతకు ముందు శాసనాదులలో వాడఁబడినట్టియు తెనుఁగుభాష కొక స్థిరత్వ మొసంగి, సంస్కృతమునందలి పెక్కు పదములను దత్సమరూపమునఁ దెనుఁగున వాడుకొనుట కనువైన నియమము లేర్పఱిచి, అందుండి పెక్కు వృత్తములనుగూడ నెరవు తెచ్చుకొని ప్రథమ మహాకావ్య రచనాభారము ను వహించెను. ఆ విధముగా నతఁ డాంధ్రజాతికిని, ఆంధ్ర భాషాసంస్కృతులకును గలిగించిన వికాస మింతింత యనరాదు.

నన్నయ యెచ్చట జన్మించెనో యాతని తల్లిదండ్రు లెవరో యిదమిత్థమని చెప్పుటకుఁ దగిన యాధారములు లభించుటలేదు. ఆతఁ డాదిపర్వారంభమునందలి యవతారికలో "తనకులబ్రాహ్మణు" నిత్యాదిగా వ్రాసికొన్న సీసమువలన నాతని విద్యాపాండితీ ప్రతిభా సంపదలే తెలియవచ్చుచున్నవి కాని యాతని చరిత్ర మేమియుఁ తెలియుటలేదు అతఁడు రాజరాజునకు కులబ్రాహ్మణుఁడనియు, నవిరళ జప హోమతత్పరుఁడనియు, విపులశబ్దశాసనుఁ డనియు, సంహితాభ్యాసుఁడనియు, బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాన నిరతుఁ డనియు, నాపస్తంబసూత్రుఁ డనియు, ముద్గలగోత్రజాతుఁ డనియు, లోకజ్ఞుఁ డనియు, నుభయభాషా రచనాభిశోభితుఁ డనియు, నిత్యసత్య వచనుఁ డనియు, మత్యమరాధిపాచార్యుఁ డనియు, బాత్రుఁ డనియు, నవదాతచరిత్రుఁ డనియు దానివలనఁ దెలియుచున్నది పృథుచరిత్ర కావ్యమున పట్టమట్ట సరస్వతీ సోమయాజి "నన్నయ భట్టుగారు యజనం బొనరించిన చోట జమ్మిచెట్టున్నది తణుకు తూర్పున సమున్నతమైనది" యని వ్రాసియుండిరి. ఇతఁడుతప్ప మఱి ఎవ్వరుకాని నన్నయ యజ్ఞ మొనరించెనని కాని, సోమయాజి అనికాని చెప్పి యుండలేదు. రాజరాజ నరేంద్రుని యనంతరము నన్నయ జీవించినచో నతఁడు ప్రస్తుతము పశ్చిమ గోదావరీమండలమున నున్న యా తణుకున కేఁగి యజ్ఞము కావించి యుండె నని యూహ చేయవచ్చును ఈ యూహకు సరస్వతీ సోమయాజి వ్రాఁతతప్ప నాధారాంతరము కానరాదు.

కులబ్రాహ్మణ శబ్దార్థమును గూర్చి పలువురు విమర్శకులు పెక్కు వాదోపవాదములు గావించియున్నారు. వాచస్పత్యమున 'కులవిప్రః పురోహితః' అని యుండుటచేఁ గొందఱు కులబ్రాహ్మణుఁ డనఁగాఁ బురోహితుఁ డనియుఁ,బురోహితులు సాధారణముగా వైదికులై యుందురు కావున నన్నయయు వైదికశాఖకు చెందిన బ్రాహ్మణుఁడేయై యుండు ననియు భావించియున్నారు. చాళుక్య రాజ్యాంగమునఁ బంచప్రధానులుండిరి. వారిలోఁ బురోహితుఁ డొకఁడు. అందుచే నప్పుడు పురోహితత్వము కూడఁ బ్రధానత్వముతో సదృశమై గౌరవాస్పదమై యుండెనే కాని న్యూనతాపహమై యుండి

నది కాదు. ఆ రోజులలో బ్రాహ్మణులందు నియోగి వైదిక భేదములు సుస్థిరముగా నేర్పడెనని చెప్పుట కాధారములు లేవు. నామాంతములఁ గనవచ్చు భట్టామాత్యశబ్దములనుబట్టి వైదిక నియోగి శాఖల నూహించుట కవకాశము లేదు. ఏలయన నొకే కుటుంబమునకు చెందిన వ్యక్తులకే యా రెండు పదములును వాడఁబడియుండుట గోచరించుచున్నది. అందుచే కులబ్రాహ్మణ విశేషణమును బట్టి నన్నయ రాజరాజునకుఁ బితృపితామహ క్రమమున వచ్చిన బ్రాహ్మణుఁడైన మంత్రియనియు, వేదవేదాంగ విదుఁడైన విప్రోత్తముఁడనియు మాత్రము చెప్పవచ్చును.

రాజరాజు క్రి. శ. 1002-1061 వఱకు జీవించియున్నట్లు తెలియుచున్నది. అతని తండ్రి విమలాదిత్యుఁడు 1019 వ వత్సరమున మరణించినను శత్రువులయు, దాయాదులయు నాటంకముచేఁ తరువాత మూడేండ్లవఱకును రాజరాజు చాళుక్య సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁడు కాఁజాలకపోయెను. అతని సవతితమ్ముఁడైన విజయాదిత్యుఁడు తండ్రి మరణించినప్పుడే కాక తరువాతఁగూడ నవకాశము చిక్కినప్పుడెల్ల రాజరాజును ద్రోసిరాజని తాను చాళుక్య సింహాసనము నాక్రమింప యత్నించుచునే యుండెను. అతనికి పశ్చిమ చాళుక్య రాజులు కొంతసాహాయ్య మొనరించు చుండిరి. రాజరాజు చేయునదిలేక 1051 వ సంవత్సరమున పశ్చిమ చాళుక్యులతో సంధి గావించుకొనెను. అతఁడు ప్రశాంతముగా రాజ్యపాలనము కావించిన దప్పటినుండియే. ఈ సమయముననే యతఁడు స్వస్థచిత్తముతోఁ గావ్యగీత ప్రియుఁడై యానందమునఁ గాలము పుచ్చుచు నన్నయచే భారతాంధ్రీకరణము చేయించి యుండెనని పలువురు విమర్శకుల అభిప్రాయము. నన్నయ యారణ్య పర్వమందలి మూఁడాశ్వాసములపై 142 పద్యములను వ్రాసి భారతరచన నాపివేయుటకు నిజమైన కారణ మేదో తెలియదు. అతఁ డంతవఱకే రచించెనని తాళపత్ర ప్రతులందలి సూచనవలన తెలియుచున్నది. రాజరాజ నరేంద్రుని తరువాత రాజకీయముగాఁ గలిగిన మార్పుల మూలమునఁ బోషించు ప్రభువులు లేక నన్నయ విరక్తుఁడై రచన నాపివేసియుండునని కొందఱును, ఆరణ్యపర్వ రచనా దుష్ప్రభావముచేతనో, మఱి యేకారణము చేతనో మతి భ్రమించుటచే నన్నయరచన నాపివేయవలసి వచ్చెనని కొందఱును తలంచుచున్నారు. వీనిలో మొదటి హేతువే కొంతవఱకు సమంజసముగాఁ గానవచ్చుచున్నది.

నన్నయ భారత భాగమునే కాక చౌడేశ్వరీ విలాసమును చాముండికా విలాసమును, ఆంధ్రశబ్ద చింతామణి, ఇంద్ర విజయము, రాఘవాభ్యుదయము అను గ్రంథములనుగూడ రచించి యున్నట్లు లోకమునఁ బ్రతీతి యున్నది. వీనిలో ఇంద్రవిజయ రాఘవాభ్యుదయము లెచ్చటను లభ్యములగుటలేదు. చౌడేశ్వరీ విలాసమున 120 పద్యములతోఁగూడిన మూఁడాశ్వాసము లున్నవి. గ్రంథారంభమునందలి సీసపద్యములో "ఘనత రాజేంద్రుని కరుణవడసినట్టి వాఁడను నన్నయభట్టు నేను" అని యుండుటచే నీకావ్యమును రచించినవాఁడు రాజరాజనరేంద్రుని కృపకు పాత్రుఁడైన నన్నయయేయని తలంపవలసి యున్నను అందలి వస్తువును, పద్య రచనా విధానమును, సీసములందలి యతినియమములును అది నన్నయరచన కాదని సూచించుచున్నవి.

ఆంధ్ర శబ్ద చింతామణి కర్తృత్వమునుగూర్చి అది నన్నయయే రచించెననియు, నెవ్వరో రచించి నన్నయపేరఁ బ్రకటించియుందు రనియు రెండువాదము లున్నవి. ఉభయ పక్షములవారు చెప్పు నుపపత్తులను బలవత్తరముగనే కనిపించును. కాని ఇటీవల కొందఱువిమర్శకు లది నన్నయ కర్తృకము కాదని సహేతుకముగా నిర్ణయించి యున్నారు. నన్నయకు శబ్దశాసనబిరుద మాంధ్ర శబ్ద చింతామణి రచించి యుండు టచేతనే కలిగిన దని కొందఱి తలంపు. కాని యా బిరుద మాతనికి భారత రచనవలననే గలిగిన దని భావించుటలో దోషము లేదు. మహాభారతమును రచింపఁబూనుటకు ముందే యతఁడు శబ్దశాసనత్వమును నిర్వహింపవలసి వచ్చెను. అవతారికయందలి సీసపద్య మున తాను విపులశబ్దశాసనుఁ డని యాతఁడు చెప్పుకొనియుండుట యిందుచేతనే.

ఆదిపర్వారంభమునందలి యవతారికలో నన్నయ తాను భారతరచన కారం భించిన పరిస్థితులు చక్కగా వివరించెను. అందు స్వీయ ప్రసక్తి యధికముగా వచ్చు నవకాశ ముండుటచే సహజ వినయ సంపన్నుఁడగు నతఁడు దాని నుత్తమపురుష మునఁగాక ప్రథమ పురుషమున రచించియుండెను. అందలి "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే" అను నారంభశ్లోక మాశీరాత్మకమై సంస్కృత నాటక ములందలి నాందీ శ్లోకములను బోలియున్నది. ఆశీర్వాదము సంస్కృత భాషా మయమై యుండుట యెక్కువ శ్రేయోమంగళదాయక మను తలంపుతో నాతఁడా మంగళాశాసనమును సంస్కృత శ్లోక రూపముననే కావించియుండెను ఇం దాతఁడు త్రిమూర్తులు స్త్రీపుంస యోగోద్భవమైన లోకముల స్థితి నావహింతు రని చెప్పుచు త్రిమూర్తి ప్రాయులైన కవిత్రయమువారు భారత రచనద్వారా ఆంధ్ర వాఙ్మయ ప్రపంచస్థితి నావహింతురను సూచన కావించెనని కొందఱు విమర్శకుల తలంపు. ఋషితుల్యుఁడైన నన్నయ నోట నజ్ఞాతముగ భావ్యర్థ సూచకమైన యిట్టి వాక్యము వెలువడుటలో నాశ్చర్యము లేదు. "వేదత్రయమూర్తయః" అను సమాసముచే భారతముయొక్క వేదతుల్యత్వమును 'పురుషోత్తము' శబ్దముచే పురుషోత్తముఁ డయిన శ్రీ కృష్ణునకే కాక పురుషోత్తములైన పాండవేయులకుఁగూడ భారతమునఁగల ప్రాధా న్యమును సూచితమగుచున్నది.

మంగళాశాసనము తరువాత నక్షరరమ్యతయందును, అర్థగాంభీర్యము నందును, ధారాశుద్ధియందును అనన్యసామాన్యములైన రాజరాజుకీర్తి రూపాభిజాత్య ములను, దానదయా విద్యావివేక వర్ణాశ్రమ ధర్మరక్షణ పరాయణతలను, భారత శ్రవణాసక్తిని వర్ణించు పద్యము లున్నవి. రాజరాజు పెక్కు పురాణములు వినియుం డెను; అర్థ ధర్మశాస్త్రములతెఱం గెఱింగెను; రసాన్వితములైన కావ్యనాటక క్రమ ముల నవలోకించెను. ఇందలి కావ్యనాటకములు బహుశః సంస్కృతభాషకు సంబం ధించినవే యైయుండును. కన్నడమున రత్నత్రయము రచించిన గ్రంథములుకూడ నప్పటికి ప్రసిద్ధములై యుండుటచే నాతఁడు వానినిగూడ స్వయముగా వినియో పఠిం చియో యుండుట కవకాశమున్నది. సంస్కృత నాటకములతోపా టతఁడు పాల్కురికి సోమనాథుఁడు పేర్కొనియుండిన దేశీయములైన 'బహునాటకము'లను గూడఁ జూచి

యుండెనేమో! అతఁడు పురాణ శాస్త్ర కావ్యాదుల నెన్నిటిని పరిశీలించినను తనకు మహాభారతమునందే యెక్కువ మక్కువయుండెనని తెల్పియుండెను. అందుకుఁ గారణ ములున్నవి. అతఁడు చంద్రవంశమునకుఁ జెందినవాఁడు. ఆ వంశమున జనించి విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర వర్ణించు కావ్యము మహాభారతము. దాని నాసక్తితో విన్నవారికి సువర్ణశృంగఖురమైన కపిలగోశతము నుత్తమ వేదవిప్రులకు దానముచేసిన పుణ్యాతిశయమును, బహుయాగాచరణ ఫలమును కలుగును అదిగాక యప్పటికే కన్నడ తమిళ భాషలందు రచింపఁబడియుండిన పంప పెరిందేవనారుల భారతములను రాజరాజు వినియుండుట కనకాశముండుటచే నవి తెలుఁగులో సైతము భారతము రచింపఁ జేయవలెనను కుతూహలము నాతనియందుఁ బ్రేరేచియుండును. మఱియు శివునో విష్ణువునో ప్రశంసించుచుఁ బాక్షికము లైనట్లు కనిపించు పురాణముల కంటె వేదార్థమును గథోపాఖ్యానముల ద్వారా ప్రవచించుచు సర్వ ధర్మ సమన్వయ సంధానదక్షమై యలరారు భారతమును జనసామాన్యమునకందిచ్చుట యెక్కువ యుప యోగకరమై యుండునని యాతఁడు భావించియుండును. అందుచే నతఁడు తనకు మిత్రుఁడును బ్రతిభానిధియును ఉభయ భాషా కావ్య రచనాభిశోభితుఁడు నైన నన్న యను భారతమును దెనుఁగున రచింపు మని కోరి యుండెను. అట్లు కోరునపుడు "కృష్ణ ద్వైపాయన మునివృష భాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడు" నట్లుగా రచింపు మని యతఁ డనుటలోఁ గొంత గూఢార్థ మున్నదని విమర్శకుల యభి ప్రాయము. పంప మహాకవి కన్నడమున విక్రమార్జున విజయమును వ్రాయుచు కథాంశములందు వలెనే మత సిద్ధాంతములందును గొన్ని మార్పులు కావించి యుండెను. అందతఁడు శ్రీకృష్ణుని భగవత్స్వరూపునిగాఁ గాక సామాన్య మానవునిఁగాఁ జిత్రించెను. రాజరాజీ వ్యత్యాసముల గుర్తించియే నన్నయతో వ్యాసమహాముని భార తము నందలి తత్త్వమునకు వైరుధ్యము లేకుండునట్లుగా తెలుఁగున భారతమును రచింపు మని ప్రత్యేకముగాఁ జెప్పియుండె నని విమర్శకులు భావించుచున్నారు. మఱియు సంస్కృత భారతము నందలి అర్థమేర్పడునట్లుగా తెనుఁగు రచింపుమనెనే కాని యథాతథముగా దాని ననువదింపు మని అతఁడు కోరియుండలే దనియు వారూహించుచున్నారు. పైపద్య మింత సాభిప్రాయముగా రచింపఁబడెనో లేదో చెప్పఁ జాలము కాని యందాభావములు స్ఫురించుట కవకాశములు మాత్రము లేక పోలేదు.

రాజరాజు భారతమును తెనుఁగున రచింపు మని కోరఁగానే నన్నయ యంగీకార సూచకముగాఁ దల యూపియుండ లేదు. అప్పటికి తెలుఁగు భాష అవ్యవస్థితమును అవిస్తృతమునునై యుండెను. అట్టి భాషలో భారతము వంటి మహాకావ్యమును రచిం చుట యెంతక్లేశకరమో యాతఁ డెఱుంగును. అందుచే నతఁడు దుర్గమార్థజల గౌరవ భారత భారతీ సముద్రము దఱియంగ నీదుటకు విధాతకుఁ గూడ శక్యము కాదన తన మాట వేఱుగాఁ జెప్ప నేల యని వినయమునఁ దన యసమర్థతను సూచించియు 'ఐనను దేవా నీయనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునఁ జేసి నానేర్చు విధంబున

నిక్కావ్యంబు రచించెద' నని విన్నవించెను. అతఁ డిక్కావ్యంబు ననుటను బట్టి తాను సంస్కృతమున నితిహాస మాత్రముగా నున్న దానిని దెనుఁగునఁ గావ్యముగా సంత రింప నెంచెనను భావము వ్యక్తమగుచున్నది.

నన్నయ హరిహరాజ గజాననాది దేవతలకును, వాల్మీకి వ్యాసులకును నమస్కృతు లొనరించి సత్సభాంతర సరసీవనములను గొనియాడి యుండెను. ఆరోజులలో కవుల రచనలందలి గుణాగుణ విమర్శ చేయుటకును, భాషా సారస్వతాభ్యుదయ మార్గములను సూచించుటకును గొన్ని విద్వత్పరిషత్తులు నెలకొల్పఁ బడి యుండును. ఆ పరిషత్తులే నన్నయ కొనియాడిన సత్సభలు. పర్వ సంగ్రహము చెప్పు సందర్భమున నతఁడు పండితసభలను బేర్కొనుట యీ విషయమును బలపఱుచుచున్నది. అట్టి విద్వత్సభల నెలకొల్పు సంప్రదాయము దక్షిణ దేశమునఁ జిరకాలమునుండియు నుండె ననుటకు తమిళదేశమునందలి సంఘములు తార్కాణము. నన్నయ వంటి ప్రముఖ విద్వత్కవులందఱికిని తెలుఁగు దేశము నందలి సత్సభలలో నుచితమైన స్థానముండి యుండును. నన్నయ వానిని గొనియాడిన విధము వాని గుణ విశేషములను వానిపై నతనికిఁ గల గౌరవభావమును విశదము చేయుచున్నది.

అవతారిక యందలి తుది రెండు పద్యములును మిక్కిలి ప్రధానములైనవి. అందు మొదటిది నన్నయ కాతని సహాధ్యాయుఁడైన నారాయణభట్టు భారత రచనమున సాహాయ్యము కావించిన విషయమును. రెండవది నన్నయ కవిత్వమునఁ గల గుణ విశేషములను వ్యక్తము చేయుచున్నవి. నందంపూడి శాసనమున నన్నయ నారాయణ భట్టునకుఁ గల వివిధ భాషా పాండిత్యమును కవితా కౌశలమును విశదముగా వర్ణించి యున్నాఁడు. అతఁడు కవియు పండితుఁడును మాత్రమేకాక రాజనీతి ధురంధరుఁడు కూడ నైయుండె ననుటకు తార్కాణము లున్నవి. నారాయణభట్టు భారత రచనమున నన్నయకుఁ గావించిన సాహాయ్య మెట్టిదో యిదమిత్థ మని చెప్పుట కాధారములు లేవు. అప్పటికి తెలుఁగులో నాదర్శములని చెప్పఁదగిన కావ్యములుగాని పదచ్ఛందో విస్తృతులు గాని లేకుండుటచేతను, భాష యస్తవ్యస్తమై రూపవైవిధ్యముతోఁ గూడి యుండుట చేతను, అందు మహాభారతము వంటి యుదాత్త కావ్యమును రచించు టెట్లా యని సంశయించుచుండిన నన్నయకు కురుక్షేత్రమునఁ దనతోఁ బోరుటకు వచ్చిన గురుపితా మహభ్రాతృమిత్రాది వర్గములను గాంచి విషణ్ణుఁడై రథమునఁ గూలఁబడిన యర్జునునకు శ్రీకృష్ణుఁడువలె నారాయణభట్టు భుజముతట్టి ధైర్యము చెప్పి యుచితమైన ప్రోత్సాహ మొసఁగియుండును. ఆదియునుగాక పంచమవేద మని ప్రశస్తిగాంచిన మహాభారతమును దేశభాషయైన తెలుఁగులో రచించుట కప్పుడు పండితులు గాని పూర్వాచార పరాయణులుగాని సమ్మతించియుండరు. అట్టియెడ కన్నడమున భారత మంతకుముందే రచితమై యుండుటను, అట్టి కావ్యము తెలుఁగులో నప్పుడు రచించుట అవసరమై యుండుటను సూచించి నారాయణ భట్టు వారిని ప్రసన్నులఁ గావించి వారివలన నెట్టి యాటంకమును లేకుండఁ జేసియుండును. మఱియు వ్రాయఁబోవు కావ్యమున నెట్టి భాష వాడవలయును, దానిని పద్యమయముగాఁ జేయవలెనా చంపువుగా సంతరింపవలెనా

అను విషయమునఁ గూడ నతఁడంతకు ముందున్న కన్నడకవుల మార్గమును జూపి నన్నయకు త్రోవ చూపియుండును. సంస్కృత భారతము మహా గహనము వంటిది. అందుఁ బ్రధాన కథాగమనమున కాటంకము కలిగించు ఘట్టము లెన్నో యుండును. దానికిఁ దో డప్పటికే యందుఁ గొన్ని ప్రక్షేపములు ప్రవేశించి యుండును ఆంధ్రీకరించు సందర్భమున వేనిని దగ్గింపవలెను, వేనిని పెంచవలెను, వేనిని పూర్తిగా విడువవలెను, వేని నన్యథాకరింపవలెను అను విషయమునఁ గూడ నారాయణభట్టు మిత్రున కుచితమగు నుపదేశమొసగి యుండును. అంతేకాక యితర పండితులు వివాదములు లేవనెత్తినప్పు డతఁడు నన్నయకు బాసట గానిల్చి వారికి వాకట్టుకట్టి యుండును. ఇదంతయు నారాయణభట్టు నన్నయకుఁ గావించియుండిన సాహాయ్యమును గుఱించిన యూహ మాత్రము.

రాజరాజు నన్నయను భారతమును రచింపుమని కోరుటకును, నన్నయ యందు కంగీకరించుటకును, దేశభాషా సముద్ధరణముతోపాటు వైదికమతోద్ధరణాసక్తియుఁ గొంతవఱకుఁ గారణమై యుండెననుటకుఁ గొన్ని యాధారములు గోచరించుచున్నది. అంతకుఁబూర్వ మాంధ్ర దేశమున బౌద్ధ జైనమతము లధిక ప్రచారము పొంది యుండెను. బౌద్ధజైన మతానుయాయు లాయాదేశభాషలను నేర్చుకొని, తమ తమ మతముల మహత్త్వమును సామాన్యజనులలోఁ బ్రచారము చేసి, వారిని దమమతములలోనికిఁ బరివర్తనము కావింపయత్నించుచుండిరి. రాజరా జది గాంచి సంస్కృత భాషా పరిచయము లేని సామాన్యజనులకు వైదికమత మహత్త్వము నెఱింగించుటకై పంచమవేదమైన మహాభారతము నాంధ్రీకరింపఁ జేయవలె నని తలంచి యుండును. మఱియు నన్నయ మూలమున లేకున్నను బెక్కుచోట్ల వేదములను, వేదచోదితవిధులను, వేద విప్రులను బ్రశంసించుచు వాడిన విశేషము లాతని మానసమున వైదికమతోద్ధరణ భావము గూడ జాగరితమై యుండెనని వ్యక్తము చేయుచున్నవి. అతఁ డాశ్వాసాద్యంతములందు రాజరాజును వర్ణించుచు వాడిన విశేషములు గూడ నీ విషయమును బలపఱుచుచున్నవి.

సాధారణముగా విమర్శకు లాంధ్రభారతము వ్యాసభారతమున కాంధ్రీకరణ మని చెప్పుదురు కాని యిది స్థూలముగా చెప్పునట్టిమాట. కవిత్రయము వారు సంస్కృత భారతమును క్షుణ్ణముగా పఠించి తమ కనవసరమని తోఁచిన భాగములను దగ్గించియు, నవసర మనితోఁచిన భాగములను బెంపు కావించియు, నశ్లీలములని తోఁచిన భాగముల నన్యథాకరించియుఁ దమ రచన నొక స్వతంత్ర మహాకావ్యమా యనునట్లు తీర్చి దిద్దిరి. వారి యనువాద పద్ధతిని కథానువాద పద్ధతి యని చెప్పవచ్చును. వారు మూలము నందలి కథా సూత్రమున కేభంగమును కలుగనీయక స్వప్రతిభాను కూలముగా కథాకథనరస పాత్ర పోషణాదుల నొనరించుచుఁ దమ యనువాదము నొక విశిష్టమార్గమున వెలయించిరి. వ్యాసుఁడు వేదనిక్షిప్తములైన ధర్మనీతి తత్త్వాదులను సర్వజన సుబోధములు గావింపవలె నను ఉద్దేశముతో భారతమును గథోపాఖ్యాన సుందరముగ సంతరించెను. ఆతని రచనమున కావ్యకళావృష్టి కంటె

పౌరాణిక నైతిక దృష్టి హెచ్చుగా గోచరించును. కవిత్రయము వారికిఁ గూడ ధార్మిక దృష్టి లేకపోలేదు కాని దానితో పాటు వారికిఁ గావ్యకళాదృష్టి గూడ పుష్కలముగా నున్నది. నన్నయ "యిక్కావ్యంబు రచియించెద" ననియు, తిక్కన "యమ్మహా కావ్యంబునర్థంబు సంగతంబు చేసెద" ననియు నుడివియుండుట వారు మూలమును యథాతథముగా ననువదించుటకుఁ గాక తదర్థ వివరణము గావించుటకే యత్నించి రనియు, దానిని మహా కావ్యముగా రూపొందింప నుద్దేశించి రనియు స్పష్టము చేయు చున్నది. వారి రచన వట్టి యనువాదమును గాదు, అతిస్వతంత్ర రచనమును గాదు. దానిని స్వతంత్రమైన యనువాదమని చెప్పవచ్చును.

సంస్కృత భారతము వ్యాసునినాఁటినుండి నన్నయ నాఁటివఱకు నొకేరూపమున నుండక ప్రక్షేప విక్షేపములకు గుఱియైనది. దాని ప్రతులు వివిధ రాష్ట్రములలో వివిధ రూపములతో వెలసియున్నవి. వానిని ప్రధానముగా దాక్షిణాత్యవర్గము, ఔత్త రాహ వర్గము—అని రెండు వర్గములుగా విభజింపవచ్చును. కొన్నిచోట్ల నుత్తర దక్షిణ పాఠముల సమ్మేళనతోఁ గూడిన ప్రతులుండుటకును అవకాశమున్నది. అందుచే నన్నయాదుల యనువాదమును గూర్చి ఏదైన చెప్పుటకు ముందు వారే మూలప్రతి ననుసరించియుండిరో నిశ్చయించుట ప్రథమ కర్తవ్యము. నన్నయ దాక్షిణాత్యుఁడగుటచే దాక్షిణాత్య వర్గమునకు చెందిన యొక ప్రతిని గ్రహించి యనువాద మారంభించి యుండునని సామాన్యముగా నూహింపవచ్చును. కాని యుత్తరప్రతులలోమాత్ర ముండి దక్షిణప్రతులలో నెచ్చటను గనరాని భాగముల యనువాదములు నతని రచనలో నెడనెడ గోచరించుచున్నవి. అతఁడు దాక్షిణాత్యవర్గమునకు చెందిన తెలుఁగులిపిలో వ్రాయ బడిన యొకప్రతిని ప్రధానముగా గ్రహించి, భిన్నదేశములందలి భిన్నప్రతులను పరిశీలించి, యం దవసరములైన కొన్నిమార్పులు కావించి, తన యనువాదమునకు మూలము నేర్పఱుచుకొని యుండె నని భావించుట యుక్తముగా నుండును. నన్నయ యిచ్చిన లెక్క ననుసరించి యాదిపర్వమునందలి శ్లోకముల సంఖ్య 9984. అతఁడు రచించిన యాదిపర్వమునందలి గద్యపద్యముల సంఖ్య 2091. దీనినిబట్టి సంస్కృత భారత మనువాదమున నాల్గవవంతునకు తగ్గింపఁబడినట్లు గోచరించును. కాని సంస్కృ తమునందలి యనుష్టుప్ శ్లోకములకును తెలుఁగునందలి పద్యములకును పరిమితిలో చాల వ్యత్యాస ముండుటచే సంస్కృతభారతము తెలుఁగున కొంచె మించుమించుగా సగ మునకు తగ్గింపఁబడిన దని చెప్పుట యుక్తముగా నుండును. మూలమునందలి వర్ణనము లను, ప్రశ్నోత్తరములను, వ్యక్తి నామ పట్టికలను, దర్మతత్త్వనీతి విషయకోపన్యాస ములను అతఁడు సంక్షేపించుటయే యీ తగ్గుదలకు కారణము. ఈ సంక్షేపము వలన ప్రధాన కథాభాగమున కెచ్చటను అంతరాయము కాకుండుటయే కాక యనవసర విషయ విస్తరణము తగ్గుటచే దానికొక విధమైన ప్రసన్నతగూడ నేర్పడినది.

అనువాద మొనర్చునప్పుడు నన్నయ ప్రధానకథతో నంతగా సంబంధములేని విషయములను, అనౌచిత్యమయములుగాఁ గనుపట్టు విషయములను, తత్త్వవిషయ బాహుళ్యముతోఁ గూడిన విషయములను బూర్తిగా విడిచివేసి యుండెను. మూలమున

భారతారంభమునందుఁ గనవచ్చు "యదాశ్రౌష పర్వమును", ఉపమన్యువు, ఆరుణి, వేదుఁడు అను ధౌమ్యుని ముగ్గురు శిష్యుల వృత్తాంతమును నన్నయ విడిచివైచెను. సహదేవుఁడు జయించిన రాజులను వర్ణించు సందర్భమున సభాపర్వమునందు సంస్కృతములో "ఆంధ్రాం స్తలవనాం శ్చైవ" అని ఆంధ్రులుకూడ పేర్కొనఁబడియున్నారు. ఆంధ్రాభిమానముచేఁ గాఁబోలు నన్నయ యా పట్టికనుండి యాంధ్రులను దొలఁగించెను. దుర్యోధనుఁడు పాండవ వైభవమును జూచి యీర్ష్యచే కృశించినప్పుడు మూలమున నతనికి శకుని సందర్భోచితమును ధర్మసహితమును నైన యుపదేశ మిచ్చియుండెను. సహజ కుటిలుఁడైన శకునిప్రకృతి కిట్టి ధర్మోపదేశము విరుద్ధమగుటచే నన్నయ దానిని విడిచివైచెను. మూలమందరణ్య పర్వమున పాండవులు వనమందుండి నప్పుడు బాణపాతితములైన వివిధ మృగాదుల మాంసములను ముందు బ్రాహ్మణులకు నివేదించి తరువాతఁ దాము దినిరని వైశంపాయనుఁడు చెప్పియుండెను. తన కాలమున మాంసభోజనము బ్రాహ్మణులకు నిషిద్ధమై యుండుటచే నన్నయ యా విషయమును విసర్జించెను.

ఆదిపర్వమునందలి 79 వ యధ్యాయమున యయాతి కొడుకులను బిలిచి యొక్కొక్కరితో తన ముదిమి గైకొని యౌవనము నొసంగవలెనని పల్కుటయు, వా రందు కంగీకరింపకపోఁగా శపించుటయు వేఱువేఱుగాఁ జెపఁబడినవి. నన్నయ యయాతికొడుకుల నెల్ల రావించి యొకేమాఱు చెప్పినట్లును, వారందఱు నొకే సమాధాన మిచ్చినట్లును వ్రాసి సంగ్రహించెను. అట్లే అతఁ డష్టకాదు లడిగిన ప్రశ్నలను సమాధానములను మాత్రము యయాతిచే నుపన్యసింపఁజేసి తా నచ్చట మూలమును బుద్ధిపూర్వకముగా సంగ్రహించిన విషయమును "అని యయాతి యష్టకాదు లడిగినవానికెల్ల సంక్షేపరూపమునం జెప్పుటయు" నని వ్రాసి సూచించెను. సభాపర్వమునందలి రాజసూయయాగ సందర్భమున నేయే రాజులు వచ్చి ధర్మజుని సేవించిరో వ్యాసుఁడు పది శ్లోకములలో చెప్పియుండెను. నన్నయ వారి పేర్లన్నియు విడిచి "యయ్యుదయాస్తాచలసేతు శీతనగమధ్యోర్వీపతుల్" అని చక్కగా సంగ్రహించెను. అట్లు వ్రాయుటలో ధర్మజునిఁ గొల్చిన రాజుల యపరిమితత్వముగూడ వెల్లడి యగుచున్నది ద్యూతసందర్భమున ధర్మజుఁ డొక్కొక్క వస్తువునే యొడ్డి, దానిని వర్ణించి, "తేన దీవ్యా మ్యహం త్వయా" అనుచుండుటయు, శకుని "జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిరమ భాషత" అని పలుకుచుండుటయుఁ బెక్కుసారులు కాననగును. నన్నయ ధర్మజుఁ డొడ్డిన వస్తువుల నన్నిటిని వచనమునఁ బేర్కొని "యొక్కొక్క యొడ్డున యొడ్డి యోటువడె"నని వ్రాసి మూలమును సంగ్రహించుటయే కాక, యందలి పునరుక్తినిగూడఁ దొలఁగించెను. అరణ్యపర్వమునందలి 163వ అధ్యాయమున ధర్మజుఁడడుగ నర్జునుఁడు తా నొనర్చిన తపశ్చర్యను, శివునితోఁ గావించిన యుద్ధమును విపులముగా వర్ణించి చెప్పినట్లున్నది. ఇందలి పునరుక్తిని ఆత్మశ్లాఘాదోషమును దొలఁగించుటకై నన్నయ పై వర్ణనములను జాలవఱకుఁ దగ్గించెను. ఇట్లే యర్జునుఁడు నివాతకవచులతోఁ జేసిన యుద్ధమునుగూడ నాతఁడు చాల సంక్షేపించెను.

అనువాద మొనరించునప్పుడు నన్నయ మూలమునకుఁ బెంపు కావించిన భాగములుకూడఁ బెక్కు కానిపించును. మూలమున లేని వర్ణములను జొప్పించుటయు, నమూలకములైన భావములను వెల్లడించుటయు, మూలమందలి యొక పదమునో పద సమూహమునో యాధారముగాఁగొని యందలి భావమునే విపులీకరించుటయు, మూలమున లేని యుపమార్థాంతరన్యాసాద్యలంకారములను గల్పించుటయు, వ్యక్తివస్తు వర్ణనముల సందర్భమున నమూలకములైన విశేషణములను వాడుటయు నీ పెంపుదలకుఁ గారణములు.

ఉదంకుఁడు నాగరాజులను స్తుతించునప్పుడు మూలమున నైరావత ఫణిరాజుల యొక్కయు తక్షకుని యొక్కయు స్తోత్రములు మాత్రమే కానవచ్చుచున్నవి. నన్నయ.

బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణ సరస్వరస్వతీ
సహిత మహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడిన్.
అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా
నురగుల నెల్లఁ గాచిన మహోరగ నాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్.

అని నాగరాజులలో ముఖ్యులైన అనంతవాసుకులనుగూడ స్తోత్రము చేసియుండెను. పాండవుల కొఱకు విశ్వకర్మ నిర్మించిన ఖాండవప్రస్థపురమును నన్నయ పదిపద్యములతో వర్ణించెను. ఇందలి రెండుమూఁడు భావములు మూలమందుఁగూడ నున్నను మిగిలిన వన్నియు నన్నయ కల్పితములే ఈ పురవర్ణనము తరువాతి ప్రబంధములలోఁ గనవచ్చు పురవర్ణనముల కాదర్శమై మిక్కిలి హృద్యముగను గంభీరముగను ఉన్నది. కద్రూవినత లుచ్చైశ్శ్రవమును జూడనరిగినప్పటి సముద్ర వర్ణనము పాండురాజు మరణమునకు ముందున్న వసంత వర్ణనము ను నన్నయ స్వకపోలకల్పితములే కిరాతార్జునీయ సందర్భమున నర్జునుఁడు కిరాతుఁడు శివుఁడే యని యెఱింగిన పిమ్మటఁ దన యపరాధమును క్షమింప వేడుకొన్నట్లు సంస్కృతమున నాలుగు శ్లోకము లున్నవి నన్నయ యా వేడుకోలుతోపా టర్జునుఁడు శివుని స్తుతించిన ట్లొక దండకమును గల్పించెను. ఆంధ్ర వాఙ్మయమునందలి మొదటిదండక మిదే యని చెప్పవచ్చును.

మూలమందలి యొక పదమునో పదములనో యాధారముగా గ్రహించి నన్నయ యందలి భావము విపులీకరించుచు వ్రాసిన పద్యములు పెక్కున్నవి. దేవయాని పుత్త్రులను గనిన పిమ్మట సంప్రాప్తయౌవనయైన శర్మిష్ఠ "ఋతుకాలశ్చ సంప్రాప్తో న చమేస్తిపతిర్వృతః" అని శోకించినట్లు సంస్కృతమందున్నది. నన్నయ

ఋతుకాల సంప్రాప్తి ని,

> అసదృశయౌవనం బిదియనన్య ధనంబగు నొక్కొ-నాకు ని
> క్కు-సుమ సముద్భవమ్మ్మను నగోచర దుర్గమ దుర్గవల్లరీ
> కుసుమ సముద్భవంబగునొకో పతిలాభము లేమిఁజేసియొ
> ప్పెసఁగఁగ దేవయానిపతి నేమి తపంబొనరించి కాంచెనో.

యని సరసముగా వర్ణించెను. సభాపర్వమున శిశుపాలుఁడు కోపమున సభ విడిచి వెడలి పోయినప్పుడు ధర్మజుఁ డాతనిఁ బట్టువఱుచుచు వెంటఁజని "వేదతత్త్వేన కృష్ణం హి భీష్మ శ్చేదిపతే భృశ"మ్మని చెప్పిన శ్లోకార్థము నాధారముగాఁ జేసికొని నన్నయ,

> "ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు, వే
> దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు, లో
> కాది, త్రిలోక పూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
> మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని యుక్తము కాకిది యేమి దోసమే"

యని లెస్సగా వివరించెను.

నన్నయ మూలమున నిరలంకారములై విషయమును మాత్రము ప్రతిపాదించు శ్లోకములను సాలంకారముగా సంతరించి పౌరాణికమైన శైలికిఁ గావ్యోచితమైన ప్రౌఢిమ కలిగించిన పట్లనేకము లున్నవి శమంతకాక్షౌహిణీ కథన సందర్భమునందలి "త్రేతా ద్వాపర సంధి నుద్ధత మదాంధీభూత విద్వేషిజీమూతోగ్రశ్వసనుండు రాముఁడు" అను పద్యమును, సభాపర్వమున పాండవులు సుఖాసీనులై యుండ వారిని జూచుటకై నారదుఁ డరుదెంచెనను సందర్భమునందలి "నీరజమిత్రుఁ డేల ధరణీగతుఁడయ్యెడు నొక్కొ యంచు" నిత్యాది పద్యమును, నలోపాఖ్యానమందలి "చనుప యిట్టి పాటఁ బెనుపఱి యవినీతు సిరియుఁబోలె నడఁగి విఱిసి చనియె" "ఉరుతర సార్థపయోరాశి హస్తి యుధాగస్త్యుచేఁ బీతమయ్యె మఱియు" నను పద్యభాగములును ఇందుకు నిదర్శనములు. ఇట్లే నన్నయ మూలమందు లేకున్నను బెక్కుచోట్ల నర్థాంతరన్యాసాలంకారములను కల్పించి చొప్పించెను. వ్యక్తులను వర్ణించు సందర్భమున- ముఖ్యముగా వారిని ప్రథమమునఁ బ్రవేశపెట్టునపుడు-నన్నయ మూలమున లేని విశేషణములను వాడుచు వారి శీలస్వరూపములను బఱితలకుఁ జక్కగా వ్యక్తము చేయుచుండును.

మూలమునందున్న కొన్ని కథాంశములను మార్చుట యవసరమని తోఁచి నప్పుడు నన్నయ వాని నించుకమార్చి యౌచిత్యమును పోషించుటకు యత్నించెను. నాగకుల మెల్లఁదనకు వశము కావలెనని యుదంకుఁడు దివ్యపురుషుని బ్రార్థించి నపు డతఁడు "ఏత మశ్వ మపానే ధమస్వ" యని చెప్పినట్లు మూలమందున్నది. అది యశ్లీలముగా దోఁచుటచే నన్నయ దివ్యపురుషుఁ డుదంకుని "ఈ యశ్వకర్ణాధ్మానంబుచేయు" మని యాదేశించినట్లు మార్చెను. శర్మిష్ఠా దేవయాన్యాదులు వనమునఁ గ్రీడించుచుండ

వాయుభూతుఁడైన ఇంద్రుఁడే వారి వస్త్రములను గలపివేసినట్లు మూలమందున్నది. ఇంద్రుఁడట్లు చేయుట యుచితముగఁ దోఁపనందున నన్నయ యాశ్రమ లు "సురకరు వలిచేతం బ్రేరితంబులై" కలసె నని మార్చి వ్రాసెను. కుంతి ధర్మరాజాదులను గన్న పిమ్మట మాద్రి తనకుఁగూడ సంతానము కలుగునట్లు చేయ కుంతిని బ్రేరేచుమని పాండురాజుతోఁ జెప్పినమాటలలోఁ దనకు సంతానము లేదను దుఃఖముకంటె కుంతికి సంతానము కలిగెనను దుఃఖమే యెక్కువగా గోచరించుచు నామె సపత్నీమాత్సర్య మును వెల్లడి చేయుచున్నది. నన్నయ యా మాత్సర్యముమ తొలఁగించి,

"కోరిన కోర్కికిం దగఁగఁ గుంతి సుతత్రితయంబుగాంచె గాం
ధారియు నక్కడన్ సుతశతంబు ముదం బొనరంగఁ గాంచె నేఁ
బోరచి యాడుఁబుట్టువునఁ బుట్టి నిరర్థక జీవనైతి, సం
సారసుఖావహంబయిన సత్సుతజన్మము గానఁబోలమిన్."

అని యామె దుఃఖమునకు సంసార సుఖావహమైన సత్సుత జన్మము లేమియే కారణ మని చెప్పియుండెను. మూలమున ద్రోణుఁ డర్జునున కంధకారమున నెన్నఁడును నన్నము పెట్టవద్దని సూదునితో చెప్పినట్లున్నది. అందు కర్జునుఁడు చీఁకటిలో బాణము వేయకుండవలెనను నతని యభిలాషయే కారణము. ఇట్లు చెప్పుట ద్రోణుని శిష్య వాత్సల్యమునకు లాఘవము కలిగించునని తలంచి నన్నయ యట్లు ద్రోణుఁడు గాక యశ్వత్థామ చెప్పినట్లు మార్చి వ్రాసెను. భీమజరాసంధులు పోరు సందర్భమున మూల మున బలి శక్రునివలె జరాసంధుడు భీమునిఁదాఁకెనని యున్నది. బలియే ఇంద్రుని నోడించి యుండుటచే నిచ్చట నీ యుపమానము భీమభవిష్యద్విజయ సూచకముగా లేదు. అందుచే నన్నయ దానిని మార్చి...

"పోరి రూ, ర్జితభుజదర్ప మేర్పడఁగ సింహగజేంద్రములట్లు వజ్రప
ర్వతముల యట్లు ఘోరతరవాసవ వృత్రులయట్లు నిద్దరున్."

అని వ్రాసియుండెను. ఈ యుపమానము లుచితములై జరాసంధుని యోటమిని భీముని భావివిజయమును సూచించుచున్నవి అరణ్యపర్వమునందలి యింద్ర సురభి సంవాద మున సురభి బలముగల బలీవర్దములతో బలహీనములైన వానిని బూన్చి జనులు లాంగలాకర్షణము గావించుటచే దుర్బలబలీవర్దములు బాధపడుచుండుట చూడ దుఃఖము కలుగుచున్నదని వాపోవ నింద్రుఁడు బాగుగా వర్షము కురియించి కర్షకులకు విఘ్న మాచరించె నని మూలమందున్నది. ఇది చాల నసహజముగా నుండుటచే నన్నయ వర్ష మున తృణవర్ధనము చేసి దుర్బలబలీవర్దములకు బలము కావించెనని మార్చివ్రాసెను. ఔచిత్యపోషణమునకై నన్నయ కావించిన మార్పు లనేకములున్నవి. వానిలో పైని సూచింపఁబడినవి కొన్ని మాత్రమే.

నన్నయ మూల శ్లోకముల యథాతథముగా ననువదించిన సన్నివేశములు

పెక్కున్నవి. చాలచోట్ల నాతఁడు మూలపదములనుగూడ యథాతథముగ తెలుఁగున ప్రయోగించి యుండెను.

"అగ్నిహోత్ర ఫలావేదా, దత్తభుక్తఫలం ధనమ్,
రతి పుత్రఫలాదారాః, శీలవృత్తఫలం శ్రుతమ్."

అను శ్లోకమును నన్నయ,

"దార సంగ్రహంబు ధరణీశ! రతి పుత్ర
ఫలము, శీల వృత్త ఫలము శ్రుతము,
దత్త భుక్తఫలము ధనము, వేదములగ్ని
హోత్రఫలము లనియు నొగి నెఱుంగు" సభా. 1.51.

అని యథామూలముగా ననువదించెను.

"అల్పోపి హ్యరి రత్యంతం వర్ధమాన పరాక్రమః
వల్మీకోమూలజ ఇవ గ్రసతే వృక్షమంతికాత్"

అను శ్లోకము నతఁడు

"అల్పుఁడయ్యు మనుజుఁ డతిపరాక్రమమునఁ
బేర్మిఁ దరతరంబ పెరుగుచున్న
వాఁడు బ్రానిమొదలివల్మీక మాత్రానిఁ
జెఱుచునట్లు కడఁగి చెఱుచుఁ బగఱ"

అని మూలానుగుణముగ ననువదించుటయేకాక 'పగఱ' ను కర్మపదమునుగూడ జేర్చి మూలమునకు వన్నె కలిగించెను అతని యనువాద మాదిసభారణ్యపర్వము లం దుత్తరోత్తరముగ మూలమున కెక్కువ సన్నిహితముగా నున్నట్లు గోచరించును. అది పద్యములలోకంటె వచనములందు మూలమున కెక్కువ దగ్గఱగాఁ గానిపించును.

కాళిదాసు నభిజ్ఞాన శాకుంతలమునందును, భారవి కిరాతార్జునీయమందును, మాఘుని శిశుపాలవధమందును, శ్రీ హర్షుని నైషధమునందును గల కథలకు మూలము మహాభారతమే. వారందఱును నన్నయకుఁ బూర్వులును సంస్కృతవాఙ్మయమున సుప్రసిద్ధులునై యుండుటచే నతఁడు వారి కావ్యములను జదివియుండు ననుటకు సందేహము లేదు. అందుచేతనే కాఁబోలు నందలి కొన్ని భావము లాయా కథల రచించు పట్ల నన్నయ యనువాదమునఁ బ్రవేశించినవి. "ఇది ముని కన్యయేని" ఇది మునినాథకన్యయని" "ఎట్టి సాధ్వులకును బుట్టినయిండ్లను బెద్దకాలమునికి తద్దతగదు" మున్నగు నన్నయ పద్యముల కభిజ్ఞాన శాకుంతలమున నాకరము లున్నవి. ఇట్లే కిరాతార్జునీయ మాఘ నైషధములందలి భావములనుగూడ నన్నయ యనుసరించిన చోట్లు కొన్ని కానఁబడుచున్నవి.

సంస్కృత కవుల గ్రంథములవలెనే నన్నయ తనకు ముందున్న కన్నడ మహా కవుల గ్రంథములనుగూడ చదివియుండును. కన్నడమున నాయకునికిని కృతిభర్త కును అభేదము కల్పించు సంప్రదాయము పెక్కు కావ్యములలోఁ గనవచ్చును. నన్నయ దుష్యంతుఁడు, జనమేజయుఁడు, భరతుఁడు మున్నగు మహారాజుల వర్ణించుచు రచించిన పద్యములు రాజరాజునకుఁ గూడ నన్వయించునట్లున్నవి. ఇందు కర్ణాటకావ్య ప్రభావము కొంత కానిపించును. ఇట్లే నన్నయ పంపభారతమునందలి భావములను, వర్ణనలను, సమాసములను గొన్నిచోట్ల ననుకరించి యుండినట్లు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. అనుకరణమున్నను లేకున్నను అతఁడు కన్నడ కవుల కావ్యములను చదివి కొంత వఱకు ప్రభావితుఁడయ్యెనని చెప్పుటకు మాత్రము సందేహింప నవసరములేదు.

నన్నయ "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" యను సీసమున వ్యాసుఁడు సంస్కృతభారతము నెట్లు విశ్వజనీనతా భాసురముగ రచించియుండెనో విశదము కావించెను. అందలి లక్షణములు సంస్కృతమూలమునకువలె నాంధ్రీకరణమునకును అన్వయించును. అవతారికలో నన్నయ—

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్."

అను పద్యములోఁ దన కవిత్వమున ప్రసన్న కథా కలితార్థ యుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థసూక్తినిధిత్వము అను గుణము లుండునని సూచించియున్నాఁడు. ఇందలి కథాకలితార్థయుక్తి అనుదానికి కథాకవితార్థయుక్తి అను పాఠాంతర మున్నది. కలితయను పాఠమును గ్రహించినచో నా సమాసమునకు ప్రసన్నములైన కథల తోడను, ప్రసన్నమైన అర్థము తోడను కూడియుండుట యని యర్థము చెప్ప వచ్చును. * కవిత యను పాఠము గ్రహించినచో ప్రసన్నములైన కథలందుఁ గూర్పఁ బడిన యర్థము తోడి కూడిక యని యర్థము చెప్పవచ్చును. ప్రసన్న మనఁగాఁ బ్రసాద గుణముతో గూడిన దని యర్థము. ప్రసాదగుణమును సంస్కృత లాక్షణికులలోఁ గొంద ఱర్థగుణముగాను గొందఱు శబ్దగుణముగాను గొంద ఱుభయాత్మకముగాను గొందఱు రసగుణముగాను గ్రహించియున్నారు. వా రా గుణమున కిచ్చిన నిర్వచనము లను సమన్వయించి చూచినచో ప్రసిద్ధార్థములు, ఝటిత్యర్థ సమర్పకములు, సప్రయో జనములునైన పదములను గలిగియుండుటయే కవిత్వమునందలి ప్రసాదగుణమని విశద మగును. కథలకుఁగూడ నీ లక్షణము నన్వయించినచోఁ బ్రయోజన రహితములైన

* కొందఱు ప్రసన్నమైన కథాకవితయందలి యర్థము తోడి కూడిక యని యర్థము చెప్పుచు నన్నయకుఁ బూర్వ మేదో విధమైన కవిత్వమున్నను కథారూపమైన కవిత్వమునకు శ్రీకారము చుట్టినవాఁడు నన్నయయే యని భావించుచున్నారు.

సందర్భముల నుజ్జగించుచు, వానికిఁ బ్రధానకథతోఁ గల సంబంధమును వివరించుచు విన్నంత మాత్రమున నందలి తత్త్వమును చక్కఁగా స్ఫురింపఁజేయుట కథా ప్రసన్నత యని తెలియవచ్చును. ఇంక నార్థిక ప్రసాద మనఁగా నర్థవైమల్యము. ఇచ్చట వైమల్య మనఁగా ప్రయోజనమాత్ర పరిగ్రహమని వామనుఁడు నిర్వచించియున్నాఁడు ప్రసాదము సర్వరస సామాన్యము, సర్వరస సమర్పకమునైన గుణము. అందుచే ప్రసన్నములైన కథా కవిత్వములను నప్పుడు నానారసమయత్వము వ్యంజితమగుచున్నది. ఈ సందర్భమున ప్రసన్నపదమును ప్రయోగించి నన్నయ తన కథాకవిత్వములు రసానుగుణములై యుండునని వ్యక్తము చేసియున్నాఁడు. ప్రసన్నత నాత్మగతము, అంగగతము నని రెండువిధములుగా విభజింపవచ్చును. ఆత్మగతమైన ప్రసన్నత రసభావ సంబంధిగను, అంగగతమైన ప్రసన్నత తద్వ్యంజక శబ్ద సంబంధిగను ఉండును. ఈ రెంటినే నన్నయ అర్థయుక్తియనియు నక్షరరమ్యతయనియు వ్రాకుచ్చెను. అతని కవిత్వమున నీ రెండు గుణములతోఁ గూడిన ప్రసన్నత సర్వతోముఖముగా గోచరించును.

మహాభారతమున నుపాఖ్యానము లనేకము లున్నవి. నన్నయ రచించిన ఉపాఖ్యానములలో గరుడోపాఖ్యానము, యయాతి చరిత్ర, శకుంతలోపాఖ్యానము, నలోపాఖ్యానము, కిరాతార్జునీయము మున్నగునవి ముఖ్యములైనవి. వీనికి దేశమున నపారప్రచారప్రఖ్యాతు లున్నవి. అందుకు వానిలో సహజ సిద్ధమైన రామణీయకముతో పాటు నన్నయ కథాకథన కౌశలము కూడ కారణమని చెప్పవచ్చును. అతఁడు కథ కనవసరములు, కథాగమనమున కాటంకము కలిగించునవియు నగు వర్ణనములను, నీతి ధర్మతత్త్వ వివరణములను తగ్గించియు, పునరుక్తములైన కథా భాగముల నుచిత రీతి నొకచోట సమ్మేళనము కావించియు, నుపాఖ్యానములకుఁ బ్రధానకథతోఁ గల సంబంధమును విశదీకరించియు, గూఢములైన కథాంశముల కుచితమైన వ్యాఖ్యానము కావించియు, విభావాను భావసాత్త్వికవ్యభిచారి భావముల సమ్యగ్వర్ణనముచే స్థాయి భావముల కుత్కర్ష కలిగించి యాయారసముల లెస్సగా పోషించియు కథలకు ప్రసన్నత కలిగించుటకై యత్నించుచుండును. సుకన్య సఖులతో వనమున విహరించుచు నొకపుట్ట నుండి కాంతులు మెఱపులవలె నిర్గమించుచుండుట గాంచి యవి విలసత్ ఖద్యోతప్రభ లనుకొని యాపుట్ట త్రవ్వించిచూచెను. ఆమె కేమియుఁ గనఁబడలేదు. సంయాతి సేనలకు మూత్రపురీష నిరోధము కలిగెను అతఁడు సుకన్యవలన విషయమునంత నెఱింగి పుట్ట దగ్గఱకువచ్చి పరికించెను. అతనికి కృశాంగుఁడైన చ్యవనమహర్షి కానిపించెను. అతఁడు తనకూఁతు నాతని కిచ్చి సేనలకుఁ గలిగిన బాధ తొలఁగించుకొని యరిగెను సుకన్య పుట్ట త్రవ్వించినప్పుఁడామెకు చ్యవనుఁడు కనఁబడకుండుటకును తరువాత సంయాతికిఁ గనఁబడుటకును హేతువేమని పఠితలకు సందేహము తోఁచును. మొదట చ్యవనుఁడలిగి నిమీలితనేత్రుఁడై యుండెను. అపుడు నికటవల్లీగుల్మము లతనిపై వ్యాపించి యుండుటచే నాతఁడు కనఁబడఁడయ్యెను. సంయాతి వచ్చినప్పు డాతఁడు కన్నులు తెఱచి యుండుటచే దృష్టి గోచరుఁడయ్యెను. పైసందేహమునకు నివారకముగా నన్నయ

కావించిన వ్యాఖ్యాన మిది. అట్లే యతఁడు సుకన్య పుట్టఁ ద్రవ్వించుట కజ్ఞానము కారణము కాదనియు, నతిశయరూపగర్వితయై యామె యట్లు కావించెననియు, నాగర్వము నడఁచుటకే చ్యవఁను డామెను వివాహమాడఁ గోరెననియు వ్యాఖ్యానము కావించి తపస్వియైన చ్యవనుఁడు సుకన్యను వివాహమాడఁ గోరనేల యని పఠితలకుఁ గలుగు సందేహమును తొలఁగించెను.

శంతనుఁడు మృగయార్థమై యమునా తీరమున కరిగి యచ్చట యోజనగంధిని గాంచెను. నన్నయ యాసందర్భమున—

"దాని శరీర సౌరభము. దానివిలోల విలోకనంబులున్

దాని మనోహరాకృతియు, దాని శుచిస్మిత వక్త్రకాంతియున్

దాని విలాసముం గడు ముదంబునఁ గాంచి..."

శంతనుఁడు మనోజబాణ సంతాన హతాత్ముఁడయ్యెనని వర్ణించెను. ఇందు వర్ణితములైన శరీర సౌరభాదు లుద్దీపనవిభావములు. విలోకనము లనుభావములు, అమూలకమైన యీ భావానుభావవర్ణననే నన్నయ యిచ్చట స్థాయిభావమైన రతి కుత్కర్ష కలిగించెను. ఇట్లే నూత నున్న దేవయానిని యయాతి పైకిఁ దీయునపుడు నన్నయ "తదున్నమద్గళదురు ఘర్మవారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె" నని సాత్త్విక భావమైన స్వేదమును వర్ణించి యచ్చటి శృంగారమునకు వన్నె చేకూర్చెను. ఈ విధముగా నాతఁడు విభావానుభావ సాత్త్విక భావాదుల వర్ణనముచే స్థాయికి సముల్లాసము కలిగించి కథలను రసమయములుగాఁ దీర్చిదిద్ది యుండెను.

నన్నయ మూలమున నస్ఫుట స్ఫురితముగా నుండు కథలయందలి పరమార్థమును తన రచనలో ప్రస్ఫుటమును గావించి పాఠకుల హృదయముల హత్తుకొనునట్లు చేయును. గరుడోపాఖ్యానమున కద్రువ ఈర్ష్యాకపటము లవలంబించి తత్ఫలితముగ తన్ను తానే శపించు కొనవలసివచ్చెను. నన్నయ ఆ కథలో ఈర్ష్యాకపటము లెంత హేయములో, వాని పరిణామము లెట్లుండునో చక్కఁగా వ్యక్తము చేసియుండెను. యయాతి చరిత్రలో యయాతిపతనమున కాతని యహంకృతియే కారణము. "నీగర్వము నిన్నింత చేసె" నని ఇంద్రుఁడు యయాతితో నన్న మాట యా కథ పరమార్థము. సుందోప సుందోపాఖ్యానమున, "ఇంతుల నిమిత్తమున ధృతిమంతులు పొందుదురు భేదమతి" యను సత్యము నిరూపింపఁబడినది. నలోపాఖ్యానము "అధికదుఃఖార్తునకు భార్య యెట్లౌషధ మగునో, పురుషునందు దోషపుంజమున్నను సహించు నిల్లాలు కాలాంతరమున నెట్లభీష్ట భోగము లందఁజాలునో" తేటతెల్లము కావించుచున్నది. ఋశ్యశృంగుని కథ "విలాసినుల సహోలాపసహాసన సహయానములు బంధసమములగు" నను పరమార్థమును వ్యక్తము చేయుచున్నది. నన్నయ కథలలో కొన్ని రాజులకును, కొన్ని ఋషులకును, గొన్ని ధర్మతత్త్వములకును సంబంధించియున్నవి. వైదికములు, లౌకికములు నైన కథలు గూడ కొన్ని గలవు. భిన్న వస్తు స్వభావము గల ఈ కథలను నడపించుటలో నతఁడు భిన్నకథనశిల్ప

విధానముల నవలబించి యుండెను. అరణ్య పర్వమునందలి కథలు పెక్కు తీర్థ క్షేత్ర మాహాత్మ్య ప్రబోధకములు. నన్నయ కథాకథన సందర్భమున నంగాంగి ప్రాధాన్యమును జాగరూకతతో గమనించుచుండును. ఉపాఖ్యానముల నతివిస్తృతముగా వర్ణించి ప్రధానకథకుఁ గాని, అంగవస్తువును విస్తరించి అంగి వృత్తమునకుఁ గాని అతఁడెప్పుడును లాఘవమును చేకూర్పఁడు. గరుడోపాఖ్యానమున సముద్రమథన విభావసు సుప్రతీక వృత్తాంతముల నతడు సంక్షిప్తములు గావించుటకిదియే కారణము. ఈ విధముగనే యంగిరసము మఱుఁగుపడునట్లుగా నంగరసములను విస్తృతముగా వర్ణింపక వాని నాతఁడు సూచ్యమాత్రములు గావించుచుండును.

నన్నయ రచించిన నలోపాఖ్యానము, దుష్యంతోపాఖ్యానము మున్నగు పెద్ద కథ లుచితములైన యుపక్రమోపబృంహణోప సంహృతులతోఁ గూడి చక్కని స్వతంత్ర కావ్యములవలె శోభిల్లు చుండును. సభాపర్వమునందలి కథ సభాద్వితయ వృత్తాంత ముతో సన్నిహిత సంబంధము కలిగి యా పర్వమున కానామమును సార్థక మొనరించు చున్నది అందలి యాశ్వాసములు రెండింట రెండు సభలును కథాగమనమున కాట పట్టైవస్త్వైక్యమును సంఘటించుచున్నవి. అస్త్రవిద్యాప్రదర్శన ఘట్టమున కర్ణుఁడు కౌరవ పక్షము నవలంబించుట, కుంతి ప్రత్యభిజ్ఞచే అతనిఁ దనకుమారుఁడుగా గుర్తిం చుట యనునవి ముఖ్యాంశములు. ఆదిపర్వమునందలి పంచమాశ్వాసము భీమార్జునుల బలపరాక్రమములను దలఁచి కౌరవులు మనమునఁ గుందుండిరను విషయముతోడను. అస్త్రవిద్యాప్రదర్శనము కర్ణుని సహాయుగాఁబడసి దుర్యోధనుఁ డర్జునునివలనిభయము వీడి తొమ్మనఁ జేయిడి హాయిగా నిద్రపోయె నను విషయముతోడను ముగియుచున్నవి. కుంతి కర్ణుని గంగలో విడిచిన పిమ్మట మరల నాతనిఁ గాంచుట యస్త్రవిద్యా ప్రద ర్శన ఘట్టము నందే. నడుమ నామెలోన నెట్టి వేదన ననుభవించెనో నన్నయ చెప్పి యుండలేదు. అందుచే నాతఁడీ సందర్భమున కుంతి కధికమైన ప్రాధాన్య మొసంగెను. ఈ విధముగా నతఁడు ప్రధానఘట్టములందైనను, ఉపాఖ్యానాదులందైనను ఆది మధ్యావసానముల నెంతో సుందరశిల్పమయముగా సంతరించుచుండును.

నన్నయ కొన్నిచోట్ల కథాంశములను వ్యంగ్యముగా మాత్రము సూచించు చుండును. శతశృంగమున నున్నపుడు పాండురా జొక యమావాస్యనాఁడు బ్రహ్మను సేవింప నరుగుమునుల వెనుకఁ దన యిరువురు భార్యలతోఁ గూడ నడచుచుండఁగా మునులది చూచి 'వీర లతిలలితమృదులాకారలు. గిరివిషయగహన గహ్వరముల నడవ నేరరు. మఱియు నివి దేవపథములు. మీరింక రాక నిలువుం"డని వారించిరి. వారి మాటలు విని పాండురాజు "స్వర్గద్వారం బనపత్యులు గాన నోపరటె మునులయ్యున్. నే ననపత్యుఁడ నేమి సేయుదు" నని దుఃఖించెను. మునులు పాండురాజునపత్యతను గూర్చి ఏమియు ననియుండలేదు. వా రన్న వాక్కులకును పాండురాజనపత్యతను గూర్చి దుఃఖించుటకును సంబంధము కనఁబడదు. కాని మునులు పాండురాజుభార్యలు లలితమృదులాకారు లనుటలో వారి యనపత్యతయు, నవి దేవపథములనుటలో నన

పత్యులు స్వర్గమున కనర్హు లనుటయు ధ్వనించుచున్నది. ఇట్లే యయాతి చరిత్రలో నన్నయ శర్మిష్ఠ దేవయానిని నూతఁ ద్రోచి నిర్భయముగా వెడలిపోవుటకును, దేవయాని విలసత్కా పఘనవల్లి యన్నిష్టసఖి నూది నిర్జలమైన యా కూపముననే యుండిపోవుటకును హేతువులను చక్కగా వ్యక్తము చేసియున్నాడు. అతఁడు కథయందలి పాత్రలలో నెవరి కెంత ప్రాధాన్య మీయఁదగునో యూహించి వారి కంత ప్రాధాన్య మొసంగి పఠితలు దానిని గ్రహించుటకై తగిన సూచనలు చేయుచుండును.

నన్నయ కథాకథన సందర్భమున కొన్ని పదములకును వాక్యములకును అధికమైన ప్రాధాన్యము నొసఁగి యవి యా ఘట్టముల కాయువుపట్టులని తెల్పుటకై వానిని రెండుమూఁడు పర్యాయములు పునరుక్తము లొనరించుచుండును. ఋశ్యశృంగోపాఖ్యానము నందు "ప్రబోధించి" యను పదమును, యయాతి చరిత్రమునందు "ఉద్ధరించి" యను పదమును, గాంధారి వివాహ ఘట్టమందు సుబలుఁ డన్న "యారాజునకు గాంధారి నిచ్చితి"నను వాక్యములోని భూతకాలక్రియాప్రయోగమును బరికించినని విషయము తేటతెల్లమగును.

నన్నయ కథల నాయా విషయములు జరిగిన ప్రదేశమునుబట్టి కొన్ని ఘట్టములుగా విభజించి 'అట, యిట, అంత నిక్కడ' అను పదములతో నా ఘట్టముల మార్పును సూచించుట నాటకములందలి రంగ విభజనమును బోలియుండును. నలోపాఖ్యానమున నిట్టి విభజనము మిక్కిలి స్పష్టముగా గోచరించును. అతఁడు పెక్కుకథలలో నాటకీయ చమత్కారమును హృద్యముగా ప్రదర్శించియుండెను. సుభద్ర యతియే యర్జునుఁ డని యెఱుంగక యతని నర్జునుని గూర్చి ప్రశ్నించుట, భీముఁడు సౌగంధిక సరోవరమున కరుగుచు దారిలో నడ్డముగాఁ బండుకొన్నది హనుమంతుఁడని యెఱుంగక తత్పరాక్రమునే ప్రశంసించుచు ప్రసంగించుట యిందుకు నిదర్శనములు నన్నయ కథలలో నచ్చటచ్చట ధ్వనిపూర్వకముగా భావికథాసూచనమొనరించుచుండును. ఉదంకుఁడు తక్షకుని గూర్చి జనమేజయునితో "ప్రల్లదుఁడైన యొక్కకులపాంసును చేసిన దానఁ దత్కులంబెల్లను దూషితంబగుట యేమి యపూర్వ"మని తెలుపుట దుష్టుఁడైన దుర్యోధనుని దౌర్జన్యముచే కౌరవవంశమంతయు నాశనమైపోవునను భవిష్యత్కథాంశమును నిపుణముగా సూచించుచున్నది. కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున భీమ దుర్యోధనుల గదాయుద్ధము ఘోరమై "భావిపాండవ కౌరవ్య రణాభిసూచన పటిష్ఠంబయ్యె"నని నన్నయ వర్ణించెను. నిజమున కాసమయమునకు పాండవ కౌరవ రణముయొక్క ప్రసక్తియేలేదు. ఇట్లే వనగమనమునకుముం దరునాదులు గావించినట్టియు, దుశ్శాసనుఁడు ద్రౌపది చీర లొల్చునపుడు భీముఁడు కావించిన నట్టియుఁ బ్రతిన లిందుకు తార్కాణములు. ఆరణ్యపర్వమునందలి నీతికథోపాఖ్యానములు కాలవ్యవధాన గోపనమునకును, ప్రముఖాంశరహిత కథాభాగమును గూడ పఠితలానందముతో పఠించుట కుత్సాహము గూర్చుటకును పనికివచ్చు నని పిసాని యను విమర్శకుఁడు నుడివియుండెను. అరణ్యపర్వమునందలి కిరాతార్జునీయ, కాలకేయ నివాత కవచవధ వృత్తాంతము లర్జునుని యతిలోకపరాక్రమమునకును, సౌగంధికాపహరణము

భీముని ప్రియసాహసత్వమునకును, అజగరోపాఖ్యానము ధర్మరాజు ధర్మజ్ఞతకును నిదర్శనములై అత్యంత హృద్యములుగా నున్నవి. కృష్ణుఁడు చెప్పిన సౌంభకాఖ్యానము వీరరసమయమై యద్భుతముగా నున్నది.

నన్నయ వర్ణనలు మితములై యుదాత్తములై వర్ణ్యవస్తువులను బఠితలకు సాక్షాత్కరింపఁజేయుచుండును. సహజత్వోదాత్త్యము లాతని వర్ణనము లందలి ప్రధాన లక్షణములు. అతఁడు దేనిని వర్ణించినను దానికి సంబంధించిన వివిధాంగములను చక్కగా తీర్చిదిద్ది తత్సమగ్రమూర్తులను పఠితల మనఃఫలకములందు చిత్రితము లగునట్లు చేయుచుండును. అందుచే నాతఁడు వర్ణించిన వ్యక్తులును, పశుపక్ష్యాదులును సజీవములై మన యెదుట నడయాడుచునట్లు కాన్పించును.

"మృదురోమములును శంకునిభకర్ణముల్ మెత్తని వలుద
పొదుగును నిడుద చన్నులును గుఱుచలై పొలుచు కొమ్ములును
సదమల శరదిందుశంఖనిభమైన ఛాయయుఁగల్గు
మొదవిది" ఆ. 7.99.

అను నందినీ వర్ణనమును,

"సాలప్రాంశు, నిజోజ్జ్వలత్కవచు, శశ్వత్కుండలోద్భాసితున్,
బాలార్కప్రతిమున్, శరాసనధరున్, బద్ధోగ్రనిస్త్రింశు, శౌ
ర్యాలంకారు, సువర్ణవర్ణు, ఘనుఁ, గర్ణాఖ్యున్, జగత్కర్ణ పూ
రాలోలద్గుణుఁజూచి" ఆ. 6-30.

అను కర్ణ వర్ణనమును అందుకు నిదర్శనములు. నన్నయ పెక్కుచోట్ల వ్యాసుని కపిల గడ్డమును. కపిలజడలను, కపిల కన్నులను, నల్లని దీర్ఘతనువును, కమండలువును వర్ణించి యతని దివ్యమూర్తిని బఠితల యెదుటఁ బెట్టియుండెను. అతడు కావించిన స్త్రీ వర్ణనములన్నియుఁ బరిమితములై యౌచిత్యభాసురములై యొప్పుచున్నవి. పితృదేవతల యాదేశము ననుసరించి గిరికకు మృగమాంసముఁ బెట్టుటకై వసురాజు మృగవధార్థము వనమున కరిగి, గిరికను దలఁచి దలఁచి యామెయందు తన హృదయమును లగ్న మొనరించెనని తెలుపుచు నన్నయ యామె నిట్లు వర్ణించెను.

పలుకుల ముద్దును గలికి క్రాలన్నుల
తెలివును, వలుదచన్నుల బెడఁగు,
నలఘుకాంచీపదస్థలముల యొప్పును,
లలితాననేందుమండలము రుచియు,
నళినీల కుటిలకుంతలముల కాంతియు,
నెలజవ్వనంబున విలసనమును,
నలసభావంబున పొలుపును, మెలుపును
గలుగు నగ్గిరికను దలఁచి తలఁచి ఆ-3-27.

ఈ పద్యమున గిరిక యంగముల భౌతికాకారమునకుఁ గాక వానియందలి కాంతివిలాస సౌందర్యముల కధికమైన ప్రాధాన్య మొసంగఁబడినది. గిరిక సమక్షమున లేనితఱి వసురా జామె యవయవములను గాక తనహృదయమున నెలకొనియున్న తత్కాంతి సౌందర్యాదులను దలంచి రక్తుఁడయ్యెనను ట ఎంతో యుచితముగా నున్నది. ఇట్లు వస్తువుల భౌతికాకృతిని గాక యాంతరశోభను వర్ణించుట మిక్కిలి ప్రశస్తమైన పద్ధతి, పాండురాజు మరణమునకు పూర్వము నన్నయ యాతని నంగజరాగమత్తునిఁ గావించి వసంతసుమాలంకారశోభితయై యపర మధులక్ష్మివోలె విరాజిల్లుచుండిన మాద్రివిలాసమును,

"చారుసువర్ణహాసి నవచంపకదామయు, సింధువార ము
క్తారమణీయయున్, వకుళదామవతంసయునై యపూర్వ
శృంగారవిలాసలీలయెసఁగం దనముందట నున్న మాద్రి నం
భోరుహనేత్రఁజూచి"

అనుపద్యమున నెంతో సహజముగా వర్ణించియుండెను.

నన్నయ వర్ణన వైఖరి పెక్కుచోట్ల వర్ణ్యముయొక్క ఏకైక విన్యాసమును మాత్రమే ప్రదర్శించు చిత్రకారుని చిత్రరచనాపద్ధతిని బోలియుండును.

"తత్కూపమున విలసత్కూపఘనవల్లి యన్నిష్టసఖి నూది యున్నదాని,
గురుకుచయుగముపైఁ బరువడిఁ దొరఁగెడు కన్నీరు పూరించుచున్నదాని"
ఆ-3-141

"పాంసుజాలములుపైఁ బ్రాకినఁ గరమురూక్షములగు నూర్ధ్వాలకములదాని
దమయంతిఁజూచి" అర. 2-102.

"హంసచేఁ దన వినినంతకంటెను రూప
విభవాతిశయమున వెలయుదాని" అర. 2-39.

మున్నగు పద్యములందలి 'దాని,దాని' అను సర్వనామములతో ముగియు విశేషణము లొకేస్థితి యొక్క వివిధ భంగిమలను సూచించుచున్నవి. ఇందలి భావములను గ్రహించి యొక్కొక్క దాని కొక్కొక్క చిత్రమును రచింపవచ్చును. ఇట్లే కణ్వాశ్రమవర్ణనమందలి "శ్రవణసుఖంబుగా సామగానంబుల" నిత్యాది సీసపద్యము కూడ నాశ్రమైక దేశము చిత్రమును బఱితల కనుల యెదుటఁ బెట్టుచున్నది. విదురుఁడు పాండవ వనగమనక్రమమును ధృతరాష్ట్రునకుఁ జెప్పుచు "వదనసరోజంబు వస్త్రాంతమునఁ గప్పుకొని యేగె ధర్మనందనుఁడు మఱియు" నిత్యాదిగా నన్నయ వ్రాసిన సీసము భావగంభీరమై యాదృశ్యమును బ్రత్యక్షము చేయుచున్నది.

నన్నయ వర్ణనసందర్భమున వస్త్వనుగుణమైన వాతావరణమును జక్కగాఁ గల్పించుచుండును. కణ్వాశ్రమమును వర్ణించినపు డతఁడు "ఏచి తలిర్చిన" వివిధ వృక్ష

ములను, ఆజ్యహవిర్హుత ధూమలతాతతులను, వేదధ్వనులను, స్వాహాశబ్దములను" బేర్కొనుటయు, వర్షర్తువును వర్ణించునపుడు జలదధ్వానదర్దురశబ్దములను, నవతృణ శిలీంధ్రసురగోపములను, వర్షధారలను బేర్కొనుటయు, వాతావరణమును వర్ణించునప్పుడు విపణివీధులను, సౌధములను, జనసమృద్ధిని బేర్కొనుటయు, రాజసూయ యాగ సందర్భమున వేదధ్వని విప్రాశీర్వాద నినాదములను బేర్కొనుటయు నిందుకు నిదర్శనములు. తీర్థక్షేత్రములను వర్ణించునపు డతఁడు తన్మహత్త్వ పవిత్రతలను బెక్కువిధముల వర్ణించుచుఁ బఠితలను వానియెడ భక్తిభావసంభరితుల నొనరించుచుండును.

సఖులు దమయంతి విరహతాపమును దమయంతి కెఱిఁగించుచుఁ జెప్పిన "కలహంస పలికినపలుకులు గణియించు వడి దాని పోయినవలనుచూచు" నిత్యాది సీసము (అర. 2-26) సరళసుందరమైన నాయికావిరహావస్థను వర్ణించుపట్లఁ దరువాతి కవుల కెందఱికో మేలుబంతియైనది ఇట్లే దమయంతి యడవిలో నలునిగానక దుఃఖితయై యతని వెదకు సందర్భమున "హా! మహారాజ, మహామహీరక్షణదక్ష దక్షిణబాహుదండ, దండితారాతి" (అర. 2-81) మున్నగు పద్యములు గూడ కరుణరసపూరితములై తరువాత పలువురి కవులకు నాదర్శప్రాయములు కాఁజాలినవి.

నన్నయ భారతమున నేడెనిమిది యుద్ధవర్ణనము లున్నవి. ఇవి యన్నియు కొంచె మించుమించుగా నొకే మాదిరిగ వ్రాయఁబడి వైవిధ్యహీనములై యున్నవి. భీముఁడు బకుని జంపిన విధముననే కిమ్మీరునిఁగూడ విగతప్రాణుఁ గావించెనని నన్నయయే చెప్పియున్నాఁడు. సౌంభకాఖ్యాన కిరాతార్జునీయ నివాతకవచ సంహరణాది సందర్భముల వర్ణితములైన యుద్ధములు మహాభీకరములును, అపూర్వములునై యద్భుతము నావహించుచున్నవి. అందులోఁ జివరి రెండింట నర్జునుఁడు ప్రదర్శించిన శస్త్రాస్త్రకౌశల మతిలోకమైనది. నన్నయ కావించిన ప్రకృతి వర్ణనములలో రెండుమూఁడు తప్ప మిగిలినవి మిక్కిలి పరిమితములై యున్నవి. కణ్వాశ్రమ వర్ణనము సహజమై యచ్చటి పవిత్రతా శాంతి కర్మనిష్ఠలను జక్కగా వెల్లడించుచున్నది. అతని వసంతవర్ష శరద్వర్ణనము లాయా ఋతువులందలి ప్రకృతి శోభను వెలువరించుచు నుదాత్తములై యింపు నింపుచున్నవి. ఆదిపర్వాష్టమాశ్వాసమున విశ్వకర్మ పాండవులకై నిర్మించిన యమూలకమైన ఇంద్రప్రస్థపుర వర్ణనము భావబంధురమును, ఆలంకారికమునై నన్నయ భావనాపటిమకు నిదర్శన మగుచు తరువాతి ప్రబంధముల యారంభములఁ గానవచ్చు పురవర్ణనముల కెల్ల మూల మనఁదగియున్నది.

నన్నయ సాధారణముగా వర్ణన సందర్భముల సీసములనుగాని, వచనములను గాని వ్రాయుచుండును. అతని వర్ణనవచనములు దీర్ఘములును, సంస్కృత సమాస భూయిష్ఠములునై వీనులవిందు చేకూర్చుచుండును. గరుడోపాఖ్యానమునందలి సముద్ర వర్ణనము, అస్త్రవిద్యా సందర్శనమునందలి రంగవర్ణనము, వారణావత వర్ణనము, సభాపర్వమున మంత్రులు గావించిన ధర్మరాజ వైభవవర్ణనము, హిమవద్గంధమాదన పర్వత వర్ణనములు ఇందుకు నిదర్శనములు. హిమవంతమును వర్ణించుచు నన్నయ యది రమణీయ భయానకమై యుండెనని తెలిపెను. తిక్కన యుద్ధములను వర్ణించు

నపుడు తఱుచుగా నీ యర్థముగల పదములనే వాడుచుండును. ఈ విధముగా నన్నయ వర్ణనములు గాంభీర్యమునకును, నిసర్గతకును, ఉదాత్తతకును నెలవులై పరిమితము లయ్యు పరమ సుందరములై భాసిల్లుచున్నవి.

మహాభారతము నందలి ప్రధాన రసము శాంతము. దానికి భంగము కలుగకుండ నన్నయ యాయా సందర్భముల నంగరసముల నుచితరీతిని పోషించియున్నాఁడు. దుశ్శాసనుఁడు తన్ను సభలోని కీడ్చి తెచ్చినపుడు ద్రౌపది కింకర్తవ్యతామూఢయై భయమున కృష్ణునిఁ దలంచెను భక్తిరస ప్రకటనమున కెంతో యనుకూలమైన ఈ సందర్భమున నన్నయ "కోమలి కృష్ణుఁ దలంచె భీతయై" యని యొక్క వాక్యము మాత్రము చెప్పి యూరకుండెను. సభాపర్వమున శిశుపాలుఁడు కృష్ణు నాక్షేపించిన సందర్భమున సహదేవుఁడు క్రుద్ధుఁడై " దీనికిం దొడంబడమని దుర్జనత్వమునఁబల్కెడు వీరుల మస్తకంబుపై నిడియె దనంచు" చరణమెత్తెను. దుర్యోధనుఁడు ద్రౌపదిని తన యూరుతలము నెక్క రమ్మని సన్నచేసిన సందర్భమున భీముఁడు దుర్యోధనుని యూరువులు భగ్నమొనరించెదనని శపథము చేసియుండెను. రౌద్రరసమున కాలంబనమైన ఈ రెండుచోట్ల నన్నయ దానిని విరివిగా వర్ణింపక ధ్వనింపఁజేసి విడిచి పెట్టెను. "అంగరసస్య అంగిరసాపేక్షయా కించిన్న్యూనతా సంపాదనీయా" యను లాక్షణికోక్తి ననుసరించియే నన్నయ యట్లు కావించెను.

నన్నయ యెచ్చటను భావములను పొంగిపొరలునట్లు వర్ణింపఁడు. ఎట్టి పరిస్థితులలోనైన నాతని పాత్రలు గాంభీర్యమును విడువక నిగ్రహముతో వర్తించుచుండును. నన్నయ యెఱ్ఱన లిరువురును వర్ణించిన కుంతి కర్ణుని గంగలో విడిచిన సందర్భములను బోల్చిచూచిన నీ విషయము తేటతెల్లమగును ఉదంకుఁడు జనమేజయుని సర్పయాగము నొనరింపఁ బ్రేరేచుచు "మితహిత సత్యవాక్య జనమేజయ" యని సంబోధించెను. యయాతి పూరునకు నీతి బోధించునపుడు "మనమునకుఁ బ్రియంబును, హితమును, బథ్యముఁ దథ్యమును, నమోఘము, మధురంబును, బరిమితమును నగు పలుకొనరఁగఁ బలుకు నది ధర్మయుతముగ సభలన్" (ఆది. 3.205) అని చెప్పి యుండెను. ఈ మితహిత మధురవాక్యత నన్నయ పాత్రలన్నిటియందు గోచరించును.

నన్నయ యాయా సన్నివేశము లయందు వివిధ రసములను మితముగను నుచితముగను బోషించియుండెను. అతని యుద్ధ వర్ణనము లన్నియు వీరరౌద్రరసముల కాకరములు. అరణ్యపర్వము నందలి సౌభద్రాఖ్యాన నివాతకవచ సంహార సందర్భములందా రసములు పరమోదాత్తముగ పోషింపఁబడినవి. పాండవ వనగమన సందర్భమున కుంతి విలపించునపుడు కరుణరసమును, గణ్వాశ్రమ వర్ణన సందర్భమున శాంతమును భీముఁడు బకాసురుని కళేబరము నీడ్చుకొని వచ్చి నగరద్వారమున విడిచిన సందర్భమున బీభత్సరసమును, అమృత మథన సందర్భమున నద్భుతరసమును, తపతీసంవరణులయు, గంగాశంతనులయు, శకుంతలాదుష్యంతులయు వృత్తాంతములను వర్ణించుపట్ల శృంగారరసమును లెస్సగా పోషితములైనవి. ఊర్వశి యర్జునుని వలచిన సందర్భము శృంగారాభాసమునకును, నలోపాఖ్యానము కరుణరసమునకును నాకరములై

యున్నవి. ద్రౌపదీ స్వయంవరమైన పిమ్మట స్వయంవరాగతులైన రాజులు కుపితులై ద్రుపదుని మార్కొనిరి. ద్రుపదుఁడు భీతుఁడై బ్రాహ్మణుల మఱుఁగు చొచ్చెను. బ్రాహ్మణు లాతని నోడకుండుమని యూఱడించి దండాజినము లెత్తుకొని ప్రతిబలముపై వీవఁదొడంగిరి. ఈ ఘట్టము హాస్యరసపూరితమై నవ్వు పుట్టించుచున్నది. అది చూచి యర్జునుఁడు కూడ నవ్వినట్లు నన్నయ వర్ణించెను. ఇట్లే యరణ్యపర్వ తృతీయాశ్వాసమున ఋశ్యశృంగుఁడు ఋషి కుమారుఁడను భావముతో వేశ్యను వర్ణించిన ఘట్టము కూడ హాస్యరసమున కాలంబనమై యున్నది. నన్నయ భారతము నితిహాసముగా కాక కావ్యముగ రచింపఁదలఁచిన వాఁడగుటచే రసపోషణమున తగినంత జాగరూకత వహించెను.

నన్నయ పాత్ర పోషణమున కృతహస్తుఁడు. అతఁడు దుర్యోధనుని అసూయా దౌష్ట్య దురభిమానములను, శకుని కైతవమును, దుశ్శాసనుని ధూర్తత్వమును, శ్రీకృష్ణుని ధర్మరక్షణపరాయణతను, భీష్ముని సమత్వమును, ధర్మజుని ధర్మతత్పరతను, కృపద్రోణుల తటస్థభావమును, భీమాదుల భ్రాతృభక్తిని, కర్ణుని రాజభక్తిని, వికర్ణుని ధర్మాసక్తిని చక్కఁగా వర్ణించెను. అతని స్త్రీలు పాతివ్రత్యమునకుఁ బట్టుఁగొమ్మలు; గరువతనమున కిరవులు; భారతనారీత్వము గొన్న బంధురమూర్తులు. ద్రౌపదీపాత్ర వర్ణనమున నాతఁడు ప్రదర్శించిన నేర్పు అనన్యసామాన్యమైనది. సభాపర్వమున నామె ధర్మజ్ఞతా గృహిణీత్వములు చక్కఁగాఁ వర్ణింపఁబడినవి. రాజసూయ యాగమున సకలభూములనుండి వచ్చిన పేదలను, సాధులను గౌరవించి యాదరించిన తెఱంగామె గృహిణీత్వమునకు తార్కాణము దుశ్శాసనుఁడు తన్ను సభ కీడ్చుకొని వచ్చినపుడామె కోపలజ్జాపరవశయై పలికిన పలుకులు సత్యమైన యాగ్రహావేశములను, ధర్మశీలతను వ్యక్తము చేయుచున్నవి. ధృతరాష్ట్రుఁ డన్నట్లామె ప్రకృతి మానవభామిని కాదు. పరమ పతివ్రత, ధర్మరత. సాధారణముగా నన్నయ ఆయాపాత్రలను తొలుతఁ బ్రవేశపెట్టునపుడే వారి శీలస్వభావములందలి ప్రధానాంశములను విశేషణములచే వెల్లడి చేయుచుండును. కొన్నిచోట్ల నతఁడు పాత్రలయందలి పరస్పర విరుద్ధ గుణస్వభావాదులను ప్రతియోగముచే వ్యక్తము చేయుచుండును "భావిపురాతనాద్యతనపార్థివలక్ష్ములు" అను పద్యమున దుర్యోధనుఁడు ధర్మరాజు... యుఁడు పాండవుల కిచ్చిన సభ జూచి సహింపనోపక కృశుఁడు వివర్ణుఁడు నయ్యెను. దుర్యోధనునికై ధృతరాష్ట్రుఁడు కట్టించిన సభను జూచి ధర్మజుఁడు మెచ్చుకొనెను [ఆ ధృతరాష్ట్ర చేసిన అనర్ఘమణి ప్రకరానుబద్ధ శోభాధృతి] నన్నయ గరుడోపాఖ్యానమున కద్రూవినతల శీలమునందలి తారతమ్యమును నిపుణముగా ప్రదర్శించెను.

నన్నయ యౌచిత్యపరిపోషణమునెడ మిక్కిలి శ్రద్ధవహించెను. నలుఁడు తన్ను విడిచివెడలిన తరువాత దమయంతి అడవులలో నిడుములు పడి చివరికి పుట్టినింటి కరుదెంచెను. అప్పటినుండియు నామెన లాన్వేషణమునకై పెక్కుయత్నము లొనరించెను. ఆమె తా నేమి చేయనెంచినను తండ్రితోఁ గాక తల్లితో చెప్పి యామె యనుమతితోడనే చేయుచుండును. రాజగృహములందు యౌవనవతులైన కన్యకలు తల్లితోడనేకాక తండ్రి

కెదురు పడి మాటాడరను సంప్రదాయమిచ్చట చక్కఁగా సూచింపఁబడినది. విక్రతాంగుఁడైనను, బాహుకుఁడు నలుఁడే యని గుర్తించి దమయంతి యా విషయమును తల్లి కెఱిఁగించెను. కాని యాతఁడు నలుఁడేయని విస్పష్టముగాఁ దెలియువఱకు నాతనితో ప్రత్యక్షముగా మాటలాడక యాతఁడు వినునట్లుగా నలుఁ డొనరించిన దయారహిత కార్యములన్నియు ప్రథమపురుషమున వివరింపఁదొడఁగెను. ఈ సందర్భమున నాతఁడవలంబించినపద్ధతి యత్యంతౌచిత్య భాసురముగా నున్నది. అసభ్యములును, అధర్మములునగు విషయములు చెప్పవలసివచ్చినపుడు నన్నయ వానిని వాచ్యములుగాఁ దెలుపక సూచ్య మాత్రములు కావించుచుండును. అతఁడు పరాశరుఁడు దాశకన్యను వలచిన సందర్భమునఁ దనయభిప్రాయ మెఱింగించెనని తెలుపుటయు, యయాతి శర్మిష్ఠ కభిమతం బొనరించెననియు. నర్జునుఁ డులూచి మనోరథంబు సలిపి యా రాత్రి నాగభవనంబున వసియించె ననియు నుడువుటయు నిందుకు నిదర్శనములు. అడవిలో నొంటరిగాఁ దిరుగుచున్న దమయంతిని జూచి కిరాతుఁ డనాగరికుఁడయ్యు తన మనోరథము నసభ్యముగాఁ దెలుపక "నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్య చరిత్రకు వేడుకతో" నని వ్రాయుట నన్నయ యౌచిత్య పరిపోషణ పరాయణతకు పరాకాష్ఠ. విదురుఁడు ధృతరాష్ట్రునానతిచే ద్యూతమునకు ధర్మరాజును పిల్చుకొని పోవుటకై ఇంద్రప్రస్థమున కరిగి కుశల ప్రశ్నానంతరము నిజాగమ ప్రయోజనం బెఱిఁగించెనని మాత్రము వ్రాయుట నన్నయ ధర్మేతర విషయములను వాచ్యముగాఁ చెప్పక సూచ్యమాత్రములు కావించుననుటకు దృష్టాంతము

నన్నయ యవతారికలో తన్నుఁగుఱించి చెప్పుకొన్న సీసములో తాను లోకజ్ఞుఁడ నని తెలిపియుండెను. భారతమునఁ బెక్కుచోట్ల నాతఁ డాలోకజ్ఞతను ప్రదర్శించి యుండెను. శర్మిష్ఠచే నూతఁ ద్రోయింపఁబడిన దేవయాని యయాతితో సత్యము తెల్పినచో న్యూనతాపాదకముగా నుండునని తాను ప్రమాదవశమున ఆ నూతఁ బడి నట్లు తెలిపియుండెను. దుశ్శాసనుఁడు ద్రౌపది కట్టిన పుట్టము లొల్చునపుఁడు ఆమె జఘనమున వివిధ వర్ణములైన వస్త్రములు విరాజిల్లెనని మూలమునం దున్నది. నన్నయ రంగుబట్టల ప్రసంగము విడచి "ఉడుగక యొలువంగఁ బడియు మున్నపనీతమైన తద్వస్త్రంబునట్టి వలువ లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచునుండె" నని వ్రాసియుండెను. ఒకేరకమైన వస్త్రము మఱల మఱల నుత్పన్నమగుచో నగ్నత భాసింపదని లోకజ్ఞుఁడైన నన్నయ యట్లు మార్చియుండెను అడవిలోఁ దిరుగుచుండఁగా దమయంతి నొక యజగరము పట్టుకొనెను కిరాతుఁ డొకఁ డాపాము వదనము వ్రయ్యఁ దఱుగ దమయంతి సజీవయై దాని ముఖమునుండి బయటి కేతెంచెను. కిరాతుఁ డామెను సమీపమున నున్న సరోవరమున స్నానము చేసి రమ్మనెను. పాము మ్రింగినప్పు డామె శరీరమున నంటుకొనిన లాలాజలము తొలఁగుటకే యాతఁ డట్లాదేశించియుండును. చనుప తెల్లవాఱుజామున ప్రయాణ మారంభించి యెండ యెక్కునంతవఱకును నడక సాగించి నీరు గలచోట చెట్లనీడ విశ్రమించుట లోకమున పరిపాటి. నన్నయ నలోపాఖ్యానమున సరిగా నీ క్రమమునే వర్ణించెను. పై సందర్భము లన్నియు నపారమైన

నన్నయ లోకజ్ఞతను వెల్లడి చేయుచున్నవి.

నన్నయ కథలందచ్చటచ్చట నాయాపాత్రల యింగితచేష్టావర్ణనము లొనరించుచు తన మానవ మానస స్వభావ పరిజ్ఞానమును వ్యక్తము చేయుచుండును. బకాసురవధఘట్టమున పాండవులు విడిచియున్న ఇంటి కాయసుర కాహారము పంపువంతు వచ్చుటచే యజమానుఁడైన బ్రాహ్మణుఁడును, అతని భార్యయును, గూఁతురును నేను పోయెద నేను పోయెద నని పల్కుచు దుఃఖించుచుండ, "బాలుఁడొక్కఁడు కొఁడొక కోల చేతఁ బట్టుకొని యేన రక్కసు గిట్టి చంపి చులుకగా వత్తు మీరేడ్వవలవ దనుచుఁ గలయ నూరార్చెఁ దనతొక్కుఁబలుకు లొప్ప" నని నన్నయ వ్రాసియున్నాఁడు. ఇట్లు పలుకుట యా యింటివారికిఁ గలిగిన ఆపదయొక్క అనివార్యతనుగాని, రక్కసుని బలముగాని తెలియని బాలుని స్వభావమున కెంతయు సహజమై నన్నయమనస్తత్వ పరిశీలనమును వెల్లడించుచున్నది. ధర్మరా జింద్రప్రస్థపురమున రాజ్య మొనరించునప్పుడు దొంగలొక విప్రుని హోమధేనువు నపహరింప నా విప్రుఁడు దుఃఖించుచు వచ్చి "వదలక మ్రుచ్చుల వధియించినా హోమధేనువుఁ గ్రమ్మఱఁ దెచ్చియిమ్ము. జననుత దాని వత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచు నున్నయదియు" అని పల్కినట్లు నన్నయ వర్ణించెను. ఇచ్చట నాతఁడు వత్సముయొక్క పరిస్థితిని సహజముగా వర్ణించి కరుణరసమును గురియించి యున్నాఁడు. సభాపర్వమున దుశ్శాసనుఁడు ద్రౌపదిని సభకుఁ దోడ్కొని వచ్చునపు డామె కడుభయము నొంది గాంధారియొద్దకు నరిగెనని నన్నయ వర్ణించెను. దుశ్శాసనుఁడు స్త్రీ లున్న యెడకు రాఁడని ద్రౌపది రక్షణాపేక్షమై గాంధారి చెంత కరిగెను. ఇచ్చట నన్నయ రచించిన తీరు స్త్రీ స్వభావమున కుచితమై మిక్కిలి సహజముగా నున్నది. నిద్రించుచున్న దమయంతిని విడిచిపోవు నలుని పరిస్థితిని నన్నయ,

"కలి దమయంతిఁ బాప సమకట్టు సతిం బతి వాయ నోపఁ డా
లలన నుదీర్ణ సౌహృదబలంబున నిట్టులు రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహరజ్జుఁ బెనంగి గతాగతకారియైన యు
య్యేలయునుబోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై."

అని వర్ణించెను. "గతాగతకారియైన యుయ్యేలయును బోలె" నను నుపమాన మిచ్చట నలుని మానసస్థితిని చక్కగా వ్యక్తము చేయుచున్నది. నలుఁ డుద్యానవనమున విహరించుచు హంసను బట్టుకొనఁగా మిగిలిన హంసలు "దాని విడిచిపోవఁగా నోప కఱచుచు నంతరిక్షమునను హంసలెల్లఁ బిండుగట్టి తిరుగుచుండె"నని నన్నయ వర్ణించియుండెను. ఇచ్చట నన్నయ గుంపులోని యొక పక్షి కావద తటస్థించినప్పు డితర పక్షులు వర్తించు విధమును నిసర్గరమ్యముగా వర్ణించియున్నాఁడు. ఇవన్నియు నాతని జంతు మనస్తత్వ పరిజ్ఞానమును నిరూపించుచున్నవి.

నన్నయ తాను "నానారుచిరార్థసూక్తినిధి" యని చెప్పుకొని యున్నాఁడు. సూక్తు లనఁగా సుభాషితములు. మహాకవులు తమ కావ్యములం దుపదేశములు గూడ

నుండవలెనను నుద్దేశముతో వ్యంగ్యముగనో వాచ్యముగనో యుపదేశాత్మకములగు పెక్కు సూక్తులను జొప్పించుచుందురు. ఆంధ్రమహాభారత మిట్టి సూక్తిరత్నములకు రత్నాకరము. నన్నయ తాను రచించిన భారతభాగమునఁ బెక్కుసూక్తుల నర్థాంతరన్యాసాలంకార పూర్వకముగాఁ బ్రవేశపెట్టియుండెను. అవి ఆయా ఘట్టములందలి కథలతో సన్నిహిత సంబంధము కలిగియుండును. అట్లుగాక యతఁడు కథతో సంబంధము లేకుండ నాయా సందర్భములం దుచితరీతి వాడుకొనుట కనువుగా విడివిడి పద్యములలో వ్యక్తము చేసిన సూక్తులనేకము లున్నవి.

"మతిఁ దలపఁగ సంసారం
బతి చంచల మెండమావు లట్టులు సంపత్
ప్రతతు లతి క్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్."

మున్నగు పద్యము లట్టివి. ఇట్టి సూక్తులను నన్నయ సాధారణముగాఁ గందపద్యములందే పొదుగుచుండును. అతని సూక్తులు రుచిరార్థములైనవి. అనఁగా మృదుమధురములై చదివిన కొలది చవులూరించు సామర్థ్యము గలవని చెప్పవచ్చును. అతని సూక్తులెంతహితములో యంతమనోహరములుగా నుండుట యొక విశేషము. నలోపాఖ్యానమున నలుఁడు తన్ను విడిచివెళ్ళిపోయిన పిమ్మట దమయంతి యాతని కొఱకై పలుచోట్ల వెదకి యాతనిఁ గానక దుఃఖించుచు,

"వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగువేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్." అర. 2-48.

అని పలికియుండెను. స్థూలముగా చూచినచో నిది సత్యముయొక్క మాహాత్మ్యము తెలుపునట్టిదిగా గోచరించుచున్నను, నలుని విద్యావైదుష్యములను గూడ చక్కగా వ్యక్తముచేయుచున్నది కథారంభమున నలుని వైదుష్యమునుగూర్చి యేమియుఁ జెప్పియుండమి కతమున నన్నయ దాని నిచ్చట వ్యంగ్యముగా వెల్లడించెను అతని సూక్తుల రుచిరార్థయుక్తి కిది యొక చక్కని సూచన సామెతలు, నానుడులు, జాతీయములు, నీతిబోధక వాక్యములు మున్నగు వానిని గూడ సూక్తులుగా గ్రహింపవచ్చును. ఇట్టి వాతని రచనలోఁ బెక్కు గోచరించును. "ఇప్పుడు ప్రొద్దు లేదు జేపకడ చూతము" (ఆది. 2.33) "ఏ నెట నీ వెట సుతుఁ డెట" (ఆది. 4.250) "విని రోయుతీఁగ కాళ్ళం బెనఁగెను దాననచు" (ఆది. 5.250) "కుంతి కడుపు చల్లఁగాఁ బుట్టిన ఘనభుజుండు" (ఆది. 6.18) "ఈ వ్యాధి యొంటఁ దీరదు" (ఆది. 8.248) "వంట యిలు కుందెలు సొచ్చె" (ఆది. 6.186) "నీ యిమ్ముల నుండు బుద్ధి సెప్పకుండుము మాకున్" (సభా. 2.188) మున్నగునవి యిందుకు దృష్టాంతములు. ఇవి యన్నియు నతని రుచిరార్థసూక్తినిధిత్వమును. దేశియశబ్దప్రయోగ వైచిత్రిని వెల్లడించుచున్నవి.

"సారమతిం గవీంద్రు" లను పద్యమున నన్నయ తన కవితాగుణములలో నక్షర రమ్యత యొకటి యని తెల్పియుండెను. ఈ యక్షరరమ్యత కేవల సరళాక్షర ఘటిత పద ప్రయోగము వలననే కలుగు నని భావింపరాదు. అది రసానుకూల పదప్రయోగ ముపై నాధారపడియుండును. పదముల యన్యోన్యమైత్రికి శయ్య యనిపేరు. మాలా కారుఁడు దండ గ్రుచ్చునప్పు డే పూవు తరువాత నే పూవు గ్రుచ్చిన సుందరముగా నుండునో గ్రహించి గ్రుచ్చునట్లు కవి యేపదము తరవాత నే పదము వాడిన నందముగా నుండునో గ్రహించి పదప్రయోగము కావింపవలయును. రసానుగుణములైన పద ముల ప్రయోగముచే నేర్పడు శయ్యాసౌష్ఠవము నన్నయ రచనయందుఁ బలుచోట్ల నక్షరరమ్యతను సమకూర్చుచుండును. "పతదుర్వీధర ధాతునిర్ఝర జలాఢంబై" (ఆది. 2.24) "గంగ నిజాంగ దీప్తు లెసఁగం జనుదెంచి లతాంగి సంతతోత్తుంగ పయో ధరద్వితయ" "అలయక పుణ్యవ్రతములు సలుపుచు సైరంధ్రి యనఁగఁ జైద్యేశు పురిన్" (అర. 2.121) మున్నగు పద్యము లిందుకు నిదర్శనములు.

తెలుఁగున నన్నయ నాఁటి కున్న పదసంపద చాల స్వల్పము. అతఁ డా పద ముల నన్నిటిని బరిశీలించి, ద్రవరూపమున నుండిన పెక్కు పదములకు స్థిర రూపము నొసంగి, కావ్యరచన నారంభింపవలసివచ్చెను. అందుచే నాతని రచనలోఁ దత్సమపదములును సంస్కృతసమాసములును హెచ్చుగాఁ గానవచ్చును అయ్యు నాతని రచన ప్రసాదగుణముతో నిండారి యించుకైన క్లిష్టత లేక పాఠకుల కానందము కలిగించుచుండును. అతనివలె సుందరబంధము, అక్లిష్టాన్వయము నైన రచన కావిం చిన వారి సంఖ్య చాల తక్కువ. అతని పద్యములు పెక్కు నాద సౌందర్యమునకు నిలయములై కొన్నియెడల వేదఋక్కులవలె ధ్వనించుచు వినువారి డెందముల నాకర్షించుచుండును. ఉదంకుఁడు నాగరాజుల స్తుతించిన పద్యములును, వర్షాశరత్తులను వర్ణించు పద్యములు ఇందుకు నిదర్శనములు. అతని రచనలోఁ బెక్కుచోట్ల సంస్కృత వాక్యయోజన కానిపించును. అతఁడు విశేషణములను విశేష్యములకు ముందును వెను కను గూడ వాడుటయేకాక వాని నడుమ నితరపదములను జొప్పించి వానికి వ్యవధా నము కూడ కల్పించుచుండును. అతని పద్యగద్యదములు రెండింట యత్తదర్థక పదములతోఁ గూడిన వాక్యములు గోచరించును. అతని రచనయ దలి యలంకారము లన్నియు నప్రయత్నసిద్ధములై యట్టివే. ఉపమ, రూపకము, అర్థాంతరన్యాసము అను నలంకారములందు హెచ్చు. "సాత్యవతేయ విష్ణుపద సంభవమై" (ఆది. 1.72) అమితాఖ్యానక శాఖలం బొలిచి మున్నగు పద్యము లాతని సంపూర్ణరూపక రచనకు నిదర్శనములు. అతని అర్థాంతరన్యాసములు పెక్కు మూలకములై యట్టివి. "తల వడకఁ దొడఁగె నింద్రియములగర్వ మణఁగె" (ఆది. 3.191) మున్నగు పద్యము లతని స్వభావోక్తి కల్పనమునకు దృష్టాంతములు. అగ్నిశిఖయుఁబోలె నంటను డాయనుఁ జూడరాని యట్టి శుభచరిత్ర (అర. 2.90) "అర్ధరాత్రము నప్పు డందుల కేతెంచె గజ యూథములు జలకాంక్షఁ జేసి యంబుధి విమల తోయంబు లాస్వాదింపఁ జనుదెంచు జల ధరసమితియట్లు" (అర. 2.110) మున్నగు సుందరములైన యుపమానము లాతని

రచనలో నసంఖ్యాకములుగాఁ గనిపించును విగతజీవుఁడయ్యుఁ గచునిచే సంజీవితుఁడయిన శుక్రుఁ "ఉచ్చారణదక్షుచేత నభిహితం బగు శబ్దంబునట్లు గోలె వెలింగె" నను నుపమాన మతని శబ్దబ్రహ్మవేత్తృత్వమును సూచించుచున్నది. అతని రచనలో మూఁడు నాలుగుచోట్ల శ్లేషాలంకారములున్నవి. "ఉద్యానవనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతంబైన దాని" (ఆది. 2.27) ఇత్యాదిగాఁగల సముద్రవర్ణన వచనమందలి శ్లేష రమణీయముగా నున్నది. "వసువులు రుద్రులు వసుహీన విప్రుల క్రియ దక్షిణాశ్రితులైరి. భీతి" (ఆది 2.99) అనుచో దక్షిణాశ్రితులను పద ముపమానోపమేయములు రెండింటికి నన్వయించుచున్నది. ఇంద్రప్రస్థ వర్ణనమునందలి కొన్ని పద్యములను, శరద్వర్ణనమునందలి "భూసతికిం దివంబునకు (అర. 4.141) అను పద్యమును ఉపమానోపమేయములు రెండింటితో నన్వయించు విశేషణములతోఁ గూడియున్నవి.

నన్నయ రచనమున నెడనెడ శబ్దాలంకారములు గూడ గోచరించును. వీనిలో వృత్త్యనుప్రాసముల సంఖ్య హెచ్చు "సటాసముత్పాటన కుపితకుంజరవైరియుంబోలెఁ గడు నలిగి పటుకుటిల భ్రుకుటి ఘటితనిటలుం డగుచు" (సభా. 1.194) అను జరాసంధ వర్ణనము 'ట' కారవృత్త్యనుప్రాసముతోఁ గూడి యతఁడు పటపటపండ్లు కొఱుకుచున్నాఁడా యను భావమును కలిగించుచున్నవి. "వడిఁ బడియెఁ బిడుగు లుడుగక వడఁకె మహీతలము" (అర. 3 369). వంటి కొన్ని పద్యములందు ధ్వని యర్థానుకారియై యింపునింపుచున్నది. "ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డను సురారి నిశ్చల భీకరాకారుఁ బట్టి" అను పదమునందలి 'ర'కార పునరావృత్తి తేటగీతిలోఁగూడ ప్రాస సౌందర్యమును గూర్చుచు రమణీయముగా నున్నది. "అఱపొఱడు కుఱుచ చేతులు, నొఱవ శరీరంబు, గలిగి" (అర. 2.134) అను కందమునందలి శకటరేఫ పునరావృత్తి బాహుకుని వికృతాకారమును లెస్సగా సూచించుచున్నది. "అనిలజున్ రాజీవ రాజీవసత్సమదాళి వ్రజచక్రవాక బకహంస క్రౌంచ నాదంబులన్" అను పద్యమునందలి "రాజీవ+రాజీ+వసత్" అనుచోట యమక మున్నది. ఇట్లే ఛేకానుప్రాస సహిత పద్యములునుగొన్ని కనవచ్చును. కొన్నిచోట్ల శబ్దములకుఁ గల అర్థద్వయ సామర్థ్యమును పురస్కరించుకొని నన్నయ హృద్యమైన చమత్కారమును సమకూర్చుచుండును. "కలి దమయంతిఁ బాప సమకట్టు సతిన్" అను పద్యమునందలి "విమోహరజ్జుల" అను పదమును, అస్త్రవిద్యా ప్రదర్శన సందర్భమున కృపుఁడు కర్ణునితోఁ దెలిపిన "దొర యగు దేవి నీ కెదిరి దోర్బలశక్తి నితండు చూపెడిన్" అను దానియందలి "దొర" యను శబ్దమును "ధనంజయ ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి" యను పద్యమునందలి ధనంజయ ప్రవరు అను పదమును బరికించిన నీ విషయము తేటతెల్లమగును.

నన్నయ పెక్కుచోట్ల విశేషణములను సాభిప్రాయముగా వాడియుండెను. "అనిలజ! నీ కిట్లని పలుకను దలఁపను దగునె", "పాండుభూపాలతనూజపంచకము పంచశరాహతిఁ బొందె", "వాఁత సుతుండు వీచె తృణఖండసముం డగుచుండ మాగధున్" మున్నగు పద్యము లందుకు నిదర్శనములు. నన్నయ యెడనెడ వాడు

చుండు పదములును, జాతీయములను భావగంభీరములై పరమౌచిత్యమును ప్రకటించు చుండును. ద్రౌపది ప్రాతికామితో" అన్న నా కెఱుగఁజెప్పు నీవెఱుఁగు దేని"యని పలికి నవుడు వాడిన 'అన్న' శబ్దమును, సౌంభకాఖ్యానమున ప్రద్యుమ్నుఁడు సూతునితో "అక్రూరాదులను నేమి యని నగరె సభన్" అని పలికిన సందర్భమునందలి "ఏమియని నగరె" అను పదములును జాతీయములై గంభీరమైన యర్థమును సూచించుచు నింపు నింపుచున్నవి. అర్జునుఁడు ద్రుపదుని గట్టి తీసికొని వచ్చినప్పుడు ద్రోణుఁ డతనిఁజూచి "వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె" ఇత్యాదిగా పల్కిన పద్యము నాటకోచితమై ద్రోణుఁడు కావించిన హేళనము నెంతో వ్యంగ్యముగాఁ బ్రకటించుచున్నది. ఆస్తీకుఁడు సర్పయాగమును విరమింపఁజేయుమని గోరుచు జనమేజయుని స్తుతించిన పద్యములును శిశుపాలుఁడు కృష్ణుని నిందించుచు పల్కిన పల్కులును వారు పద్య మయములైన యుపన్యాసము లిచ్చుచున్నారా యను తలంపుఁగలుగఁజేయుచున్నవి.

తెలుఁగున పద్యమునకు వలెనే గద్యమునకును నన్నయయే యాద్యుఁడని చెప్ప వచ్చును. అతని వచనములు సంభాషణ సందర్భముల నలఁతి యలఁతి వాక్యములతోఁ గూడియు వర్ణన సందర్భముల దీర్ఘ సంస్కృత సమాసములతోఁ గూడియు మిక్కిలి ధారాళములై యుండును. వినతాకద్రువల సంభాషణ మాతని సంభాషణ శైలికి నిదర్శనము. ద్రౌపది ధర్మజితయా, యధర్మ విజితయా యను నంశమును గూర్చి కర్ణ వికర్ణులు కావించిన వాగ్వాదము హేతువాదపూర్వకమై వాది ప్రతివాదుల పక్ష ముల నవలంబించి న్యాయవాదులు కావించు వాదమును దలఁపించుచున్నది. అరణ్య పర్వమునందలి వచనములలో విషయప్రధానములైన వాని సంఖ్య హెచ్చు. నన్నయ శైలి పద్యగద్యములు రెండింట గాంభీర్యము, అన్వయ సౌలభ్యము, ధారాశుద్ధి, అర్థ వైశద్యము, అను ప్రధాన లక్షణములతోఁ గూడియుండును.

కథన, వర్ణన, సంభాషణ శైలులు మూఁడును నన్నయ రచనలోఁ గోచరించు చున్నను కథనశైలి కొంచెము హెచ్చు. అతఁడు కథకుఁడు కథ చెప్పునట్లుగా తటస్థుఁడై కథోపాఖ్యానములను నిర్వహించుచుండును. అతఁ డరణ్యపర్వము ఆశ్వా సాంతములయందు 'రమణీయ రమ్య' శబ్దములను, సభాపర్వ ప్రథమాశ్వాసాంతమున 'రసోత్కట' శబ్దమును వాడియుండెను. అతఁ డాదిపర్వమును రచించి దానిని వేంగీ విద్వత్పరిషత్తునకు వినిపించియుండెననియు, నందలి పండితులు కావ్యము రమణీయార్థ ప్రతిపాదకముగా నుండవలెనని నిర్ణయించినందుచేతనే నన్నయ యా శబ్దములనట్లు వాడించియుండె ననియు శ్రీ విశ్వనాథకవిసమ్రాట్టు లభిప్రాయపడుచున్నారు.

నన్నయ తెలుఁగు భాష రూపమును తీర్చిదిద్దుటలో చూపినప్రతిభ అప్రతిమాన మైనది. అతని ప్రయోగములు తరువాతి ఆంధ్ర కవులకును, లాక్షణికులకును వేద ప్రయోగముల వలె శిరోధార్యములై విలసిల్లినవి. "విప్రసతికి నూఱు వేడఁ జన్వరము" లనుచో చనును అను తద్ధర్మక్రియ యందలి 'ను' ప్రత్యయమునకేకాక ప్రకృతియందలి ఉత్తునకుఁ గూడ లోపము వచ్చినది. నన్నయ 'ఉండునది' అను విధ్యర్థకరూపమును 'ఉన్నది' అని ప్రయోగించియుండెను. అయి+ఉను అనుదానిని 'అయియును' అని

కాక అయ్యీను అనురూపముతో వాడియున్నాఁడు. ఆనతి, ఓటమి మున్నగువాని యందలి 'ఇ' త్తున కచ్చుపరమగునపుడు సంధిచేసియున్నాఁడు. "ధైర్యశక్తికి న్నరుదుగ" [ఆది. 1.322] అను చోటవలె రెండుమూఁడుచోట్ల ద్రుతద్విత్వ సంధి కనవచ్చుచున్నది. నన్నయ గుఱించి, చేసి (చేత) మై, పొంటె అనువానిని విభక్తి ప్రత్యయములుగను, 'తదర్థము' అను పదమును చతుర్థ్యర్థమునను ప్రయోగించియున్నాఁడు. కు+అయి అనువాని కలయికచే నేర్పడిన కై. కయి అనువానినే కాని అతఁడు కొఱకు అను ప్రత్యయమును వాడియుండలేదు. సర్వనామములలో ఉత్తమపురుషైక వచనమున 'ఏను' అనురూపమునే అతఁడు విరివిగా వాడియున్నాఁడు. 'ఎవ్వరు+ఏని' అను వానినతఁడు ఎయ్యేని అనురూపముతో వాడియుండెను. అతని రచనలో ఒక్కరుఁడు అనునది మహద్వాచకముగాను, ఒక్కఁడు అనునది అహమద్వాచకముగను గోచరించును. పూరణార్థమున అగు, అవు అను తద్ధర్మ విశేషణములు వాడఁబడినవి. భావార్థమున 'డు' అను ప్రత్యయము చేర్చిన రూపము లాతని రచనలో రెండు, మూఁడు కానవచ్చును. "వానిహీనుంగా జేయుడు నాకుఁ జతుర్వర్గము" అనుచో చేయుడు అనఁగా చేయుట అని అర్థము. అతని రచనలో అచ్చటచ్చట కర్మణ్యర్థక వాక్యములు గూడ గోచరించును. అతఁడు దీర్ఘ వాక్యముల నడుమ నక్కడక్కడ చిన్నచిన్న ప్రత్యక్ష వచనములనుఁ గూడ ప్రవేశపెట్టియుండెను.

నన్నయ సంస్కృతమునుండి శ్రవణపేయములైన పెక్కు వృత్తములను గ్రహించి, వానికి తెలుఁగునకు సహజమైన యతిప్రాసలు చేర్చి భారతమున వాడియుండెను. పూర్వాంధ్రమహాకవులలో నన్నయయు, నరణ్యపర్వ శేషమున నెఱ్ఱనయుఁదప్ప మఱెవ్వరును మధ్యాక్కరలను వాడి యుండలేదు నన్నయ తనకుఁ బూర్వము శాసనములలో నున్న మధ్యాక్కఱలలో వలె తాను రచించిన వానిలోఁ గూడ పంచమగణాద్యక్షరమునే యతిగాఁ బాటించెను. ఎఱ్ఱనయట్లుగాక చతుర్థగణాదిని యతి వేసియుండెను. ఆంధ్రలాక్షణికు లెఱ్ఱనపద్ధతినే యనుసరించిరి. అప్పకవి సమసీసమును, విషయసీసము నం దాఱు భేదములను మొత్త మేడుభేదములను జెప్పి నన్నయ వానిని భారతమున వాడియున్నట్లు తెల్పియున్నాఁడు. కాని నన్నయ అందలి మూఁడు విధములను మాత్రమే వాడియున్నాఁడు సీసపద్యము లందలి యతుల విషయము నన్నయ యొక నిశ్చితమైన విధానము నవలంబించెను, తరువాతికవు లొకే సీసమున యతిప్రాసలను రెండింటిని వాడియున్నారు. అతనిరచనలో రెండుమూఁడు చోట్ల సంయుక్తాక్షరమున ద్వితీయాంగముగా నున్న రేఫమును తేల్చిపలుకవలసియున్నది. "నక్షత్ర యుతుండుగా శశిప్రకాశజయోన్నతమైన యష్టమిన్" "తలరఁగ రేణుకక్రథన" అను చోట్ల ప్ర, క్ర అనువానిని తేల్చిపలకవలయును. నన్నయ నీతి ధర్మములను దెల్పుటకు కందములను, వర్ణన కథాకథనములకు సీసమును, దుఃఖక్లేశవర్ణనమునకు మధ్యాక్కరలను వాడియుండెను. అతఁ దేఛందమును గ్రహించినను ధారాశుద్ధికి లోపముండదు.

సంస్కృతమున లౌకికవాఙ్మయమునకు వాల్మీకి మహర్షి ఎట్టివాఁడో యాంధ్ర వాఙ్మయమున నన్నయ అట్టివాఁడు. ఆమహానీయు లిరువురు నారెండువాఙ్మయము

లకు మొట్టమొదటఁ దీర్చిదిద్దిన కావ్యాకృతు లెంతకమనీయములో యంతప్రశంసనీయములు. నన్నయ భారతము నుదాత్తసుందరముగా నారంభించి తరువాతి కవులకు మార్గదర్శకుఁ డయ్యెను. తరువాత వెలసిన యాంధ్రకవు లెల్లరు నామహనీయుని గురువుగా భావించి తమకావ్యారంభములందు స్తుతించియున్నారు. అతఁడు తనరచనచే నొకవంక నాంధ్రభాషను, వేఱొకవంక దానికిఁ బ్రేరకుఁడైన రాజరాజును అమృతమూర్తులను గావించియున్నాఁడు. అతని కతఁడే సాటి.

"ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్."



# భక్తి కవితా చతురానన
# బమ్మెరపోతన
## డాక్టర్. సి.నారాయణ రెడ్డి గారు

బమ్మెరపోతన అనగానే భాగవతం గుర్తొస్తుంది. భాగవతం అనగానే భక్తిలో తడిసిన గాథలు అలలు అలలుగా పొంగివస్తాయి— గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్ర, వామనచరిత్ర, రుక్మిణీకల్యాణం, అంబరీషోపాఖ్యానం, అజామిళోపాఖ్యానం— ఇంచుమించుగా భాగవతంలోని ఉపాఖ్యానాలన్నీ. ఈ భక్తమణుల చరిత్రలను ఏకత్రితం చేసిన మూలసూత్రం వాసుదేవతత్త్వం. వ్యాసునంతటివాడే వేదాలను వింగడించి, అష్టాదశపురాణాలు విరచించి, బ్రహ్మసూత్రాలను ప్రవచించి, భారతాన్ని ప్రబంధీకరించి అప్పటికీ మనస్సు నిండక 'హరికీ, యోగివరులకూ అభిలషితమైన భాగవత గాథ పలుకనైతినే' అని ఖిన్నుడైనాడు. నారదబోధితుడై విష్ణుకథాశిరోమణియైన భాగవతాన్ని ఎన్నుకున్నాడు. ఆ రకంగా తన మదిలో కలిగిన అరకొరలను తీర్చుకొన్నాడు.

వ్యాసభారతం తెలుగుసేత ఆంధ్రకావ్యలక్ష్మికి అసలైన కైసేత. ఆ యమ్మను అంతకుముందు చిటిపొటి నగలతో సింగారించిన తెలుగుకవులు లేకపోలేదు. వారి వెన్నెలపదాలూ, తుమ్మెదపదాలూ, ఉయ్యాలపాటలూ, నివాళిపాటలూ, ఏలలూ, జోలలూ పుడమితల్లి కడుపున కరిగిపోయి ఉంటాయి. దేశీయుల నాల్కలలో మాటుమణిగి ఉంటాయి, లేక ఏ తాటాకులలోనో, రాగిరేకులలోనో, రాతిపలకలపైనో ముక్తకప్రాయంగా పడిఉంటాయి. అయితే తెలుగు కవిత్వానికి తొలిసారిగా గ్రంథస్థితి కలిగించింది కవిత్రయమే. అంటే నేటి గ్రాంథికభాషకు పాదులువేసినవారు నన్నయ్య-తిక్కన్న-ఎర్రన్నలే! భాషకేకాదు, తెలుగులో కావ్యరచనాశైలిని తీర్చిదిద్దింది కూడా ఈ మూర్తిత్రయమే! చతుర్వేదసారమైన వ్యాసభారతం వారిచేతిలోపడి కావ్యచిక్కణత్వాన్ని సంతరించుకుంది. పద్యవిద్యకు ఆద్యుడైన వాల్మీకి రచించిన రామాయణం భాస్కరాదుల ద్వారా తెలుగుపొలంలో పదంమోపింది. ఆ విధంగా భారతీయ సంస్కృతికి మూలకందాలైన మూడుగ్రంథాలలో భారతరామాయణాలు ఆంధ్రావళి చేతికందినవి. ఇక మిగిలింది వ్యాసభాగవతం. అప్పటికి దానిపై ఎవరిచూపూ పడనట్టుంది. చూపు పడినా చేయిసాచే చొరవ ఏ కవికీ కలుగనట్టుంది. ఆ మహాభాగవతఫలం ఒక తెలుగు చిలుకకొరకు వేచిఉంది. ఆ చిలుక తెలంగాణా నడిబొడ్డులో ఓరుగల్లుగడ్డలో బమ్మెర కొమ్మపై అప్పటికే వీరభద్రవిజయాన్ని వినిపించింది. భోగినీదండకాన్ని ఒక రాచ

వలరాచవాని చెవులకు రసికవాణిగా అందించింది. ఆ శుకరాజే మన పోతరాజు. ఆ "శుకముఖసుధాద్రవమున మొనసియున్న" భాగవతఫలరసాస్వాదనం తెలుగురసిక భావవిదుల మహిత భాగధేయం.

వీరభద్రవిజయం రచించేనాటికి పోతన్న పిన్నవాడు. పెక్కు సత్కృతులు వ్రాయనివాడు. తన గురువైన ఇవటూరి సోమనారాధ్యుని ప్రసాదమహిమచే ఆ కృతిని రచింపగలిగినాడు. వీరభద్రవిజయం పోతన్న చేయనున్న సేద్యానికి తొలిచాలు. సర్వజ్ఞ సింగభూపాలునికి కానుకవెట్టిన భోగినీదండకం మలిచాలు. ఇక చాలు. ఆ తరువాత పోతన్న మనసు మలుపు తిరిగింది. అటు వీరశైవమతం మీదా ఇటు రసికరాజానుమతం మీదా దృష్టి తొలగింది. వ్యాసునికి విష్ణుకథ విరచించని కొరత తోచినట్లే మన పోతన్నకు "శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనా కుతూహలం" కుట్మలించింది అది రాకానిశాకాలం. సోమోపరాగసమయం. గంగాస్నానం. మహేశ్వర ధ్యానం—అదీ పోతన్న స్థితి. "కించిదున్మీలత లోచనుడై" ఉండగా రామభద్రుని సాక్షాత్కారం. మహాభాగవతం తెనుగుసేయుమని ఆనతి. వెరగుపడిన చిత్తంతో పోతన్న అంగీకృతి. చిత్రం! పోతన్నకు కలిగిందేమో విష్ణుకథా రచనా కుతూహలం. చేసిందేమో మహేశ్వరధానం. కట్టెదుట నిలిచినవాడో—రామచంద్రుడు. ఆ మహాను భావుడు సూచించిన వస్తువో గోవిందకథాకదంబమైన భాగవతగ్రంథం. అంకితం తనపేరనే అన్నాడు ఆ రామరాజు. ఔ నన్నాడు మన పోతరాజు. "శ్రీ రామ చంద్రుని సన్నిధానంబు కల్పించుకొని" "హరికి, నందగోకులవిహారికి" అంటూ షష్ఠ్యంతా లెత్తుకొని ఆంధ్రభాగవతాన్ని చిన్నికృష్ణునికి సమర్పించుకున్నాడు. రామ న్నను శ్రోతగా నిలుపుకొని భాగవతగాథను విన్నవించుకున్నాడు. ఇది చిత్రమా? కాదు. పోతన్న పెంపొందించుకున్న సమచిత్తం, శివుడు, కేశవుడు, రాముడు, కృష్ణుడు— ఈ నాలుగు మూర్తులకు ఏకత భజించడం పోతన్న అభేదభక్తికి తులలేని తార్కాణం. ఇంతటి సమన్వయ దృక్పథం అప్పటి మతవాతావరణంలో అపూర్వం.

ఏ కథను ఏరుకోవాలి? ఏరుకున్న కథను ఎక్కడ ఎత్తుకోవాలి? ఆ వస్తువును ఏ దృష్టితో విస్తరిస్తున్నదీ ఎలా వివరించాలి? తన కవితాలక్ష్యాలను ఏ రకంగా సిద్ధాంతీకరించాలి? ఏ కవికైనా ఈ అవస్థ తప్పదు. కృత్యాద్యవస్థ అంటే ఇదే. ఆదికవి నన్నయభట్టారకునికీ ఇది తప్పలేదు. అవతారికలో రాజరాజును గూర్చి తనను గూర్చి చెప్పుకున్న తర్వాత అసలు విషయం అందుకున్నాడు. తాను వ్రాయ నున్న భారతం తన ఎన్నిక కాదు. అది ప్రధానంగా రాజరాజు మన్నిక. హిమకరుడు మొదలుకొని పాండవోత్తములవరకు తీగసాగిన తన వంశీయుల చరిత్రను తెలుగులో వినాలనే అభీష్టం రాజరాజుకు కలిగింది. అది కాస్తా తన కులబ్రాహ్మణుడైన నన్నయచెవిలో వేసినాడు. భారతశ్రవణం అనేక పుణ్యఫలప్రదమని దానికి ప్రాతి పదికగూడా వేసినాడు. ఆ రాజపోషకుని అనుమతంతో, విద్వజ్జనుల అనుగ్రహంతో తాను నేర్చిన విధంబున వ్యాసభారతాన్ని తెనిగించినాడు నన్నయభట్టారకుడు. తెలు గులో ఆదికవి నన్నయ్య, సంస్కృతంలో ఆదికవి వాల్మీకి. మరి నన్నయ్య ఆ రామాయ

ణాన్ని వదలి భారతాన్ని చేపట్టడానికి ప్రధానకారణం రాజరాజుకు భారతంపట్ల గల అభిమానం అని తెలిపోయింది. అంటే వస్తుపరణంలో కూడా ఆ కృతికర్తకు స్వేచ్ఛ లేదేమో అని అనుకోవలసి వస్తుంది. అవతారికారచనలోనూ తదనంతరకవులకు నన్నయ్యే మార్గదర్శి. తిక్కన్న స్థూలంగా ఆ సంవిధానాన్నే అనుసరించినా, కొంచెం కొత్తదారి తొక్కినాడు. నన్నయ్య తెనిగించగా మిగిలిన భారతాన్ని తాను రచించాలని సంకల్పించుకున్నాడు. ఇది ఎవరో సూచించిన వస్తువు కాదు. తిక్కన్న తానే చేసుకున్న ఎన్నిక. సరిగ్గా పోతన్న తిక్కన్న తెన్నునే అనుసరించినాడు. భాగవతావతారికను విరాటపర్వావతారికకు తోబుట్టువుగా తీర్చిదిద్దినాడు తిక్కన్నలాగే తన వస్తువును తానే ఏరుకున్నాడు పోతన్న. తిక్కన్న భారతరచనాకౌతుకం కనబరిస్తే పోతన్న శ్రీమన్నారాయణకథా ప్రపంచ విరచనా కుతూహలం కనబరచినాడు. అతడు నిద్రించే సమయంలో "కలలో కన్నట్లు"గా హరిహరనాథుడు కనిపిస్తాడు ఇతడు గంగాతీరంలో మహేశ్వరధ్యానం చేస్తూ కన్ను లరమూసుకొని ఉండగా రామభద్రు డగుపిస్తాడు. "కరుణారసము పొంగి తొరగెడు చాడ్పున" అన్న సీసపద్యంలో హరిహరనాథుణ్ని రూపుకట్టించినాడు తిక్కన్న. "మెఱుగు చెంగట నున్న మేఘంబు కైవడి" అన్న సీసపద్యంలో సీతానాథుణ్ని చిత్రించినాడు పోతన్న. అతడు సర్వేశ్వరుడు ఇతడు రాజముఖ్యుడు. అక్కడ హరిహరనాథుడు సెలవిస్తాడు—భారతరచనా ప్రయత్నం భవ్యపురుషార్థతరుపక్వఫలమని. దానిని తనకు కృతి ఇమ్మని; ఇక్కడ రామభద్రుడు ఆనతిస్తాడు—మహాభాగవతం 'తెనుగుసేయు'మని తనపేర అంకిత మిమ్మని. తామే ఇతివృత్తాన్ని స్వీకరించడం, నరేశ్వరుణ్నికాక సర్వేశ్వరుణ్ని కృతిపతిగా నిర్ణయించడం తిక్కన పోతన్నల కున్న సమధర్మం. ఈ కృతులు రచించేనాటికి ఇద్దరి మనఃప్రవృత్తులు ఎల్లలు లేని భక్తిసరిత్తులు. భారతరచనం తిక్కన్న దృష్టిలో ఆరాధన విశేషం. భాగవతరచనం పోతన్న దృష్టిలో భవబంధవిమోచనం. ఇక్కడే ఉంది పోతన్న అదృష్టం చిత్తస్థితికి తగిన ఇతివృత్తం దొరికింది. పరవశించి పాడుకున్నాడు

"పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట; నేఁ
బలికిన భవహర మగునట;
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా?"

నాలుగు పలుకులను ప్రాసస్థానంలో చిలికి తన పులకలు వెలార్చుకొన్నాడు. అయితే భాగవతరచన అంతంత మాత్రాన జరిగేదికాదు. ఈ "సహజ పాండిత్యు"నికి అది తెలియదా ? అదీ విన్నవించుకొన్నాడు.

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపఱుతు."

భాగవతం తెలుసుకోవడం, తెలిసింది తెలుపుకోవడం చిత్రమట! నిజమే. రామాయణం అలలా సాగిపోయే మనిషికథ. భారతం భిన్నలౌకిక ప్రవృత్తుల సంఘర్షణవ్యథ. భాగవతం స్థూలదృష్టికి కృష్ణలీలా పేటిక, విష్ణుభక్తుల కథావాటిక. సూక్ష్మంగా పరిశీలిస్తే అది మధ్య మధ్య ఎన్నెన్నో విప్పలేని వేదాంతగ్రంథు లున్న మహాగ్రంథం ఆ ముడులు విప్పడం హరునికీ విరించికీ దుష్కరమే! మరి ఆ భాగవతరహస్యం ఆ భగవంతునికే తెలియాలె. భారం అతనిపై వేసి వ్యాసభాగవతవ్యాఖ్యాత అయిన శ్రీధరుణ్ణి ఆలంబనం చేసుకుని తెలియవచ్చినంత తేటపరచినాడు ఈ వినయశీలుడు. ఈ తేటపరచడం ఏ తెలుగులో? నన్నయ ప్రారంభించిన తత్సమపద బహుళమైన తెలుగులోనా? లేక పాలకురికి సోమన్న ప్రఘోషించిన జానుతెనుగులోనా; పోతన్న సాత్వికత అహంతలకూ వింతవింత పుంతలకూ అతీతమైనది.

"కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ;
గొందఱికిని సంస్కృతంబు గుణమగు; రెండున్
గొందఱికి గుణములగు; నే
నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్"

కొందరికి తెనుగు గుణమట. ఇందులో పరోక్షంగా పాలకురికి ప్రత్యక్షంగా తిక్కన్న కనిపిస్తున్నారు. కొందరికి సంస్కృతం గుణమట. ఇందులో సుదూరంగా నన్నయ్య, సమీపంగా శ్రీనాథుడు వినిపిస్తున్నారు. ఆయాకవులే కాదు. వారి అనుయాయులు కూడా స్ఫురిస్తున్నారు. 'ప్రౌఢంగా పలికితే సంస్కృత భాష అంటారు. నుడికారం చిలికితే తెలుగుబాస అంటారు. ఎవ రేమనుకున్నా నాకు తరిగిందేముంది? 'నా కవిత్వం నిజంగా కర్ణాటభాష' అని ఎదుటివాళ్లను ఈసడించి తోసుకుపోయే రాజసం గాని, తామసంగాని పోతన్నకు అలవడలేదు అది శ్రీనాథుని సొత్తు. ఈ పద్యమే పోతన్న సత్త్వమూర్తికి అద్దం పట్టింది. 'ఆయా సందర్భాలనుబట్టి అందరినీ మెప్పిస్తాను' అన్న మాటలో వినయం ఎంత మెత్తగా ఉందో, విశ్వాసం అంత ఒత్తుగా ఉంది. భాగవతం చదివితే తెలుస్తుంది అతని సంస్కృతగుణం; అచ్చతెనుగుతనం.

నన్నయాదులు భారతాన్ని ఆంధ్రీకరించినారు. భాస్కరరంగనాథాదులు రామాయణాన్ని అందించినారు. నాచనసోమన మారన వంటివారు పురాణాలను అనువదించినారు. వీ రెవ్వరూ తన పురాకృత శుభాధిక్యంవల్ల భాగవతాన్ని తెనిగించలేదు. దీనిని తెనిగించి పునర్జన్మ లేకుండా తన జన్మను సఫలం చేసుకుంటా నని ఆకాంక్షించినాడు పోతన్న. వేయి నిగమాలు చదివినా సుగమం కాని ముక్తి భాగవతనిగమం పఠిస్తే అత్యంతసుగమం అని విశ్వసించినాడు. ఆ ముక్తివాంఛే భాగవతరచనకు మూలం మొట్టమొదటి పద్యమే ఆ ఆశయానికి దిద్దిన ముఖతిలకం

"శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళా సంరంభకున్ దానవో

ద్రేక స్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్."

ఇది నాందీశ్లోకం వంటి పద్యం. ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశాలలోని ఒక లక్షణం నిక్షేపించడం దీని లక్ష్యం. "శ్రీవాణీగిరిజా శ్చిరాయ" అని నన్నయ అన్నాడు. 'శ్రీయన గౌరినాఁబరగు' అని తిక్కన్న అన్నాడు. 'శ్రీకైవల్యపదంబు'ను పోతన్న ప్రస్తావించినాడు. ఈ పద్యంలో నమస్క్రియతో పాటు వస్తునిర్దేశం కూడా ఉండడం విశేషం. భాగవత కథానాయకుడు నందనందనుడు. అత డవతారపురుషుడు. లోక రక్షణం ఆ అవతారానికి ప్రేరణం. అతడు గజేంద్రాది భక్తులను పాలించినవాడు. హిరణ్యకశిపు ప్రభృతి దానవుల ఉద్రేకాలను స్తంభింపజేసినవాడు. ఈ రెండు అంశాలు శ్రీమన్నారాయణుని శిష్టరక్షణకూ దుష్టశిక్షణకూ మూలకందాలు. భాగవతకథా చక్రం ఈ రెండు అంశాలచుట్టే చంక్రమించింది. ఈ రకంగా పోతన్న పై పద్యంలోని పాదచతుష్కంలో భాగవతంలోని పన్నెండు స్కంధాల పరమార్థాన్ని నిర్దేశించినాడు. మరొక విశేషం. ఈ పద్యంలోని నందాంగనాడింభకుడు కేవల స్థితికారుడే కాడు. సృష్టికారుడు కూడా 'కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నానాకంజాత భవాండకుంభకు' అనే ప్రయోగంలో అది ధ్వనించింది 'దానవోద్రేక స్తంభకు' అనే మాటలో అతని లయకారత్వం స్ఫురించింది. అంటే ఈ పద్యంలో నందింప బడిన పరమాత్ముడు త్రిగుణాత్ముడు. అయితే విశ్లేషించుకుంటే బోధపడే అర్థమిది. ఒక మహోర్మికలా ఉప్పొంగి వచ్చే మూర్తి మాత్రం సత్త్వానిది. కాష్ఠంకంటే ధూమం, ధూమంకంటే త్రయీమయమైన వహ్ని విశేషమైనది. అలాగే తమోగుణం కంటే రజోగుణం, రజో గుణంకంటే బ్రహ్మప్రకాశకమైన సత్త్వం విశిష్టమైనది.[1] అందుకే తొల్లిటి మునులు సత్త్వమయుడని భగవంతుడైన హరినే కొలిచినారు ఆ భగవంతుని సత్త్వనిర్భర స్వరూపమే పైపద్యంలో ఉల్లేఖింపబడింది.

అవతారికలోని రచనాలక్ష్యాన్ని పరికించినా, నాందీపద్యాన్ని పరిశీలించినా పోతన్న ధ్యేయం కైవల్యమేనని బోధపడుతుంది. భవబంధరాహిత్యం, జన్మసాఫల్యం, కైవల్యం వల్లనే సాధ్యం. ఆ కైవల్యం పోతన్న వాంఛించిన పరమపదం; పురాజన్మ తపఃఫలం. ఈ కైవల్యకాంక్ష ప్రవృత్తిలా భాసించే నివృత్తి; భాగవతంలోని ప్రధాన రసమైన భక్తికి ఆదిలోనే ఎత్తిన వైజయంతిక.

ఇంచుమించుగా సమకాలీనులైన శ్రీనాథ పోతనామాత్యుల వ్యక్తిత్వాల వాసి ఇక్కడే ఉంది. శ్రీనాథుడు శృంగారిగా ఎంత వ్యాపృతుడైనా ఈశ్వ రార్చన కళాశీలుండ'ననే చెప్పుకున్నాడు. భోగినీదండకం వంటి పరమశృంగార కృతి రచించినా పోతన్న మహాభక్తుడుగానే పేరొందినాడు. కాశీఖండం, భీమఖండం, హర విలాసం, శివరాత్రిమాహాత్మ్యం వంటి భక్తిప్రబంధాలు వ్రాసినా, నైషధంలోని రక్తి వల్లనూ, చాటుపద్యాలలోని శృంగారప్రసక్తి వల్లనూ, శ్రీనాథుడు శృంగారసనాథుడుగా

1. ప్రథమ స్కంధం...59

స్థిరపడినాడు. రుక్మిణీకల్యాణం, రాసక్రీడాభివర్ణనం వంటి ఘట్టాలలో ఎంతటి శృంగారదంతురితాలైన వర్ణనలు చేసినా, పోతన్న తెలుగుల పుణ్యపేటిగానే కీర్తింపబడుతున్నాడు. ఇందుకు ఒక కారణం—కాలం గడిచినకొద్దీ వీరిచుట్టూ అల్లుకున్న కట్టుకథలు. మరొకకారణం—కావ్యావతారికల్లో వీరి వ్యక్తిత్వాలు వేసుకున్న ముద్రలు. శ్రీనాథుని కృతులన్నీ నరాంకితాలు అతని జీవితంలోని ఉజ్జ్వల ఘట్టాలన్నీ రాచకొలువులకే సమర్పితాలు. పట్టెడు పరిమెతుకులు, గుక్కెడు మంచినీళ్లు పుట్టని దుర్దశలో కూడా ఆ రాజసమూర్తి అటు కృష్ణుణ్ణో ఇటు శివుణ్ణో దుయ్యబట్టినాడు.[2] ఇరవైసంవత్సరాలు కొండవీటిలో విద్యాధికారిగా ఒకవెలుగు వెలిగి అంతటితో యశోభిలాష సన్నగిల్లక, ఎక్కడో కర్ణాటరాయల కొలువులో, నిక్కిపడే గౌడడిండిమభట్టును ఉద్భట వివాదప్రౌఢితో ఓడించి, అతని కంచుఢక్కను పగులగొట్టించి, రాయల సభాగారంలో స్వర్ణస్నానం చేయించుకునే దాకా తృప్తిపడని మత్యహంకృతి అతనిది. దిక్కుమొక్కు లేని అవసానదశలో దివిజకవివరుని గుండియలు దిగ్గురనేటట్టు కడ ఊపిరిలో గూడా కవిత అల్లగల్గిన ప్రౌఢవ్యక్తిత్వం అతనిది. మరి పోతన్న వ్యక్తిత్వం ఇందుకు భిన్నం. అతడు నరాధిపులను కొలువలేదు; సిరులకై ఉరుకులాడలేదు; అధికారాన్ని ఆశించలేదు; అహంకారాన్ని ప్రకటించలేదు. పూర్వకవులతోపాటు, వర్తమాన కవులతో పాటు భావికవులను గూడా బహూకరించిన వినయభూషణు డతడు. సమకాలీన కవులను సంభావించడమే ఒక విశేషం పుట్టని కవులకు జేకొట్టడం పోతన్న సహనశీలానికి నిదర్శనం. సహనగుణం సత్త్వం పాదులో పుట్టేదే కదా! ఈ సత్త్వగుణాన్ని ఆధారంగా చేసుకునే పోతన్న నిరాడంబర వ్యక్తిత్వాన్ని గూర్చి, నరాధిప పరాఙ్ముఖత్వాన్ని గూర్చి కొన్ని చాటుకథలు ఆ నోటికానోటి కెక్కి నేటికీ తెలుగునాట వాడుకలో ఉన్నాయి. భాగవతాన్ని తన కంకిత మివ్వవలసిందని సర్వజ్ఞ సింగ భూపాలుడు కోరడం, పోతన్న కాదనడం, భూపాలునికి కోపం వచ్చి దానిని నేలపాలు చేయడం—ఇదొకకథ. శ్రీనాథుడూ పోతన్నా స్వయానా బావమరదులు. పోతన పొలం దున్నుతుంటే ఆ'నాథన్న' పల్లకిలో రావడం, అటు బోయీలు లేకుండా పల్లకి తేలిపోవడం, ఇటు ఎడ్లు లేకుండా నాగలి సాగిపోవడం—ఇది మరొకకథ. ఇవే కాక 'కర్ణాటకిరాటకీచకు'లెవరో అతని కృతిని కాజేయాలని వస్తే ఆ తల్లి సరస్వతి

2 (i) ఫుల్ల సరోజ నేత్రయల పూతన చన్ను విషంబు ద్రావితం
చల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెదవేల తింత్రిణీ
పల్లవయుక్తమౌ నుడుకు బచ్చలిశాకము జొన్నకూటితో
మెల్లన నొక్కముద్ద దిగమ్రింగుము నీవన గాసనయ్యెడిన్.

2 (ii) సిరిగలవానికిఁ జెల్లును
తరుణుల పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
తిరిపెమున కిద్ద ఱాండ్రా
పరమేశా! గంగ విడుము; పార్వతి చాలున్.

'కాటుకకంటి నీరు చనుకట్టు' మీద పడేటట్టు బావురు మనడం, "అమ్మా! ఏడువకమ్మా! నిన్ను ఎవరికీ అమ్మనమ్మా!" అని ఈ పరమభక్తుడు ఓదార్చడం—ఇదో పిట్టకథ. కృతిని ఇక్కడ 'ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి', అక్కడ 'కాలుచే సమ్మెటవ్రేటులం బడక' బమ్మెరపోతరాజు భాగవతాన్ని 'సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె'నని అవతారిక లోని మరో పద్యం ఇచ్చే సాక్ష్యం.[3] పోతన్న పేరు చెప్పితేనే సగటు సాహితీ బంధువు లకు ఈ పద్యమే గుర్తుకొస్తుంది. ఈ పద్యం పోతన్నది కాదంటే చాలా మందికి గుండెల్లో కలుక్కుమంటుంది. నిజానికి ఈ పద్యరచనలో ఏ కోశానా పోతన్న శైలీ వాసన లేదు. 'సొమ్ములు కొన్ని పుచ్చుకొని,' 'సొక్కి', 'శరీరము వాసి', 'కాలుచే సమ్మెటవ్రేటులు',[4] 'సమ్మతి,' 'ఇచ్చిచెప్పె' ఈ 'బమ్మెరపోతరా జొకఁడు'—ఇదీ ధోరణి. ఇవి పోతన్న పలుకులేనా? భావికవులను బహూకరించిన, భవబంధవిమోచనం ఆశించిన భక్తశిరోమణి మాటలేనా? కాదన వలసిన అవసరం లేకుండానే మరొక అంతస్సాక్ష్యం ఉంది. ఈ పద్యానికి ముందుమాట 'ఉభయకావ్యకరణ దక్షుండనై' అన్నది. ఇది ఉత్తమపురుషంలో ఉంది. వెంటనే 'ఇమ్మను జేశ్వరాధముల' పద్యంలో 'బమ్మెరపోతరా జొకఁడు' అంటూ ప్రథమ పురుషం దూకుడుంది. ఆ పద్యం తరువాత, మరొక పద్యం. తరువాత 'అని మదీయ' అంటూ మళ్లీ ఉత్తమపురుషం దర్శనం ఇచ్చింది. పద్యశిల్పాన్నిబట్టే కాక అన్వయదోషాన్ని బట్టి చూసినా ఇది పోతన్న పద్యం కాదనే అనిపిస్తుంది. అతని భక్తులో, అనురక్తులో తదనంతరకాలంలో ఈ పద్యాన్ని జొప్పించి ఉంటారు. ఎవరో ఎందుకు? అతని శిష్యుడు సింగయ్యే వ్రాసి ఉంటాడేమో! సింగయ్య భాగవతంలోని షష్ఠ స్కంధాన్ని రచించినాడు. పోతన్న పోతలోనే ఇతనూ ఒక అవతారిక సంతరించుకున్నాడు. పూర్వకవిస్తుతిలో శ్రీనాథునితోపాటు బమ్మెర పోతరాజును స్మరించినాడు. పోతరాజును స్తుతిస్తూ చెప్పిన పద్య మిది:

"ఎమ్మెలు సెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెర పోతరాజు కవి పట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్".

ఈ పద్యంలో ఒకటి రెండు అంశాలు గమనింపదగినవి ఉన్నాయి 'ఇమ్మనుజేశ్వరాధ ముల' పద్యంలో 'సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె' 'ఈ బమ్మెర పోతరా జొకఁడు భాగ వతంబు' అని ఉంది. "ఎమ్మెలు సెప్పనేల" పద్యంలో 'పన్నగరాజశాయికిన్',

---

3. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెటవాటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

4. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రతినిబట్టి 'సమ్మెటవాటులే' అనుకోండి.

'సొమ్ము'గ......భాగవత నైష్ఠికుఁడై ......తగువాని......బమ్మెర పోతరాజు." అని ఉంది. ఆ పద్యంలో ప్రాసస్థానంలో 'సొమ్ములు' 'బమ్మెర' ఉన్నాయి. ఈ పద్యంలోనూ ఆ మాటలే ఉన్నాయి. అక్కడ 'జగద్ధితంబుగన్' అని ఉంటే ఇక్కడ "జగమెన్నఁగ" అని ఉంది. 'సమ్మతి శ్రీహరి కిచ్చి' చెప్పడం అని అందులో ఉంటే ఆ స్వామికి 'సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు' చేయడం ఇందులో ఉంది. ఈ రెండు పద్యాల్లోనూ పోతన్న భక్తితత్పరతే ఉగ్గడింపబడింది. పైగా రెండుపద్యాల గతికూడా ఒకే స్థితిలో ఉంది. కనుకనే ఈ సింగయ్యే ఆ పద్యం రచించి పోతన్న అవతారికలో చేర్చి ఉంటాడేమో! అనే అనుమానం కలుగుతుంది. అలా కాదు. పోతన్న పద్యానికే సింగన్న పద్యం అనుకరణమేమో అని ఎవరైనా వాదించవచ్చు. అందుకు నా సమాధానం మొదట చెప్పిందే. పద్యశిల్పంలో గానీ, పదప్రయోగంలో గానీ, భావ శుద్ధిలో గానీ ఈ పద్యంలో పోతన్నముద్ర ఏ మాత్రం లేకపోవడమే. ఇంకా "హాలికు లైననేమి, గహనాంతర సీమల కందమూల కౌద్దాలికులైననేమి" లాంటి పంక్తులు పోత న్నవే అంటే అర్థముంది. 'హాలికులు' 'కౌద్దాలికులు' అంటూ ప్రాసస్థానంలో గుప్పించిన అనుప్రాస సౌరభం ఇందుకు సాక్ష్యం.

అవతారిక దృష్ట్యానే కాక భాగవత కథల్లో ఉపాఖ్యానాల్లో పోతన్న మూలాతి రిక్తంగా పెంచిన పట్టులను బట్టీ, పేర్చిన పద్యాలను బట్టీ, అతని సత్త్వరమణీయ మూర్తి సాక్షాత్కరిస్తుంది. గజేంద్రుని సంశయంలో, ప్రహ్లాదుని నిశ్చయంలో, గోపి కల ఉద్వేగంలో, వామనుని ఉత్తేజంలో — ఇవేకాక నవవిధ భక్తిలతల బహుముఖ వికాసంలో, భక్తిరసతరంగితమైన పోతన్న చిత్తవృత్తి పలువిధాలా ప్రస్ఫుట మవు తుంది. వ్యాసభగవానుని భాగవత కోశాన్ని సైతం క్షణకాలం మరచిపోయి, ఆయా భాగవతుల శ్రవణకీర్తనలకు లోనై ఆ పాత్రలన్నీ తానై పరవశించి, పద్యసంఖ్యను పెంచి, ప్రతిభా శిఖరాలపై భాసించిన సన్నివేశాలు ఆంధ్ర భాగవతంలో కోకొల్లలు. అందుకే అంటున్నాను—అవతారికలోనే కాక ఆంధ్ర భాగవతంలో గూడా అడుగడుగున పోతన్న సాత్త్విక చిత్తవృత్తి, భక్తిభావనా ప్రవృత్తి వేయిరేకులతో విప్పారినవని.

నవవిధ భక్తులను కథాత్మకంగా ప్రపంచించిన ప్రథమ గ్రంథం వ్యాసభాగ వతం. ఆ భక్తిరస ఘట్టాలను ఇంతకు రెండింతలుగా విస్తరించి తొలిసారిగా మధుర భక్తికి పచ్చల తురాయిని కూర్చిన తెలుగు కావ్యం పోతన్న భాగవతం. ప్రహ్లాదుని నోట వ్యాసుఁడు పలికించిన భక్తిశాఖ లివి—

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్"

దీనికి పోతన్న చేసిన తెలుగుసేత ఇది—

"తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం

బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్, హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు దైత్యోత్తమా!"

ప్రహ్లాదుఁడు, గజేంద్రుడు, అంబరీషుడు, కుచేలుడు, ధ్రువుడు, అక్రూరుడు, రుక్మిణి, గోపికలు— అయా భక్తి శాఖలకు విరబూసిన ప్రసూనాలు. ప్రహ్లాదుడూ, రుక్మిణీ. గోపికల వంటి పాత్రలలో పోతన్న పరమభాగవతసత్త్వం, అచీణ భక్తితత్త్వం శబలసుందరంగా భాసిస్తాయి ఇది చెప్పాలని ప్రహ్లాదుని ముఖతః ఎన్నెన్ని భంగులలో ఎన్నెన్ని ఫణుతులలో చెప్పించినాడు పోతన్న!

"మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు"

అంటాడు. మరోసారి—

'కంజాక్షునకు గాని కాయంబు కాయమే' అంటాడు. ఇంకోసారి— 'కమలాక్షు నర్చించు కరములు కరములు' అంటూ లాటానుప్రాసల్లో ఉద్ఘాటిస్తాడు. ఆ 'అంబుజోదర దివ్యపాదారవిందాలు', ఆ 'చింతనామృతం', ఆ 'మత్తచిత్తం' ఎన్ని సార్లంటాడు! ఎన్ని తీర్లంటాడు! విసుగులే దాభక్తవరుని నోటికి. అది పునరుక్తిదోష మని అనిపించనే అనిపించదు పరవశించిన ఆ లేఖినికి. ఇంతకూ పోతన్న రచించిన భక్తి పద్యాల్లో కోటికెక్కిన 'మందార మకరంద' పద్యం అటు వ్యాసునిదీ కాదు, ఇటు పోతన్నదీ కాదు— పాలకురికి సోమన్నది. సోమన్న పోతన్నకు పూర్వీకుడు. బమ్మెరకు సమీపంలో ఉన్న పాలకురికి వాస్తవ్యుడు. అతని చతుర్వేదసారంలోనూ, బసవ పురాణంలోనూ ఈ పద్యం పోలికలే ఉన్నాయి,

'రాకామలజ్యోత్స్న ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటి ద్రావ' 6

అని సోమన్న అంటే

'పూర్ణేంద్రు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు'

అని పోతన్న అంటాడు.

'విరిదమ్మి వాసన విహరించు తేటి
పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల' 7

అని సోమన్న అంటే

'మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు'

6 బసవపురాణం 7 బసవపురాణం.

అని పోతన్న అంటాడు. అయితే సోమన్నకు రాని కీర్తి ఈ పద్యంవల్ల పోతన్న కెందుకు వచ్చింది? అక్కడే ఉంది పోతన్న పోత. 'మందార' 'మకరంద' 'మాధుర్య' 'మధుప' 'మదనములు'—ఎన్ని మకారాల ప్రాకారాలు కట్టినాడు! పద్యాన్ని ఎంత ప్రాసాద రమ్యంగా నిలబెట్టినాడు! అక్షర రమ్యతలో నన్నయ్యను దాటి, ఆపై అంచులు ముట్టి నాడు. తరువాతివా ళ్ళెవరైనా ఈ శైలిని అనుకరిస్తే జారిపడిపోవడమో, నీరుగారిపోవ డమో జరిగే అంత సొంతపుంత చేపట్టినాడు. మరి 'కమలాక్షు నర్చించు కరములు కరములు' కూడా పోతన్న కొత్తగా చెప్పింది కాదు. భీమఖండంలో—

"శ్రీ భీమనాయక శివనామధేయంబు
చింతింప నేర్చిన జిహ్వ జిహ్వ"

అని శ్రీనాథు డెన్నడో అన్నదే. కాని లోకానికి తెలిసింది 'కమలాక్షు నర్చించు కరములు కరము'లే. ఈ ప్రాచుర్యానికి కారణం కూడా పోతన్న కూర్చిన పదబంధ తోరణమే.

నవవిధ భక్తుల్లో "శ్రవణం. కీర్తనం స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం. ఆత్మనివేదనం"—ఇవన్నీ ఒక పాదులో పుట్టిన మొలకలే. సఖ్యం మాత్రం వీటికంటె భిన్న తత్త్వం కలది. రుక్మిణికి శ్రీకృష్ణునిపట్ల గల రక్తికీ భక్తికీ నేపథ్యం ఆత్మనివేదనం. అర్చన వందన స్మరణాదులు ఆ ఆత్మార్పణంలో నుంచి ఉదయించిన రేఖలు. కుచేలు డున్నాడు, అర్జును డున్నాడు. వీళ్ళది ప్రధానంగా సఖ్యభక్తి. ఆనుషంగికంగా ఆ సఖ్యం చుట్టూ స్మరణవందన పాదసేవనాదులు పరివేషించక పోలేదు. మరి మధుర భక్తికి మూల మేది? జీవాత్మ పరమాత్మల వియోగం. అఖండ పరమాత్మనుండి ఖండశః అంశతః విడివడిన జీవాత్మలు ఆ మూలాత్మను కలుసుకో వాలనే తపనమే భగవద్రతిభావనకు ప్రాతిపదిక. త్రేతాయుగంలో మునులు, ద్వాపర యుగంలో గోపికలు భగవద్విరహంలో సంతప్తులైన జీవాత్మలు. గోపిక లున్నారు. వాళ్ళకు ఇళ్ళూ, వాకిళ్ళూ ఉన్నాయి. కొందరికి పతులూ సుతులూ ఉన్నారు. అయినా శారదయామినిలో యమునాతీరంలో బృందావనిలో గోపాలుని మురళీగానం ఆలకించ గానే అన్నీ మరచి పరుగులు తీస్తారు. బృందావని చేరుకొని నందకిశోరుణ్ణి కానక రసోన్మాదంలో ఎలుగెత్తి పిలుస్తారు. ఆ మోహనమూర్తిని పదేపదే స్మరించుకొని ఇలా ఆక్రందిస్తారు—

"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబు దోచె నో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ! చెప్పరే."

మధ్యమధ్య ఆ మాధవుడు, ఆ గోపికా మనోభవుడు తళుక్కున మెరుస్తాడు. అంత లోనే అంతర్హితుడౌతాడు. అప్పుడు గోపికల వియోగవిధురహృదయాలు ఇలా సంభ్ర మిస్తాయి—

"అదె నందనందనుం డంతర్హితుండయ్యెఁ
బాటలీతరులార ! పట్టరమ్మ !
హేలావతులఁ గృష్ణ ! యేల పాసితి వని
యేలేయలతలార ! యడుగరమ్మ !
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా
చూతమంజరులార ! చూడరమ్మ !
మానినీమదనుతో మారాక యెఱిఁగించి
మాధవీలతలార ! మనుపరమ్మ !

జాతిసతులఁ బాయ నీతియె హరి కని
జాతులార ! దిశలఁ జాటరమ్మ !
కదళులార ! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ !"

సమస్త చరాచరజీవకోటికి అధినాథుడు మాధవుడు. ఆ మాధవుడే తమధవుడని భ్రమించినారు గోపికలు. ఆ భ్రమావరణమే వారి మనస్సులమీద మోహయవనికలను కప్పింది. ఆ ముగ్ధప్రవృత్తే మధురభక్తికి మూలం. ఈ మధురభక్తిని రాసక్రీడాది వర్ణనంలో హృదయంగమంగా చిత్రించినాడు పోతన్న.

లోకంలో భక్తకవులు పలువు రున్నారు. వారందరు ప్రజాకవులు కాలేరు. ఒక తుకారాం, ఒక సూరదాసు, ఒక కబీరు, ఒక పోతన్న ప్రజాకవులుగా ప్రాచుర్యం పొందిన భక్తకవులు. మరి ప్రజాకవి ఎవడు ? సామాన్యప్రజల జీవితసమస్యలను చిత్రించేవాడు. ఇది బాగా వాడుకలో ఉన్న అభిప్రాయం. ఈ దృష్టితో చూస్తే పోతన్న ప్రజాకవి కాలేడు. అతడు ప్రజలదైనందిన జీవితసమస్యలకు బొమ్మకట్టి చూపలేదు. భాగవతుల భక్తిభావ పరంపరలకు శ్రుతులు కూర్చి కృతులు అల్లుకున్నాడు. ఆ భాగవతుల్లో ప్రహ్లాదునివంటి ఆజన్మజ్ఞానులు ఉన్నారు. గజేంద్రునివంటి ఆర్తజ్ఞాను లున్నారు. కుచేలునివంటి ఆర్థికదుర్దశాపరిపీడితు లున్నారు. ఈ భక్తుల స్థితిగతులు వేరైనా, వారి వారి సంస్కారమతులు వేరైనా, అందరినీ కలిపికుట్టే మూలసూత్రం ఒకటుంది. అదే ఆర్తి. అది జీవాత్మలు పరమాత్మకు నివేదించుకునే అలౌకికమైన ఆర్తి. భక్తపరమైన ఈ ఆర్తిని సార్వకాలీన సామాన్యప్రజల ఆర్తిగా చిత్రించడంవల్లనే భక్తకవియైన పోతన్న ప్రజాకవియైనాడు. "కలడు కలం డనెడువాడు కలడో లేడో" అంటూ ఆందోళించినవాడు కరిరాజే కానక్కరలేదు, ఏమూగజీవికైనా ఇది చెల్లుతుంది. "ఇందుఁ గలడందులేడని సందేహము వలదు"—ఇది ఏ ప్రహ్లాద భాషితమో కానక్కరలేదు. ఏ దృఢసంకల్పునికైనా ఇది సరిపోతుంది. 'ఊరక రారు మహాత్ములు' దీన్ని ఏ గర్గమునికో ముడిపెట్ట నక్కరలేదు. ఇప్పటికీ ఏ మహానుభావుని రాకకైనా ఇది వర్తిస్తుంది. 'ఎందరో మహానుభావులు' అన్నంత వ్యాప్తి పొందిన సూక్తి ఇది. అయితే

ఈ సూక్తి సహజగాంభీర్యాన్ని కాస్తా వదలుకొని. కాలంగడిచినకొద్దీ ఛలోక్తిగా మారడం కూడా జరిగింది. అంటే సామెతలకోవలో చేరిందన్నమాట. ఒక కవి రచించిన పద్యపాదాలు సామెతలుగా, లోకోక్తులుగా చెలామణి కావడంకంటె ఆ కవికి అంతకు మించిన ప్రాచుర్యం ఏముంది ? ఇలా లెక్కించుకుంటూ పోతే, పోతన్న వందలాది పద్యాల్లోంచి వేలకొద్ది పాదాలను ఉదాహరించవలసివస్తుంది. ప్రాచీనాంధ్రకవులలో బహుళంగా ఉదాహరింపబడుతున్నవాళ్లల్లో ఇద్దరే ఇద్దరిని చెప్పుకోవాలి. ఒకడు పోతన్న. మరొకడు వేమన్న. వేమన్న అక్షరాలా ప్రజాకవి. అధిక్షేపం అతని ఆయుధం. సంఘసంస్కరణం అతని లక్ష్యం. అతని ప్రతిపద్యం ప్రజలజీవితాలకు సంబంధించిందే. అతని ప్రతి విసురు పచ్చని ప్రజాజీవనాన్ని తొలిచే చీడపురుగులకు సంబంధించిందే. ప్రజలభాషలో ప్రజల సమస్యలను చిత్రికపట్టి వేమన్న ప్రజాకవి యైనాడు. భాగవతుల భక్తిభావనలను సామాన ప్రజల ఆర్తికి పర్యాయంగా సమన్వయించి పోతన్న ప్రజాకవి యైనాడు. బమ్మెరకు వెళ్లి అక్కడి పొలాల నడిగితే చెబుతాయి - ఇదిగో ! ఇది పోతన్నగుడి ! అదిగో ! అది మల్లన్నమడి" అని పోతన్న గుడి నిజంగా గుడి కాదు. పాతుకొని ఉన్న ఒక రాతిపలక. ఆ రాతిపలకను పోతన్నకు ప్రతిరూపంగా నేటికీ అక్కడి పల్లీయులు భావించుకుంటున్నారంటే ఇప్పటికీ పోతన్న ఎంత సజీవంగా ఉన్నాడో ఊహించుకోవచ్చు. మరి మల్లన్నగుడి మాటేమిటి ? ఈ పోతన్న కొడుకైన రైతన్న దున్నిన పొల మది.

కవితా కేదారాన్ని పండించిన హాలికుడుగా అన్నివేళలా తలచుకోవడానికి అనువైన పద్యఖండాలను అందించిన ఆదర్శమానవుడుగా పోతన్న చిరంజీవి. భావికవులను బహూకరించిన ఆ పరమ భాగవతునికి తప్ప అంతంతమాత్రంవానికి ఉంటుందా ఇంతటి సముజ్జ్వలభావి. ఎప్పుడో పొట్టి వడుగైన వామనమూర్తి ఇంతై అంతై అంతంతై మూడు లోకాలను ఆక్రమించినట్లు-ఎక్కడో బమ్మెరవంటి చిట్టూరిలో పుట్టిన పోతన్న మూడు కాలాలను ఆకట్టుకునే అమృత కృతులను నిర్మించగలిగినాడు అవతారికలో అతడు నివేదించుకొన్న ఈ పద్యం చూడండి.

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు తా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్"

భాగవతాన్ని తెనిగించి పోతన్న తనజన్మను సఫలం చేసుకొన్నాడు. ఆ భాగవత పద్యాలను పఠించి తెలుగు ప్రజలు తమ జీవితాలనే పండించుకున్నారు.



# అపూర్వకల్పితకథాసంవిధానధురీణ

# పింగళి సూరన

డాక్టర్. జి.వి. సుబ్రహ్మణ్యంగారు

ప్రాచీనాంధ్రప్రబంధ రచనా పరిణామములో ఒక మహోన్నతాధ్యాయమును సృష్టించుటయే కాక ఆధునికాంధ్ర విమర్శ వికాసమునకు ఒక వినూతనోత్తేజమును కల్పించుటకు కారకుడైన మహాకవి పింగళి సూరన.

మహాకవి శబ్దవాచ్యులు ఏయుగములోనైనను ఎందరో ఉందరు. గతానుగతికముగా సాగివచ్చుచున్న కాలగతికి ఎదురు తిరిగి కలముపట్టినవాడు మహాకవి. లేక-గతములోని గొప్పనంతటిని పుక్కిటపట్టిన ప్రతిభతో ప్రత్యక్షర రచనాశిల్పమును అపూర్వకల్పనా సామర్థ్యముతో అప్రతిమానముగా ఆవిష్కరించినవాడు మహాకవి. లేదా- భావికవులకు మార్గదర్శకమైన విశిష్ట సాహితీప్రక్రియాప్రయోగమును ప్రారంభింప గలిగినవాడు మహాకవి. ఈమూడు లక్షణములలో ఏ ఒక్కటియున్నను ఆతడు మహాకవి శబ్దవాచ్యుడగును. ఈమూడు లక్షణములను సామర్థ్యతో సాధించిన మనీషి పింగళి సూరన. అందువలన ఆతడు మహాకవులలో మహాకవి.

పింగళి సూరన పదునాఱవశతాబ్ది ప్రథమపాదములో పుట్టి చరమపాదము గడచిపోవునంతవఱకు జీవించిన వాడు. పదునాఱవశతాబ్దము ఆంధ్రసాహిత్యచరిత్రలో స్వర్ణయుగము. శ్రీకృష్ణదేవరాయల ప్రోత్సాహమున ప్రబంధప్రక్రియ మూడుపూవు లాఱుకాయలుగా విస్తరిల్లిన విశిష్టకాల మది. రాయప్రోలువా రనినట్లు-'విద్యానగర రాజవీథుల కవితకు పెళ్లిపందిళ్లు కప్పించు' నాళ్లవి. ప్రబంధకవితాకన్యను పెండ్లికూతుగా నూహించినారు వారు. నన్నయగారిచేత ఉగ్గు పెట్టించుకొని, తిక్కన్నగారి యొద్ద తెలుగుపలుకుల తియ్యదనము నలవఱచుకొని. ప్రబంధపరమేశ్వరునియొద్ద వినయసంపదను గడించి, శ్రీనాథునియొద్ద ప్రౌఢవచోవిలాసమును, పోతన్నగారియొద్ద భక్తిప్రపత్తులను నేర్చుకొని, సాహితీసమరాంగణ సార్వభౌముని సౌజన్యముతో వర్ధిల్లిన ఆంధ్రభారతి పెండ్లియాడుటకు వచ్చిన నవోఢ యని భావించుటలో నెంతయు సామంజస్యము కలదు. ప్రబంధకవు లాపెండ్లిపడుచుకు పెంజడను సవరించి అలంకరించినారు. అల్లసానిపెద్దన 'అల్లికజగిబిగి'నేర్పుతో జడ నల్లినాడు. నంది తిమ్మయ ముద్దుముద్దుగా పారిజాతకుసుమమును సిగపై నిలిపినాడు. పింగళి సూరన ముప్పేట జడకుచ్చులను

ముచ్చటగా ముడిచినాడు. రామరాజభూషణుడు వసురత్ననిర్మితమైన చూడామణి నలంకారముగా నమర్చినాడు. ధూర్జటి రామకృష్ణాదులు తత్‌శృంగార మాహాత్మ్యములను కీర్తించినారు. భారతీవేణి సౌభాగ్యమునకు ప్రబంధ శృంగారము లన్నియు నొకయెత్తు; పింగళి సూరన ముడిచిన ముప్పేట జడకుచ్చుల చక్కదన మొక్కటి మఱియొక యెత్తు!

కావ్యరచనలో ప్రౌఢప్రయోగములు చేయుట ప్రబంధకవుల ప్రత్యేకత. ఇతిహాసపురాణ కావ్యానువాదము ప్రాతపడిన పద్ధతి వారికి. ప్రసిద్ధమైన ఏ యుపాఖ్యానమునో గ్రహించి స్వీయకల్పనలతో పెంపుచేసి అష్టాదశవర్ణనాబహుళముగా, శృంగారరసబంధురముగా ఆలంకారికశైలిలో ప్రబంధరచనము సంతరించుట వారిచ్చగించిన ఫణితి. ఎన్నుకొనెడికథలో ఒకక్రొత్తదనము, నిర్వహించెడి విధములో ఒక నిండుదనము, చెప్పెడి చొరవలో ఒకచేవదనము చూపింప వారిప్రయత్నము. బహుశాస్త్రపాండిత్యము, ప్రతిపద్యశిల్ప చమత్కారము, ఊహలు పోహళించెడి ఉక్తివైచిత్ర్యము వారి రచన కబ్బిన విశిష్టలక్షణములు. ప్రతికావ్యమునందు కొన్ని రమణీయ ఘట్టము లుండుట, వానిని నాటకీయ శిల్పముతో అనల్పముగా చిత్రించుట, ప్రతియోగఘటనచే పాత్రల ప్రవృత్తుల తారతమ్యము ప్రస్ఫుట మగుటనట్లు తీర్చిదిద్దుట వారికావ్యకథా నిర్వహణ మర్మములు.

పంటకు వచ్చిన ఇట్టి ప్రబంధకల్పతరువు ఏ గారడి వాని గరిసెలోనో పుట్టి గడియలో పెరిగినది కాదు భారతములోనే దానికి బీజము పడినది. నన్నెచోడుడు నీరుపోసినాడు. ప్రబంధపరమేశ్వరుని కవితలో అది అంకురించినది. సోమన్న సూక్తిలో మారాకు తొడిగినది. శ్రీనాథుని కవితలో చిగురాకువైచినది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని దోహదమున పూవులు పూచినది. పెద్దన పెంపకములో ఫలోన్ముఖమైనది. పింగళిసూరన కృషిచే ఫలవంత మైనది. రామరాజభూషణుని నాటికి పండబారినది. ఈక్రమ వికాసములో పింగళిసూరన కృషికి ఒకప్రత్యేకస్థాన మున్నది.

పింగళి సూరన గొప్ప ప్రతిభావంతుడు. అతని వయసుతోపాటు ప్రతిభయు నవనవోన్మేషముగా విస్ఫారినది. లోకమున ప్రతిభాశాలుర కుండదగిన–ఉండవలసిన గూఢాహంకారము అతనికి పుష్కలముగా నున్నది. అభిమానము వేఱు, అహంకారము వేఱు. అభిమానియైనవాడు సాటివానితో అన్నింట సమముగా నుండుటకు యత్నించును; అహంకారి సాటివానికంటె నన్నింట మించుటకు ప్రయత్నించును. పింగళి సూరన కలము పట్టునాటికి సాహిత్య రంగమున ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన అగ్రపీఠము నలంకరించి యున్నాడు. మించినచో అతనిని మించవలెను. మించుటకు ఒకటి రెండు త్రోవలు కలవు ఒకటి: అత డొక విధమైన ప్రబంధమార్గమున కాచార్య పీఠము. ఆ మార్గమును వీడి మఱియొక ప్రక్రియను చేపట్టి దాన తా నగ్రతాంబూల మందుకొనవలెను. ఇట్లు భావించి అతడు ద్వ్యర్థికావ్యరచనా ప్రక్రియను చేపట్టి రాఘవ పాండవీయమును రచించెను. ఆ యుగమునందలి రచనలలో అది అపూర్వము, తరు

వాతి ద్వ్యర్థి, త్ర్యర్థి, చతురర్థి కావ్యరచనల కది ఆచార్యకము నైనది. ఇక రెండవది: పెద్దన రచించిన ప్రబంధమువంటి ప్రబంధమునే చేపట్టి అతనికంటె వైశిష్ట్యమును సాధించుట. అతడు స్వారోచిష మనుసంభవము రచించెను. ఇతడు కళాపూర్ణోదయము రచించెను. అతడు మను చరిత్రమున మూడు తరముల కథ చెప్పెను. ఇతడు తన కావ్యమున మూడు జన్మల కథ ముడిపెట్టెను. అతడు పురాణ ప్రసిద్ధమైన కథను గ్రహించి స్వీయకల్పనలతో పెంచి చిత్రించెను. ఇతడు అపూర్వ కల్పిత కథావిస్తార మైన ప్రబంధమును నిర్మించెను. అతడు సమగ్రజ్ఞానోదయ మను తత్త్వమును కథా చిత్రణమున ప్రతీకాత్మకముగా ప్రపంచించి నామవక్రతచే దానిని ధ్వనింపజేసెను. ఇతడు సమగ్ర కావ్యకళావిష్కారమను కళాతత్త్వమును కథాసంవిధానమున ధ్వనింప జేయుటయేకాక నామవక్రతచే నిపుణముగా సూచించెను. అతడు కథను కాలక్రమము ననుసరించి చెప్పగా నితడు కార్యకారణక్రమము ననుసరించి చెప్పి ఉత్కంఠతో పాటు ఉత్తమ కథాశిల్పమును పాటించెను. అతడు కథలో నాటకీయత నచ్చటచ్చట ప్రదర్శింప నితడు కావ్యమంతట గుప్పించి విడిచెను. కవిలోకమున పెద్దనకంటె పెద్ద అనిపించు కొనుటకే సూరన చేసిన యింత పెద్ద ప్రయత్నము !

పెద్దన తరువాత ఇతని దృష్టి నంది తిమ్మయపై ప్రసరించినది. అతడు హరి వంశ కథాలహరినుండి పారిజాతాపహరణ వృత్తాంతమును గ్రహించి మధురమైన యొక ప్రబంధమును రచించెను. ఇతడును హరివంశమునందలి ప్రభావతీ పరిణయ వృత్తాంత మును గ్రహించి నాటకీయరచనాశిల్ప మచ్చుపడునట్లు ప్రభావతీ ప్రద్యుమ్నమును రచించెను. పింగళి సూరన రచించిన ప్రతి కావ్యము వెనుక ఏదియో గూఢమైన విజి గీష యొకటి ప్రేరణగా పనిచేసినది. కావ్యవిషయకమైన ఆ స్పర్థ అతనిని కళాపూర్ణు నిగా రూపొందించినది

ఇంతటి మహాకవి జీవిత విశేషములు మన కంతగా తెలియవు తెలిసెడి నాలుగు విషయములకు ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యావతారిక ప్రధానమైన ఆకరము. పింగళి వారు గౌతమ గోత్రులు. వీరి వంశము కవితకేగాక కథలకుకూడ పుట్టినిల్లు. వీరి వంశ ప్రసిద్ధ పురుషుడు గోకనామాత్యుడు. అతడు శ్రీవిష్ణుఖడ్గ వర్ణనాత్మకమైన 'నందక స్తవ' మను కృతిని రచించి కీర్తి వెన్నెలలు నింపుకొనెనట. 'పింగళివారి పేకి' అను సామెతకు హేతువైన ఒక వింతకథ కాతడు కథానాయకుడు. గోకనామాత్యు డొకనాడొక అడవిలో పోవుచుండ ఒక గాజుపూస దొరికినదట. అతడు దానిని ఇంటికి తెచ్చి భద్ర ముగా దాచినాడు. ఆ మఱునాడే పేకి యను పేరుగల దాసి యొకతె వారింట పనికి కుదిరి నది. ఎంతటి అలవి మాలిన పనినైనను ఆ పనికత్తె అవలీలగా చేసివై చెడిదట. ఒక నాడు పురిటిగదిలోనుండి ఆవలి గదిలో నున్న దీపమును నాలుక చాచి ఎగద్రోసినదట ! దానిని చూచి యింటివారు అది దయ్యమో, భూతమో యని భయపడి దాని నచ్చట వదలి, యిల్లు వీడి గ్రామాంతరమున కేగిరట! పోవుచు పెద్ద రుబ్బుడు రోలు నొక దాని నచ్చటనే వదలిపోయిరట! పదిమందికూడ పట్టి కదల్పలేని ఆ రోలును అనా యాసముగా మోసికొనిపోయి వారి క్రొత్త యింటి ముంగిట పెట్టినది పేకి. ఈ పీడ

విరుగడగుట యెట్లని యోచించి గోకనామాత్యుడే ఆమెను పిలిచి 'నీవేమి చేసిన మమ్ము లను విడిపోయెద'వని అడిగెనట! 'ఆ పూస యిచ్చినచో నేను పోవనా' అని ఆ పేకి తన గుట్టు బయట పెట్టినదట. బ్రతుకు జీవుడా యని ఆ బాప డాపూసతో పాటు పేకిపీడనుకూడ వదలించుకొనెనట. ఈ కథకు కాళ్లున్నవో లేవో తెలియదు కాని పింగళి సూరన తన వంశ కథనములో వదలక సూచించినాడు.

ఉ. "పేర్వెలయంగ నాఘనుడు పింగళి గోకబుధోత్తముండు గం
ధర్వి నొకర్తు 'బేకి' యనుదానిని దాసిగ నేలె యోగితా
గుర్వనుభావుడై; నెఱపె గోపకుమారుని ఖడ్గపర్ణనం
బర్వపు నిండువెన్నెలలపై నెఱి జూపెడు కీర్తిసంపదన్" (1.14)

ఆతనిని మించినది ఆతని సతి. సంతతిలేక సూర్యభగవానుని సేవించి 'దొండతీగె'ను వరముగా పొంది వంశము దొండపాదుగా విస్తరించుటకు మూలకారణమైనది. పింగళి వంశ చరిత్రలో ఇంత ముఖ్యమైన పాత్ర నిర్వహించిన ఆ ముత్తైదువ పేరు సూరనకే తెలియరాలేదు. పేరు కెక్కిన పేరులేని ఆ పేరంటాలు కథను సృష్టించుటలో మగనికి తీసిపోని యిల్లాలు. ఆ దంపతుల సంతతిలో కొన్ని తరముల తరువాత ఒక శాఖయందు వెలసిన అమరనామాత్యునకు అంబమ్మయందు సూరనామాత్యుడు పుత్రుడై జన్మిం చెను. అద్భుత కథాలవాలమైన పింగళివంశ చరిత్ర అపూర్వ కథా సంవిధాన ధురీణు డైన సూరన పుట్టుకతో చరితార్థమైనది.

పింగళి సూరన జీవితమును రెండు భాగములుగా విభజింపవచ్చును. రాఘవ పాండవీయ రచనమునకు ముందున్నది పూర్వభాగము, తరువాతది ఉత్తరభాగము. పూర్వభాగము నందలి అతని కావ్యవ్యవసాయ ఫలము మన కిప్పుడు లభించుట లేదు. శ్రీకృష్ణదేవరాయల భువనవిజయ సభాభవనమునందు వెలసియున్న అష్టదిగ్గజ మహా కవులలో పింగళి సూరన యొక డను ప్రతీతి కలదు. క్రీ. శ. 1530 వ సం॥రమున రాయలు దివంగతుడైనాడు. అప్పటికి సూరన్న విద్యాభ్యాసము ముగించికొని యుండి యుండవచ్చును ప్రౌఢకావ్య రచన మప్పటికి చేపట్టినట్లు లేదు. క్రీ. శ. 1545 ప్రాంతమున రచింపబడిన దని భావింప బడుచున్న రాఘవ పాండవీయము నందలి కావ్యావతారికలో ఆకువీటి పెదవేంకటాద్రి యాకవిని గుఱించి పల్కిన ఈ క్రింది వాక్యములు గమనింప దగినవి :

క. "చాటు ప్రబంధ రచనా
పాటవ కలితుడవు శబ్దపరిచితియందున్
మేటివి దీనిం దెనుగున
బాటించి రచింప నీవ ప్రౌఢుడ వరయన్" 1.12

ఈ పద్యము ననుసరించి పింగళిసూరన రాఘవ పాండవీయ కావ్య రచనకు పూర్వము చాటు ప్రబంధ రచనా ధురీణుడనియు, శబ్దశాస్త్ర పారగుడనియు నూహింప వీలగు

చున్నది. ఆ యవతారికలోనే చెప్పుకొనిన మఱికొన్ని సందర్భములను బట్టి అతడు 'సత్కావ్యరచనా విశారదు' డనియు (1.9), 'నానామహిత ప్రబంధ రచనా ఘన విశ్రుతి' యనియు తెలియవచ్చు చున్నది. కళాపూర్ణోదయ కావ్యావతారికలో గృతికర్త

మ. "ఇటమున్ గారుడసంహితాది కృతు లీ వింపొందఁగాఁ బెక్కొన
ర్చుట విన్నారము; చెప్ప నేల యవి ? సంస్తుత్యోభయ శ్లేష సం
ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె
చ్చట నెవ్వారికి ? నీక చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్" (1,14)

అని ప్రశంసించుటచే రాఘవ పాండవీయమునకు ముందే గరుడ పురాణాది కృతు లీతఁడు రచించిన ట్లూహించుటకు వీలగుచున్నది. ప్రభావతీప్రద్యుమ్న ప్రబంధావ తారికలో—

మ. "జనముల్ మెచ్చఁగ మున్ రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును, శ్రీరాఘవ పాండవీయము; గళాపూర్ణోదయంబున్, మఱిన్
దెనుఁగుం గబ్బము లెన్నియేనియును; మత్పిత్రాది వంశాభి వ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల వత్యంతమున్-" 1.6.

అని చెప్పి ఆ కృతిని తన తండ్రికి అంకితముగా రచించెను. ఈ పద్యమునందలి 'దెనుఁగు కబ్బము' లెన్నియో, వాని పేర్లేవియో మనకు తెలియవచ్చుట లేదు. కాని కస్తూరి రంగకవి తన రంగరాట్ఛందమున సూరన రచించిన గిరిజాకల్యాణమునుండి యొక కంద పద్యము నుదాహరించెను (3.234). దీనినిబట్టి సూరన తన నూనూగు మీసాల నూత్నయౌవనమున గిరిజాకల్యాణ మను శృంగార కావ్యమును రచించి యుండవచ్చునని భావింపవచ్చును. చాటుప్రబంధముల నెన్నింటినో బాల్యమునుండి యే చెప్పుచు నుండియుండవచ్చును. అవి యన్నియు తెలుగుకృతు లగుటచే నీతఁడు సంస్కృతకావ్య రచనము చేపట్టినవాడు కాడని స్పష్టము.

పింగళి సూరన తన వివాహమయిన తరుణమున గిరిజాకల్యాణ కావ్యము రచించి యుండునేమో ! ఆపై నతనికి పితృవియోగమో మాతృవియోగమో సంభవించియుండ వచ్చును. ప్రభావతీ ప్రద్యుమ్నమును పితౄణము తీర్చుకొనుటకై వ్రాయుటచే గరుడపురాణము మాతౄణము తీర్చుకొనుటకై అతడు రచించి యుండవచ్చునని యూహించుట కవకాశము కలుగుచున్నది. పితృదేవతల పుణ్యాపాపగతులను గుఱించియు, అపరకర్మాది విధులను గుఱించియు విశేషముగా వర్ణించెడి గరుడ పురాణాను వాదము ఎంత ప్రసిద్ధమైనను తరువాత నంత ప్రచారమునకు రాలేదు. నే డీతని గిరిజాకల్యాణముగాని, గరుడ పురాణముగాని మనకు లభించుట లేదు.

పింగళి సూరన తల్లి గరుడపురాణరచనకు పూర్వము మరణించి యుండినచో, అతని తండ్రి బహుశః కళాపూర్ణోదయ కావ్యరచనానంతరము దివంగతుడై యుండ

వచ్చును. సూరనకు అమరన, ఎఱ్ఱన అను అనుజన్ము లుండిరి. వారిలో ఎఱ్ఱన కర్మఠుడేకాక 'రాజితబోధార్థనాభిరతుడు' కూడ. అతడు పితృపూజ చేసిన విధము చూడుడు :

మ. "గయలోఁ గాశిఁ బ్రయాగ శ్రీగిరిని గంగాద్వార నీలాచలో
జ్జయినీ ద్వారకలం దయోధ్య మధురన్ సంస్తుత్యపుణ్యస్థలా
గ్రియతన్ వెండియు మించు నైమిశ కురుక్షేత్రాదులం దర్పణ
క్రియచే నా పినతమ్ముఁ డెఱ్ఱన యొనర్చెన్ దండ్రి కాహ్లాదమున్" 18

చిన్న తమ్ముని పితృపూజన విధానము అన్నగారికి ఒక ప్రేరణము కల్పించినది. అక్షర తర్పణవిధిచే తండ్రికి అమరత్వమును కల్పించి నాడు పింగళిసూరన :

క. "ఏనుం బిత్రు పూజన నా
చే నైన ట్లెద్ది యైనఁ జేయఁగవలయున్
గానఁ, గృతి యిచ్చి మేదిని
పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశుకృపన్" 1.9.

అని ప్రభావతీప్రద్యుమ్నమును రచించి తండ్రికి కృతి యిచ్చినాడు సూరన. చిన్ని తమ్ముడు పితృభక్తి ప్రకటనమున తనకంటె మిన్నయనిపించుకొనుట కా గూఢాహంకారి అంతరాత్మ అంగీకరింపదు. అందువలననే అతడు ప్రభావతీ ప్రద్యుమ్నము రచించుట. ఎఱ్ఱయ పితృతర్పణములకంటె తన కృతిసమర్పణము అక్షయ మని అతని అంతస్సంతృప్తి. సహృదయలోకము సన్నుతించెడి సత్కృతి యది !

పింగళి సూరన అల్లసానిపెద్దన మనుమరాలి పెనిమిటి యను ప్రతీతి యొకటి కలదు. పెద్దన బంధుత్వమును, సూరన పాండిత్యమును మన్నించి శ్రీకృష్ణదేవరాయలు అతనిని అష్టదిగ్గజ కవులలో నొకనిగా సత్కరించినను, అతడు కొలువులో పట్టుమని పదినాళ్లపాటు ముచ్చట తీర్చుకొను లోపలనే ఆంధ్రభోజుడు అస్తమించియుండవచ్చును. విజయనగరమునందలి విద్వత్కవులందరితో పాటు సూరనకు గూడ ఆశ్రయము పోయి యుండవచ్చును. ఇది యంతయు ఊహకు విషయము.

పింగళి సూరన కాశ్రయ మిచ్చిన పోషకులలో మొదటివాడు ఆకువీటి పెద వేంకటాద్రివిభుడు. పింగళి సూరన విద్యాభ్యాసము ముగించుకొని, కొన్ని తెలుగు కృతులను రచించి శబ్దశాస్త్ర పాండిత్య పాటవమున పరిఢవిల్లు చుండిన కాలమది. 'నవ్యప్రకారంబున' ఒక 'భవ్యకావ్యము' వ్రాయవలె నను సంకల్ప మతనికి బలముగా నున్న తరుణ మది. వెంకటాద్రి విభుడు శ్లేష చమత్కార ప్రియుడు, పింగళి సూరన యువకు డగుటచే తన శబ్దశాస్త్ర పాండిత్యమును ప్రకటించుకొనుటకు సహజముగా నువ్విళ్లూరుచు ఉండియుండవచ్చును. ఇరువురి మనఃప్రవృత్తులు సజాతీయములు. వెంకటాద్రికి ద్వ్యర్థికావ్యముపై మనసు పోయినది. దానిని నిర్మించుటకు సూరనయే సమర్థు డని భావించి, అతని పిలిపించి, సత్కరించి యిట్లనినాడు —

శా. "రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబునఁ, నందునుం దెనుఁగు కబ్బం బద్భుతం బండ్రు ద
క్షుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్". 1.10.

నన్నయాది కవులలోనే కాక ప్రబంధ కవులలో గూడ అప్పటికి శ్లేష పద్యరచనము విశేష ప్రచారము పొంది యుండ లేదు. కాని, వేములవాడ భీమకవి తొల్లి ద్వ్యర్థి కావ్యముగా రాఘవ పాండవీయమును రచించెనను ప్రతీతి కలదు. అది సూరన నాటికే పెద్దలు చెప్పుకొను మాటగా మిగిలిపోయినది. సూరన రచించినచో సూరిలోకము మెచ్చుటయే కాక 'ఒక నవ్యకావ్యప్రకారమునకు' తెలుగున అతడు మార్గదర్శకు డగుటకు వీలున్నది.

రెండర్థముల పద్య మొక్కటి రచించుటయె గొప్ప. అట్లు కావ్యమెల్ల రచించుట ఆశ్చర్యకరము. అందును తెనుఁగున రచించుట అద్భుతావహము. అందువలననే—

ఉ. "రాఘవ పాండవీయ కథ రమ్యముగా నొక కావ్యసృష్టి నా
హా ఘటియింపఁగా వశమె యాంధ్ర కవీంద్రుల కైనఁ దావక
శ్లాఘనపూర్వకోక్తి యవిలంఘ్యము గావునఁ గోవిదానుకం
పాఘన బుద్ధిఁ జూపెదఁ జమత్కృతిమ త్కృతిమత్కృతిత్వమున్." 1.15

అని సూరన కావ్యరచన కుపక్రమించినాడు.

ద్వ్యర్థి కావ్యరచన తెలుగులో క్రొత్త బాటయైనను సంస్కృతమున నలిగిన బాటయే. క్రీ.శ. 6 వ శతాబ్దమున దండి, పదియవ శతాబ్దమున ధనంజయుడు, పండ్రెం డవ శతాబ్దమున కవిరాజసూరి రాఘవ పాండవీయ ద్వ్యర్థి కావ్యములను సంస్కృత మున రచించియున్నారు. మఱియు సంధ్యాకరనంది రామచరితము, (11 వ శ.) విద్యా ధరకవి పార్వతీ రుక్మిణీయము వంటి ద్విసంధాన కృతులేకాక శతార్థక కావ్యములు, ద్వ్యర్థి నాటకములు, విలోమావిలోమ కృతులు సంస్కృతమున వెలసియున్నవి. ఎన్ని యున్నను అవి సంస్కృతభంగాభంగ శ్లేషలకును, శబ్దశ్లేషలకును ప్రసిద్ధివహించినవి. ఆంధ్ర సంస్కృత శబ్దశ్లేష చమత్కారము తెలుగు కవుల సొత్తు. ఆ సొత్తులోని మహత్తును మొదటిసారి మనకందించిన గౌరవము పింగళి సూరనకు దక్కినది. "దక్షుం డెవ్వాఁడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్" అని కృతిపతి చేసిన సవాలునకు సమాధాన మిచ్చి దక్షుడని ప్రసిద్ధి గాంచినవాడు సూరన.

ద్వ్యర్థి కావ్యమును వ్రాయుట కవి కెంత కష్టమో, దానిని విని తాత్పర్యము తెలి యుట పాఠకున కంత క్లేశము.

క. "ఒక కథ వినియెడితరి వే
ఱొక కథపై దృష్టి యిడిన నొక యర్థముఁ దోఁ

పకపోవుఁ గాన నేకా
ర్థకావ్య మెట్లట్ల వినగఁదగు నొకటొకటకన్." 1.18

అని పింగళి సూరన ముందుఁగ సూచన చేసినాడు. రామభారత కథలను పర్యాయ దృష్టితో గ్రహించు సుమతులకు సూరన ప్రపంచించిన శ్లేషార్థ చమత్కారముల పరిచయ మవసరము. వానిని పేర్కొనుచు సూరన యిట్లు వ్రాకుచ్చినాడు:

సీ "ఆంధ్ర భాషా సంస్కృతాభిభాషా శ్లేష
యొక్కొక చోట నొక్కొక్కచోట
నుచిత శబ్దశ్లేష యొక్కొక చోట న
ర్థశ్లేష యొక్కొక్క తఱిని ముఖ్య
గౌణవృత్తి శ్లేష ఘటన యొక్కొక తఱి
నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయ విభేద సంగతి యొక్కొక్క
తఱి నివి యొక్కొక్క తఱిని రెండు

మూఁడు గూడుట యన సముజ్జ్వలము గాగ
నాకుఁ దోచిన గతిఁ బెక్కుఁబోక లమర
రామభారత కథలు పర్యాయ దృష్టిఁ
జూచు సుమతుల కేర్పడ నాచరింతు." 1.17

ఇందులో చెప్పబడిన శ్లేషలు అర్థద్వయమును గ్రహించుట కేర్పఱచిన మార్గములు.

1. ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష = మాట విరుపు వలన ఏర్పడిన సంస్కృత శబ్దముల వలన నొక యర్థము, తెలుగు పదముల వలన మఱియొక అర్థము నేర్పడు శ్లేష. ఉ: వినియతనిందన పై నిడుకొని- (1.28) అను పాదమును రామాయణార్థమున విని, అతనిం, దనపై నిడుకొని అని విరిచినచో తెలుగు మాటలగును, భారతార్థమున వినియతనిందన, అనునది సంస్కృతసమాస మగును. మిక్కిలి నియతమైన నిందను అను అర్థమేర్పడి దానిని పైన వైచుకొని అను అన్వయము కలుగును.

2. ఉచిత శబ్దశ్లేష- ఏ భాషలోని పదముల కాయా భాషలోనే రెండర్థములు వచ్చుట. ఉ: అసుతతోగ్రార్తి కోర్వక యతివరుండు అను పద్యమున (1.29) రామాయణార్థములో అసుతతా + ఉగ్రార్తి - (అపుత్రకత్వముచేతనైన తీవ్ర దుఃఖము) అనియు, భారతార్థమున అసు + తత + ఉగ్రార్తి - (ప్రాణముల యొక్క విస్తృతమైన తీవ్ర దుఃఖము) అనియు గ్రహింపవలెను. ఏనుంగని కర మరయక-(1.25)అను పద్యములో రామా. అర్థమున-ఏనుంగు + అని,

కరము + అరయక—అనియు, భార. అర్థములో— ఏనున్ + కనికరము + అరయక అనియు తెలియవలెను.

3. అర్థశ్లేష—శబ్దమున కున్న నానార్థముల వలన నేర్పడు రెండర్థములు. ఉ : మునియుగము (1.25) అను సమాసమునందలి యుగము అను శబ్దమునకు రామాయణార్థమున ఆయుర్దాయ మనియు, భారతార్థమున ద్వయమనియు అర్థము చెప్పుకొనవలెను.

4. ముఖ్యగౌణవృత్తిశ్లేష—శబ్దమున కున్న ముఖ్యార్థము ఒకసారియు, విరుపు వలన ఏర్పడిన అముఖ్యార్థము మరియొకసారియు గ్రహించుట. ఉ: ధృతరాష్ట్రుడు (1.2) అను పదమునకు భారతార్థమున ధృతరాష్ట్రుఁడను ముఖ్యార్థమును, రామాయణార్థమున ధృత + రాష్ట్రుడు—ధరింపఁబడిన రాష్ట్రము గలవాడను నర్థమును దశరథపరముగా గౌణవృత్తి శ్లేషయును చెప్పుకొననలెను.

ఇట్లే అర్థాన్వయ శ్లేషలు, శబ్దాన్వయ శ్లేషలు, వాని మిశ్రరూపములు—మొదలగు శ్లేష పద్ధతులను సహృదయు లూహింపగలరు.

రాఘవ పాండవీయము నాలుగాశ్వాసముల కావ్యము. మొత్తము 650 గద్య పద్యము లున్న గ్రంథము. అవతారికలో 50 పద్యములు కలవు. ఈ కృతియందు రామాయణ భారతకథా ఘట్టముల నెన్నుకొని సంయోజనము చేసిన విధము సహృదయులకు సంతోషాశ్చర్యములను గలిగించు విషయము. దాని నాక్రమముననే సంగ్రహముగా నివేదించెదను.

ప్రథమాశ్వాసము : అయోధ్యాపురి వర్ణనము/హస్తినాపుర వర్ణనము; దశరథ మహారాజు వర్ణనము/ధృతరాష్ట్ర పాండురాజుల వర్ణనము ; దశరథుడు కౌసల్యా కైకేయీ సుమిత్రలను వివాహమాడుట/పాండురాజు కుంతీమాద్రులను బెండ్లాడుట; దశరథుని దిగ్విజయయాత్ర/పాండురాజు దిగ్విజయయాత్ర ; దశరథుడు వేటకేగుట/ పాండురాజు వేటకు వెడలుట ; దశరథుడు బ్రాహ్మణబాలుని వధించి శాపగ్రస్తుడగుట/పాండురాజు మృగాకృతులలో క్రీడించుచున్న మునియుగము నందలి పెంటి లేడిని చంపి శాపగ్రస్తుడగుట; దశరథునికి పుత్రప్రాప్తి/పాండురాజునకు సంతానలబ్ధి.

ద్వితీయాశ్వాసము: రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల మైత్రి/పాండవుల పరస్పర మైత్రి; వసంతోదయము/వసంతోదయము; దశరథుడు విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణుల నంపుట/పాండురాజు మాద్రిని గూడి విగత జీవుడగుట, కుంతి పుత్ర సంరక్షణార్థమై మాద్రివలె సహగమనము చేయక సజీవయై యుండుట; రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట ఆశ్రమమునకు పోవుచు తాటకను సంహరించుట/పాండవులు హస్తినాపురి కరుగుట; రామలక్ష్మణులు మునిజనుల గూడుట/పాండవులు కౌరవుల గూడుట; రామలక్ష్మణులు సుబాహుని జంపి మారీచుని సముద్రమున బడవేయుట/ కౌరవులు భీముని నీట ద్రోసి చంప యత్నించుట; విశ్వామిత్రుని వలన రామలక్ష్మణులకు అస్త్రవిద్యాలబ్ధి/కృపాచార్యుని యొద్ద కురుకుమారుల అస్త్రవిద్యాభ్యాసము; రాము

నకు సీతనుగూర్చు తలంపుతో విశ్వామిత్రుడు శివధనుర్విశేషముల నెఱిగించుట/ద్రోణాచార్యుడు కురుకుమారుల కస్త్రవిద్య బోధించుట, అర్జునుడు ద్రుపదుని పట్టితెచ్చి గురుదక్షిణ చెల్లించుట; విశ్వామిత్రుడు రామలక్ష్మణుల వెంటగొని మిధిలకు పయనమగుట/ధర్మరాజు తమ్ములతో గలసి వారణావతమున కరుగుట; అహల్యా శాపవిమోచనము/వారణావతనగర వర్ణనము; గౌతమమహర్షిసత్కారము లంది రామలక్ష్మణులు మిధిలకు పయనమగుట/లాక్షాగృహదహనము, భీముడు తల్లిని, అన్నదమ్ములను గొని రహస్యమార్గమున వనమున కేగుట; శ్రీరాముడు సీతాస్మరణము వలన గలిగిన మన్మథావేశము నణచుకొని విశ్వామిత్రుడు చెప్పెడి గంగావతరణాది వృత్తాంతములను వినుట/హిడింబుని వధించి గురుజనానుమతిపై భీముడు హిడింబను వివాహ మాడుట; మిధిలానగరోపవనసౌందర్యము రాముని హృదయమున కుల్లాసము కలిగించుట/పాండవులు ఏకచక్రపురమున మాధుకరవృత్తితో బ్రాహ్మణ వేషముల జీవించుట; సరోవరవర్ణనము / బకాసుర వధ; అరుణపద్మములశోభ/ అంగారపర్ణుని వృత్తాంతము; రమ్యలతాభివర్ణనము/ద్రౌపదీ స్వయంవర వృత్తాంతమును పాండవులు వినుట; మిథిలానగర పురోహితు లెదురువచ్చి విశ్వామిత్రుని రామలక్ష్మణులను పూజించుట/పాండవులు బ్రాహ్మణవేషములతో ద్రుపదుని నగరము ప్రవేశించుట; శివధనుర్భంగము/మత్స్యయంత్ర భేదనము; రామలక్ష్మణభరత శత్రుఘ్నుల వివాహము/ద్రౌపదిని పాండవు లేవురు వివాహమాడుట; దశరథుడు వధూసమేతులైన పుత్రులతో గూడి అయోధ్యకు తరలుట/ విదుర ప్రేరితుడైన ధృతరాష్ట్రుడు పాండవులను హస్తినకు పిలిపించుట; పరశురామ గర్వభంగము/ధర్మరాజాదు లరిభయంకరులై ఇంద్రప్రస్థపురమున నర్ధరాజ్యమును పాలించుట; రామభార్గవులను గాంచుటకు నారదు డరుదెంచుట/పాండవులకడకు నారదుడు వచ్చుట; కార్తవీర్యార్జున వృత్తాంతము/అర్జునుడు సమయభంగ మొనర్చుటచే తీర్థయాత్రల కేగుట, ఉలూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహ మగుట, పుత్రోత్పత్తి, ఖాండవ దహనము.

తృతీయాశ్వాసము: శ్రీరామపట్టాభిషేక ప్రయత్నము/ధర్మజుని రాజసూయ యాగ ప్రయత్నము, శ్రీకృష్ణపూజ, శిశుపాలవధ ; మంధర దుర్బోధలకు లొంగి కైకేయి రామాభ్యుదయమున కసూయపడుట/ధర్మజుని అభ్యున్నతికి దుర్యోధను డసూయ పడుట ; కైక వరములు కోరుట, రాముడు వనమున కరుగుట/ద్రౌపదీవస్త్రాపహరణము, పాండవు లడవుల కేగుట ; భరతాదుల ప్రయత్నములను రాముడు మాన్పుట/భరతముఖ్యులైన భీష్మాదులను ధర్మజుడు వెనుక కంపుట ; విరాధవధ/కిమ్మీరవధ ; శరభంగ సుతీక్ష్ణాశ్రమ గమనము/పాశుపతాస్త్ర ప్రయత్నము ; అగస్త్య దర్శనము/శివసాక్షాత్కారము ; అగస్త్యుడు రాముని కీర్తించుట/అర్జునుడు శివుని స్తుతించుట ; రామునకు వైష్ణవచాప బ్రహ్మాస్త్రముల సిద్ధి/అర్జునునకు పాశుపతాస్త్ర లబ్ధి; శూర్పణఖ పరాభవము/ఊర్వశి నరుని శపించుట ; ఖరుని సేనలు రాముని పై దాడి చేసి మడయుట/ఊర్వశి శోకముతో నిల్లు చేరుట ; రావణుడు జడదారి రూపమున పంచవటి కేతెంచుట/పాండవులకడకు కపటబ్రహ్మచారివేషమున జటాసురు డరుదెం

చుట ; సీతాపహరణము/ జటాసురుడు ద్రౌపదీసహితముగా ధర్మజు నెత్తుకొనిపోవుట ; జటాయువు రావణునిచే కూలుట/భీమునిచేత జటాసురుడు చచ్చుట; లక్ష్మణుడు రాముని గలియుట/అర్జునుడు ధర్మజాదులను గూడుట ; కబంధుని శాపమోక్షము/నహుషుని శాపవిమోచనము ; హనుమద్దర్శనము/శ్రీకృష్ణ దర్శనము ; సుగ్రీవస్నేహము/మాధవునితో మైత్రిసల్లాపము ; వాలివధ/సైంధవగర్వభంగము ; సీతాన్వేషణయత్నము/అజ్ఞాతవాసవ్రతనిర్వహణప్రయత్నము.

చతుర్థాశ్వాసము : సీత రావణుని దూలనాడుట/ద్రౌపది కీచకుని దూలనాడుట; మారుతి సీతను దర్శించుట/ద్రౌపది వలలుని దర్శించుట; హనుమంతుడు సీతకు ధైర్యము చెప్పుట/భీముడు ద్రౌపది నోదార్చుట; మారుతి చేత అక్షకుమారుడు మడయుట/భీముని చేత కీచకుడు చచ్చుట; ఇంద్రజిత్తు హనుమంతుని బట్టుట/సుశర్మ దక్షిణగోగ్రహణము చేసి విరాటుని పట్టుట; మారుతి లంకను కాల్చి విడుచుట/భీముడు సుశర్మను బంధించి గర్వమడచి విడుచుట; హనుమంతుడు తిరిగి రాముని యొద్దకు వచ్చుట/విరటునితో ధర్మజుడు పురమునకు తిరిగి వచ్చుట; రాముని దండయాత్ర సన్నాహము/ఉత్తరగోగ్రహణము, పార్థవిజృంభణము; విభీషణుడు రావణునకు నీతులు బోధించుట/భీష్ముడు దుర్యోధనునకు నీతులు బోధించుట; ఇంద్రజిత్తు పరుష వాక్యములు/ కర్ణుని పరుషవాక్యములు; విభీషణ శరణాగతి/కర్ణుని మాటలకు క్రుద్ధులైన ద్రోణాదులను దుర్యోధనుడు అనునయించుట; రాముడు సముద్ర గర్వభంగ మొనర్చుట/పార్థుని శరపరంపరలకు శత్రువు లాకులపాటు చెందుట; సముద్రుడు బెడగుపడుట/దుర్యోధనుడు బెదరి పారుట; రావణుడు సీతను రామునికిచ్చుట కంగీకరింపక రణోత్సాహమును ప్రకటించుట/విరటుడు ఉత్తరను అభిమన్యున కిచ్చుట కంగీకరించుట; రాముడు వారిధిని దాటి లంకాద్వీపమున ప్రవేశించుట/ధర్మజు డనుజ బాంధవులతో గూడి ఉపప్లావ్యనగరమును జేరుట; అంగదురాయబారము/శ్రీకృష్ణుని రాయబారము; రావణుని సమాధానము/దుర్యోధనుని సమాధానము; అంగదుడు రావణునికి హితవు చెప్పుట/కృష్ణుడు ధృతరాష్ట్రునకు హితము చెప్పుట; రావణుడు నీలుని సర్వసేనానిగా నభిషిక్తుని జేయుట/ధృష్టద్యుమ్నుడు పాండవసర్వసేనానిగా నభిషిక్తు డగుట; రావణయుద్ధము/భారతయుద్ధము; ఇంద్రజిత్తు శక్తిచే లక్ష్మణుడు పట్టుపడుట/భీష్మపతనము; రాక్షస విజృంభణము/ద్రోణవిజృంభణము; ధూమ్రాక్షుని యుద్ధము/భగదత్తుని యుద్ధము; ప్రహస్తుని వధ/అభిమన్యు వధ; రావణ విషాదము/అర్జున విషాదము; కర్ణుడు భీముని నెదుర్కొనుట/సుగ్రీవుడు రావణు నెదుర్కొనుట; మేఘనాద సంహారము/సింధురాజ సంహారము; కుంభకర్ణ విజృంభణము/కర్ణ విజృంభణము; నీల విజృంభణము/ఘటోత్కచుని మాయాయుద్ధము; అతికాయుని పతనము/ద్రోణుని పతనము; ఇంద్రజిత్తుని బ్రహ్మాస్త్రప్రయోగము/ అశ్వత్థామ నారాయణాస్త్రప్రయోగము; మారుతి నికుంభుని వధించుట/భీముడు దుశ్శాసనుని జంపుట; లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట/అర్జునుడు కర్ణుని చంపుట; కుబేరతనయుడైన రావణుడు రామునిపై లంఘించుట/శల్యుడు ధర్మజునిపై నుఱుకుట, విరూపాక్ష వధ/శల్య వధ; రావణుడు రామ

బాణ శరధిలో మునుగుట/దుర్యోధనుడు హ్రదములో దాగికొనుట; రామునిచే రావణుడు నిహతుడగుట/భీమునిచే దుర్యోధనుడు కూలుట; రామ విజృంభణము/అశ్వత్థామ విజృంభణము; విభీషణపట్టాభిషేకము/ధర్మరాజుపట్టాభిషేకము; రాముడయోధ్యను జేరుట/కృష్ణుడు ద్వారక కేగుట.

ఈ కథార్థ ద్వయసంవిధానమున కానవచ్చు విశేషములు కొన్ని కలవు. రాజ, యుద్ధ, మృగయా, వివాహ వర్ణనాదులయందు సమమైన ఘట్టములను గ్రహించి శబ్దార్థోభయ శ్లేషచే కథలను నడిపించుట యొకటి. వసంత వర్ణనాదు లుభయసామాన్యములు. భారతార్థమునందలి ఉపాఖ్యానములను విస్తరించుట. ఉదాహరణమునకు అర్జునుని తీర్థయాత్రాభివర్ణనము చేయునెడ రామాయణార్థమున పరశురాముడు కార్తవీర్యార్జునుని గర్వభంగ మొనరించిన యుపాఖ్యానము విస్తరిల్లినది. పాశుపతాస్త్ర సంపాదన ఘట్టమునందును, శ్రీకృష్ణుని రాయబార ఘట్టమునందును రామాయణార్థమున కథ కొంత విపులముగా సాగినదనే చెప్పవలెను. అట్లే రామాయణార్థమున సుగ్రీవ స్నేహ ఘట్టమున పాండవులు మాధవ మైత్రి పచరించిన భారత ఘట్టము విస్తరించినది. ఇట్టివి తప్పవు. స్థూలముగా పరిశీలించినచో మహాభారత వృత్తము రామాయణ కథకంటె పెద్దదియేకాక పాత్ర బహుళమైనది, సన్నివేశ నిబడమైనది. కావున భారతకథాఘట్టములను బట్టియే రామాయణ ఘట్టములను అనుసంధించుకొనుట తప్పనిసరియైనపని. కథార్థ సన్నివేశములలో విరుద్ధార్థములు స్ఫురింపవలసిన చోట పింగళిసూరన ప్రదర్శించిన ప్రజ్ఞ నిరుపమానము. భావికవుల కాతని సంవిధాన నైపుణ్యము మార్గదర్శకమగుటయేకాక ప్రయోగవైవిధ్యమునకును, విస్తృతికిని చక్కని చొరవగల చూపు ప్రసాదించినది.

ఏమైనను ద్వ్యర్థికావ్యరచనము బుద్ధికిని, పాండిత్యమునకు వికసనము కలిగించినంతగా మనసును కరిగింపలేదు అది రసదృష్టిగల పఠితల నలరింపలేదు. సూరనకీ సత్యము తెలియును. 'చూపెదఁ జమత్కృతిమ త్కృతిమత్కృతిత్వమున్' అని ఆయనయే అవతారికలో చెప్పకొనినాడు. చమత్కారముగల ప్రబంధ రచనయందు నాకౌశలము చూపెదనని ఆతని ప్రతిజ్ఞ. చమత్కారము చిత్తప్లుతికిని కలిగించునుగాని చిత్తద్రుతిని కలిగింపజాలదు. తెలుగులో పాండిత్య పరీక్షకు పరశువేది అనదగిన ఈవింత కవిత్వ ప్రక్రియకు ప్రబంధయుగములో మంచి గౌరవము కలిగినది. రామరాజభూషణునివంటి వా డీపద్ధతిని అనుసరించి దాని పెంపుకు తోడుపడినాడు. సూరనకవి ఈ 'నవ్యప్రకారమును' ఒక నవ్యప్రయోగముగా చేసి మేటి అనిపించుకొనినాడు. దాని ప్రయోజనము తీరినది. ఆ యుగములో తన కొక అగ్రపీఠము దొరికినది. చేపట్టిన దానిని పట్టుదలతో చేవమీర రచించు ప్రవృత్తి యెంత కలదో చేపట్టినదానికంటె ఉత్తమమైన మరియొక పద్ధతి కనవచ్చినచో నా పట్టిన కుందేలునకు మూడు కాళ్ళను వితండవాదమును విడిచివేయు వివేక మంత కలదు సూరనకు.

సూరన వస్తుతః ప్రతిభావంతుఁడు. వ్యుత్పత్తికి ప్రతిభ పరిచర్యలు చేయు

ప్రక్రియ అతని ప్రకృతికి విరుద్ధము. మరియొక కవి యైనచో ద్వ్యర్థికావ్యరచనకు వచ్చిన ప్రఖ్యాతికి మురిసి త్ర్యర్థికావ్యరచనము చేపట్టియుండెడి వాడు. పింగళిసూరన కా వెట్టి ముదరలేదు. అతడు అపూర్వకల్పనా మహనీయమైన కావ్యమును నిర్మింప తలంచినాడు. అతడు వేసిన ప్రతి ముందడుగు అపూర్వముగా నుండవలెనని అతని ఆకాంక్ష! అది ప్రతిభాచైతన్యమునకు ప్రత్యక్ష నిదర్శనము!

'కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్యసత్కథల్
వావిరి పుట్టు రత్నము లవారిత సత్కవికల్పనా విశే
షావహ పూర్వవృత్తములు సానలు తీరిన జాతిరత్నముల్'

అని రామరాజభూషణుడు వసుచరిత్ర యందు పేర్కొనిన యీ సిద్ధాంతము ఆ యుగము నందు కవులచే సర్వత్ర అనుసరింపబడిన లాక్షణిక సంప్రదాయము. ప్రఖ్యాతేతివృత్తమును గ్రహించి ప్రతిభామూలకములైన కొన్ని కల్పనలను సంధించి మిశ్రేతివృత్తము కల్పించుటయే ఆనాటి పండిత కవుల దృష్టిలో గొప్పకళ. లాక్షణికులు కూడ ఇట్టి సిద్ధాంతమునే గతానుగతికముగా తమ గ్రంథములందు సమర్థించుచు వచ్చిరి గతానుగతికమైన అట్టి గతిని హర్షించు చాంధసుడు గాడు పింగళి సూరన. అతని ప్రతిభ నవనవోన్మేషమైన నవ్యకల్పనను వరించినది.

ఇచ్చట గమనింపవలసిన విషయ మొకటి కలదు. ఆద్యసత్కథలు పుట్టు రత్నములు కదా! ఆకథలు పురాణేతిహాసాదులయందు ప్రసిద్ధి కెక్కినవి. ఇతిహాసముల నటుంచినచో పురాణకథలు చాలవఱకు కల్పితములై వేద ధర్మములను వ్యాఖ్యానించుట కేర్పడిన రూపకల్పనలు. ఆ కథలయందలి పాత్రలు దేవయోనులు కావచ్చును, మానవులు కావచ్చును జంతువులు కావచ్చును. రాలు రప్పలు కావచ్చును వానియందలి వ్యక్తి కాదు ప్రధానము; అవి వ్యక్తముచేయు ఆంతరమైన తాత్పర్యశక్తి. ఆ శక్తి కవి ప్రతీకలు. అట్టికథా కల్పనము ప్రచండమైన ప్రతిభగాని చేయలేదు. మన పురాణము లట్టి ప్రతిభా విలసితమైన కథాజగత్తునకు కాణాచులు. అట్టి కథలను గైకొని ఒకకవి మిశ్రేతి వృత్తములుగా తీర్చి దిద్దినప్పుడు గౌరవము కవి కల్పనలకే కదా! పాక్షికమైన కవి కల్పనకే అంతగౌరవమైనచో పూర్ణమైన కవి కల్పన కెంత ప్రశంస అవసరము! అట్టి సంపూర్ణకల్పన కల్పితేతివృత్తములందు మాత్రమే ప్రకాశించుటకు వీలున్నది. కాని, ప్రబంధకవుల దృష్టిలో కేవలకల్పనాకథలు కృత్రిమ రత్నములు! వారికి పరిపూర్ణ ప్రజ్ఞాప్రకాశమును దర్శించు ప్రవృత్తి లేదు. అందు వలన అట్టి ప్రక్రియ ప్రథవింపలేదు తాను నివసించుచున్న యుగములోని గుణదోషములను గుర్తించి, సమగ్రతను భావించి, దాని కొక కళాపూర్ణత్వము కల్పించు కావ్యమును చేపట్టవలె నను సంకల్పము కలుగుటయే కవులకు అరుదు. కాలప్రవాహమున కెదురీది నిలువగలుగు నిబ్బర ముండుట అంతకంటె అరుదు. నిలిచి కలకాలము నిలువగలిగిన కృతిని నిర్మించుటకు కవి కాలాతీతవ్యక్తి కావలయును. పింగళిసూరన తన కాలము

నెదిరించి నిలిచి, దానికంటె ఒక నిలువెత్తు పైకి పెరిగి, భావియుగములకు కాంతి పుంజములను ప్రసరింపగలిగిన జ్యోతిర్మూర్తి. అతని కళాపూర్ణోదయ కావ్యరచనము అతని అపూర్వ ప్రయోగము. సమకాలమువారు మెచ్చకపోయినను శతాబ్దముల తరువాత ఒక నూతన శకమును నిర్మించుకొనిన కళాసామ్రాజ్యము అతని కళాపూర్ణోదయము.

పింగళి సూరనకు ముందు ప్రసిద్ధములైన కావ్యప్రక్రియలలో ఇతిహాస పురాణము లున్నవి, కథాకావ్యము లున్నవి, మనుచరిత్ర వంటి ప్రబంధము లున్నవి. అతడు నిర్మింపబోవు మహాకావ్యమున పూర్వాంధ్ర ప్రసిద్ధ ప్రక్రియల విశిష్ట లక్షణములు సంపుటీకరింపబడవలెను ఇతిహాసమున సమగ్రజీవిత వృత్త చిత్రణము ముఖ్యము. పురాణకథా కల్పనమునకు తత్త్వచింతనము పరమ తాత్పర్యము. కథాకావ్యములకు అద్భుత వీరచర్యల నభివర్ణించుట అభిమతము. ప్రబంధము లలో శృంగార రసపోషణము ముఖ్యము. ఇట్టి విశేషములన్నియు సమకూర్చినను సూరన ప్రతిభను పట్టియిచ్చు మఱియొక లక్షణ మవసరము. అది అపూర్వ కథా కల్పనము. అది యతని స్వాతంత్ర్య శక్తికి నిదర్శనము. ఇన్ని కూడినచో అతని కృతి ఒక మహాప్రబంధ మగును.

కృతిపతియైన నాదెండ్ల కృష్ణభూపతి యభ్యర్థన మితని దృష్టికి ప్రోద్బలక మైనది.

శా. "నీచే నొక్క మహా ప్రబంధముఁ గడున్ నిర్నిద్ర సారస్య లీ
లా చిత్రంబగు దాని, నో యనఘ! వాలాయంబుఁ జేయించుకో
మా చిత్తంబున వేడ్కఁ యుండు; నది నీ మాధుర్యధుర్యోరువా
గ్వైచిత్రిన్ సఫలంబు సేయుము సుధీవర్గంబు లోహో! యనన్." 1.13

మనుచరిత్రము, పారిజాతాపహరణము మొదలైన ప్రబంధములు చదివెడి రసజ్ఞులు వరూధినీ ప్రవరాఖ్యుల చరిత్రమునందును, సత్యభామా శ్రీకృష్ణుల ప్రణయఘట్టమునందును రమించినంత విశేషముగా మిగిలిన కథా ఘట్టములందు రమించుటలేదు. సూరన కావ్యమ ట్లుండరాదు. అది నిర్నిద్ర సారస్యలీలా విచిత్రమై కావ్యారంభము నుండి కడవఱకు నిబిడమైన యుత్కంఠతో చదువ నట్లుండవలెను. అది అలంకారజటిలమైన భాషలో నుండక మధురరుచుల నీను మనోజ్ఞమైన శైలిలో నడువవలెను. కృతిభర్త మాటలలో ఇట్టి సూచన కలదు. కృతికర్త మనసులో మఱికొన్ని కోరికలు కలవు. అతని కావ్యము కావ్యకళాపూర్ణోదయముగా నుండవలెననియు, అత్యపూర్వకథా సంవిధాన వైచిత్రీ మహనీయముగను, శృంగారరసప్రాయముగను, పుణ్యవస్తు వర్ణనాకర్ణనీయముగను రూపొందవలె ననియు నతని సంకల్పము. కృతికర్త సంకల్ప సిద్ధుడు, కృతికర్త కర్తాగుడు!

కావ్యమునకు కథ శరీరము వంటిది. కథ నిబిడముగా లేకున్నచో కావ్యమునకు స్ఫురద్రూప మేర్పడదు. ప్రబంధకవులకు కథమీద కంటె అష్టాదశ వర్ణనల మీద మక్కువ మిక్కుటము. వర్ణనము ఆ కృతికి కండపుష్టి కలిగించు నను మాట సత్యమే అయినను, మితిమీరినచో శరీరము మోయలేని బరువెక్కి గతికే దుర్గతిని కల్పించును. పింగళిసూరన కథ కొదిగిన వర్ణనను మాత్రమే గ్రహించును. ఆ కథ అత్యంతము అపూర్వముగా నుండవలె నని అతని ఆశయము. ఇందు రెండర్థములు కలవు. అంతకు పూర్వ మెచ్చటను కల్పింపబడని కథ యని ఒక అర్థము. అద్భుతావహమైన కథ యని మఱియొక అర్థము. ద్వ్యర్థికావ్యరచయిత వాక్యములోని రెండర్థములు ప్రకృతము లగుట సార్థకము. కావున కళాపూర్ణోదయ కథ సూరన ప్రతిభచే కల్పింపబడి పఠితల కబ్బురపాటు కలిగించునట్లు ముగియవలెను కథలో సంవిధాన వైచిత్రి యుండవలెను. కథ చెప్పుట యొక కళ. కాలక్రమమున కథచెప్పుట యొక విధము; కార్యకారణసంబద్ధముగా నుత్కంఠా వహముగా చెప్పనేర్చుట యొకవిధము. మొదటిది ప్రసన్నకథాకథన పద్ధతి. రెండవది విచిత్రకథాకథన పద్ధతి. పూర్వాంధ్ర కవులందరు నడచినబాట మొదటిది. తనంతట తాను తెలుగున కల్పించుకొని కడదాక పింగళి సూరన నడచిన బాట రెండవది. ఇతని పద్ధతి వలన కథ కొక నూత్న ప్రగతి సిద్ధించినది. రూపక మర్యాద అలవడినది. పద్యప్రక్రియలో నేటి నవలాప్రక్రియ పొట మరించినది. అది ముందు వివరింపబడును కథాసంవిధాన వైచిత్రిచే నాకావ్యము మహనీయము కావలెను కథ చెప్పు విధము లెన్నియున్నవో అన్నింటికిని అతని కావ్యము కల్పవృక్ష మగు చున్నప్పు డా కృతి మహనీయము కాక యేమగును ?

అది శృంగార రసప్రధానము కావలెను. కావ్యజగత్తులో శృంగారము రస మూర్ధన్యము. ప్రకృతి రసములలో దానిని మించి హృదయాహ్లాదము కల్పించు రసము లేదు. ఇది భరతాచార్యుల నుండి లాక్షణికు లంద రంగీకరించినదే అందు వలననే దానిని గుఱించి విపులమైన వివేచనము జరిగినది. లక్షణమునకు లక్ష్యము జీవితము, జీవితమునుండి పుట్టిన కావ్యము. మానవుని సర్వజీవితప్రవృత్తికి కామము మూల కంద మని నవ్యులు భావించుచున్నారు. ప్రాచీనులు సంసారప్రవృత్తికి రతి ప్రధాన ప్రవృత్తి యని ప్రబోధించి యున్నారు. సృష్టిలోని త్రిగుణాత్మక ప్రకృతిని బట్టి రతి విచిత్రముగా ప్రవర్తించుచుండును కవి దర్శింప వలెనే కాని అనంత వైవిధ్యమా రసజగత్తున కలదు. పింగళి సూరన తనకు పూర్వ మున్న కవులు దర్శించి కావ్యమున ప్రయోగింపని శృంగారప్రవృత్తుల నెన్నింటినో కళాపూర్ణోదయమున చిత్రించినాడు. వాని సంపుటీకరణముచే శృంగార రస సమగ్రస్ఫూర్తి భాసించుచున్నది. అది యొక సజీవప్రయోగము సరసవివేకమధురము.

కల్పితకథలను సామాన్యముగా నీసడించువారికి అవి ఉదాత్తపురుష చరిత్రములై యుండ వను భ్రాంతి యొకటికలదు. పురాణేతిహాసముల మీద అంత గౌరవ ముండుటకు అవి పుణ్యమును పురుషార్థమును కలిగించుననియే. కల్పితకథ కట్టి గుణ గౌరవము కల్పించినచో ఆ లోపము తీరును సూరన ఈ రహస్యము నెఱిగిన వివేకి. తన

కావ్యమునందు పురాణప్రసిద్ధవ్యక్తు లుండవలెను. ఆదర్శపాత్ర లుండవలెను. అంతటితో నాగక, జీవితానుభవమునుండి చిత్రముగా పుట్టిన విచిత్రవ్యక్తు లుండవలెను. అపూర్వ శక్తులున్నను, అపూర్వ చిత్తవృత్తులు కూడ నుండవలెను. సత్యలోకవాసులైనను జీవిత సత్యము లను ప్రతిబింబింపవలెను సిద్ధు లుండవలెను. సాధకు లుండవలెను. కొయ్యబొమ్మల వంటి దారుమూర్తులకంటె ఆశలతో, ఆశయాలతో, సాహసాలతో, సంఘర్షణతో ఢీకొని జీవితమున కొక సార్థక్యము కల్గించుకొను సాహస శీలు రుండవలెను. సగటు బ్రతుకు లీడ్చు సాధారణు లుండవలెను. జీవితములోని తెలుపు నలుపుల తీండ్రింపులను తేట తెల్ల మొనర్చు చైతన్యవంతు లుండవలెను పుణ్య తీర్థము లుండవలెను, పణ్యవీథు లుండవలెను. సమగ్రజీవిత సందర్శనమున కది యొక విజ్ఞాన సంపుటము కావలెను వినువానికి పుణ్యము పురుషార్థము రెండును కలుగవలెను. కళాపూర్ణోదయము అట్టి కావ్యము. కనుకనే అది 'పుణ్యవస్తు వర్ణనాకర్ణనీయము'.

వీని నట్లుంచినచో పేరు వినగనే తోచు విచిత్రమైన మూడర్థములు కలవు. ఒకటి: కళాపూర్ణు డను వాని పుట్టుక; రెండు; చంద్రోదయము; మూడు: కావ్య కళ యొక్క సంపూర్ణ మైన ఉదయము. ఇందు మొదటి అర్థము కావ్యకథను సూచించునది. రెండవ యర్థము చమత్కారకారి యైనది. మూడవ అర్థము కావ్యతత్త్వమును ధ్వనించునది. అసలు కావ్యాత్మ ధ్వని అని ఆనందవర్ధనుల మతము. "తేన రస ఏవ వస్తుత ఆత్మా; వస్త్వలంకార ధ్వనీతు సర్వథా రసం ప్రతిపర్యవస్యేతే; ఇతి వాచ్యాదుత్కృష్టౌ తావిత్యభిప్రాయేణ ధ్వనిః కావ్యస్యాత్మేతి సామాన్యేనోక్తమ్" అని అతని సిద్ధాంతము. వస్త్వలంకార రసధ్వనులను మూడింటిని ముప్పేటగా నొక్కకావ్యమున సాధించి, అందు రసధ్వనికి పట్టాభిషేకము చేసినచో కళాపూర్ణోదయ మయినట్లే. కళాపూర్ణోదయమునందలి సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ వృత్తాంతము రసధ్వని కుదాహరణము. దాని నుండి పుట్టిన కలభాషిణీ కళాపూర్ణుల వృత్తాంతములు వస్తు ధ్వనికి నిదర్శనములు. ఇందలి రస భావముల కలంకారాము లన్నియు వ్యంజకములే. ఇట్టి ధ్వనిత్రయ సంవిధాన మపూర్వము. ధ్వని సిద్ధాంతము ననుసరించిన కావ్యకళ కిది పూర్ణచంద్రోదయము.

"అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీచే త్కవిః కావ్యేజాతం రసమయం జగత్."

అని ధ్వన్యాలోకకర్త. కావ్యసంసారమునందు కవియే ప్రజాపతి కాగా, ఈ కావ్యజగత్తుకు ప్రజాపతియే సృష్టికర్త. ఆ సృష్టికర్తను సృష్టించిన అపర ప్రజాపతి పింగళి సూరన. ఇందు చతుర్ముఖుడు శృంగారి కళాపూర్ణమైన సరస్వతీ ముఖసౌందర్యమును నాస్వాదించు మధురలాలసనుండి ఈ కావ్య కథాజగత్తు ఉదయించినది. అతడు శృంగారి యగుటచే అతని కల్పనము రసమయము. రసము కావ్యకళానుభూతికి మారుపేరు. 'Personal experience is the basis of all real literature' అని

హడ్సన్. కవియైన బ్రహ్మ పొందిన అనుభూతియే ఈ కావ్య సృష్టికి మూలబీజము. 'రసోవై సః' అను తత్త్వమును వ్యంజించుట కంటె రసధ్వని సార్థక్య మేమి కలదు ?

ప్రతిభ పౌరుషమైన శక్తి వ్యుత్పత్తి స్త్రైణమైన శక్తి. ప్రతిభ వ్యుత్పత్తిని ఆలంబనముగా గొని సృష్టికార్యము నిర్వహించును. రాఘవ పాండవీయమున కవి ప్రతిభ వ్యుత్పత్తికి దాస్యము చేసి తన పౌరుషమును కోల్పోయినది. కళాపూర్ణోదయ మున ప్రతిభా శక్తి రూపుడైన బ్రహ్మ, వాగ్రూపిణియైన సరస్వతి యందు రమించి కల్పన కుపక్రమించినాడు. ఇది కావ్యకళాపూర్ణోదయ రహస్యము.

నాయికయొక్క మూఁడుజన్మల కథను కార్యకారణక్రమమున నపూర్వకల్పనా సామర్థ్యముతో సంవిధానము చేయుట యాప్రబంధకథానిర్మాణమునందలి ప్రత్యేకత! సరస్వతీ చతుర్ముఖుల పెంపుడుచిలుక కలభాషిణిగా, మధురలాలసగా జన్మ మెత్తి నిర్వహించిన జీవితవిశేషము లీకావ్య వస్తువునందు విపులముగ వర్ణింపబడినవి చిలుక పుడమిపై పురంధ్రి యై పుట్టుటకు సరస్వతీచతుర్ముఖుల ప్రణయకేళీ బీజము; వాణిశాప మును, వాణీశుని వరప్రదానమును అంకురార్పణము !

పింగళిసూరన కావ్యకల్పనాకళాపరిపాకమునకు సరసోదాహరణము సరస్వతీ చతుర్ముఖుల ప్రణయఘట్టము. అందుండి రెండుకథలు పుట్టినవి. అవి : ఒకటి : కళా పూర్ణునికథ లేక మధురలాలసావృత్తాంతము; రెండు : కలభాషిణీవృత్తాంతము. సామాన్యముగా నొక రమణీయకథాసన్నివేశమును గల్పించిన కవిప్రతిభ లోకమున ప్రశంసాపాత్ర మగుచుండును. అట్లుండ కథాద్వయ కల్పనా సూత్రగర్భిత మైన కల్పిత కథాఘట్టము సృష్టించినసూరనప్రతిభ నేమని కీర్తింపగలము !

కళాపూర్ణవృత్తాంతమునకు సరస్వతీచతుర్ముఖుల కేళీఘట్టము మూలమైన విధ మును పింగళిసూరన బ్రహ్మముఖమున వివరించి యున్నాడు. రహస్య కేళీ సమయ మున తాను వచించిన కళాపూర్ణునిగాథ భూమిపై వెలయునట్లు కరుణించి విరించి వాణితో నిట్లనెను—

సీ. "కాంత ! మున్విన్నయాకథ యీ కథయ నాఁగ
నందు వాచ్యత తోఁచినట్టి నామ
జాతిక్రియాదిక సకల పదార్థ వా
క్యార్థాంతరము లెవ్వి యవియ యిందు
గలయవి; యిందుఁ దక్కృథ కంటె భేదంబు
పరికింప నొనరించెఁ బడసె నిలిపె
ననునివి మొదలైనయట్టి భూతార్థంబు
క్రియలపట్టున నొనరించుఁ బడయు

తే. నిలువు నను నివి యాదిగాఁ గల భవిష్య
దర్థవచనంబు లైన క్రియాపదంబు
లునుచుకొనుటయె వాసి యెందును దలంప
నోసుధాంశువిలాసప్రహాసివదన!

వ. మఱియు శ్రోతృజనాపేక్షానుసారంబునఁ దత్తన్నిమిత్తోపాఖ్యానంబుల చేత నిదియ కొంత విస్తారంబు నొందఁ గల; దది చెప్పఁ బని యేమి? ప్రధానకథాభాగం బింతియె."
—5 ఆ. 60-61.

దీనినిబట్టి సరస్వతీచతుర్ముఖుల రహస్యకేళిలో చెప్పబడిన కళాపూర్ణ వృత్తాంతమునందలి నామజాతిక్రియాది సకలపదార్థవాక్యార్థాంతరము లన్నియు తరువాత భువిపై ప్రవర్తిల్లిన కళాపూర్ణుని చరిత్రమునందు పాటింపఁబడిన వని స్పష్టమగు చున్నది. మఱియు తత్కథ శ్రోతృజనాపేక్షానుసారంబు దన్నిమిత్తోపాఖ్యానములచేత విస్తృతిగాంచిన దని తెలియుచున్నది. మణిస్తంభసుముఖాసత్తుల వృత్తాంతము, స్వభావసిద్ధుని యుపాఖ్యానము, అలఘువ్రతునకు మధురలాలస తెల్పిన మణికంధరవృత్తాంతము, శల్యాసుగచరిత్రము, అభినవకౌముదీవృత్తాంతము, ప్రథమాగమాది పురోహితవృత్తాంతము, సత్వదాత్మ రూపానుభూతుల వృత్తాంతములు మొదలగునవి కళాపూర్ణవృత్తాంతమునఁ గానవచ్చు నుపాఖ్యానములు. ఉపాఖ్యానముల నటుంచినచో కళాపూర్ణ-కథాకల్పనకు వలసిన మూలకథాసూత్రమంతయు వాణీచతుర్ముఖుల ప్రణయకేళియందు వాచ్యముగాఁ దోచుచుండుట నిస్సంశయము.

ఇఁక మిగిలినది కలభాషిణీవృత్తాంతము. అష్టాశ్వాస పరివ్యాప్తమైన కళాపూర్ణోదయప్రబంధమున కలభాషిణీవృత్తాంతము నాలుగాశ్వాసముల వఱకు వ్యాపించి యున్నది. అనగా కలభాషిణి కథకు కావ్యమున సగపాలును, శుకమధురలాలసా వృత్తాంతములకు మిగిలిన సగపాలును కవి పంచిపెట్టినాఁ డన్నమాట! దీనినిబట్టి సూరనకు కలభాషిణీ చరిత్రముపై నున్న మక్కువ చెప్పక తెలియుచున్నది!

పింగళిసూరన కలభాషిణీ జన్మహేతువును కడు చమత్కారముగాఁ కల్పించినాడు. సరస్వతీచతుర్ముఖుల రహస్యకేళీవృత్తాంతామును రంభ వినఁగోరి చిలుకను మఱిమఱి యడుగ నాపలుకులపక్కి కులుకుపలుకులతో నామె కావృత్తాంతమును, సరస్వతీమణితస్వరవిశేషమును వినిపించుటఁ గాంచి, వాణి శోణితాక్షియై—

"తలఁకక యోసి యేమిటి కతల్ తలపెట్టిన దాన విచ్చటన్?
తెలియము గాని నీవు పెనుద్రిమ్మరికూఁతలదానవే కదే!
బళిబళి! యీవికారములు బ్రాఁతె? యవిఘ్నతఁ జాగి లంజెవై
యిలపయిఁ బుట్టుమంచు శపింయించె మనంబున నల్క హెచ్చఁగన్."
—5. 56.

ఇచ్చట "అవిఘ్నతఁ జాగి లంజెవై యిలపయిఁ బుట్టు" మనుటలోఁ గల పదక్రమ మును పరిశీలించినచో చిలుక మొదట స్వర్గభ్రష్ట కావలె నవియు, తదుపరి వేశ్యా రూపమున భువిపైఁ బుట్టవలె ననియు సరస్వతి నిర్దేశించినట్లు స్పష్టమగు చున్నది. వాణి తన శాపమున కవిఘ్నత శాపించుటచే బ్రహ్మదేవుఁడు కూడ యామెమాట కెదురాడకుండఁ జేసినది :

ఈ శాపమును విన్న నలువ "యిది యేమి యొఱుఁగు ? నిట్లదయవృత్తిఁ దిట్టుదురె?" యని చిలుకపై నెంతయో దయ నొలుకఁబోసి, "మీయమ్మశాపపంబునకు నొఁగా దన నెవ్వరికి నెట్లువచ్చు" నని యాశ్వాసించి, అసలే భువిపై నొక జన్మ నెత్త వలసి వచ్చెనే యని విలపించు నాచిలుకకు మఱియొకజన్మ నంట గట్టి, ఆ జన్మలో దానికి అనన్యసాధారణం బైన యైశ్వర్యభోగములను, సహజమైన పరమపాతివ్రత్యము మును బ్రసాదించి కృతార్థవౌదు వని దీవించినాడు. పాప మాచిలుకకు బ్రహ్మదేవుని కరుణయు నొవశాపమై తారసిల్లినది. అమ్మగారు అంపశయ్యపై విసరివేయగా, అయ్యగారు ఒడలుదులిపి హంసతూలికాతల్పమునఁ బడవై చినట్లైనది :

పలుకులచిలుక వికారమునకు లోనై తల్లిగుట్టును బట్టబయలు చేసినందులకు కలభాషిణియైన వేశ్యగా జన్మింపు మని సరస్వతి శపించుటలో సార్థక్యము స్పష్టమగు చున్నను, కలభాషిణీకథాకల్పనకు మూలమైన రహస్యము మాత్ర మీ ఘట్టమునఁ దెలియవచ్చుటలేదు : కవి దానిని దేవరహస్యముగా దాచియుంచినాఁడు : లేనిచో సరస్వతి చిలుకను పుడమిపై పుట్టుమని శపించినట్లు చేసి, బ్రహ్మ యా పుట్టుకలోనే మధురలాలస యగునట్లు కరుణించినట్లు కల్పించినచో నొక్కజన్మము తోడనే చిలుకకు పునర్బ్రహ్మలోకసిద్ధి కలిగి యుండెడిది : కాని కవిబ్రహ్మ కలభాషిణీవృత్తాంతమున కిచ్చట నవకాశము కల్పించుకొని నాలుఁగాశ్వాసముల కథ నడపఁదలచు కొనినాఁడు :

ఇచ్చట నొకవిషయము గమనించవలసియున్నది. కళాపూర్ణోదయ కావ్య విమర్శనము గావించిన విమర్శకులు కలభాషిణీవృత్తాంతము సూరనయపూర్వకథా కల్పనకుఁ దారాృణగాఁ గీర్తించియుండిరి. కాని, తత్కల్పనకు బీజభూతములైన సూత్రములు వాణీచతుర్ముఖులరహస్యకేళీవృత్తాంతమునఁ గలవని గుర్తించినట్లు కానరాదు : అందులకుఁ గారణ మొండు గలదు: వాణీశాపవృత్తాంతము బ్రహ్మ నిబంధించిన ప్రధానకథాభాగమున కావల నడచిన గాథ యగుటచేఁ గలభాషిణి కథ ప్రధానకథకు సమానాంతరముగా వెలసి, మధురలాలసావృత్తాంతమునకు పూర్వరంగ మైనట్లు వారు భావించిరి. అంతియ. కావున నీవ్యాసమునందు గలభాషిణీవృత్తాంతకల్పనకు మూలములైన బీజములు వాణీముఖప్రతిబింబ వర్ణన కథార్థములందుఁ గలవని నిరూపించు యత్నము చేయబడు చున్నది.

కళాపూర్ణోదయ కావ్యవృక్షమునకు సరస్వతీచతుర్ముఖులవిలాసకేళి స్కంధము. వాణీముఖప్రతిబింబ వర్ణనమునందు 'వాచ్యత తోచినట్టి నామజాతి క్రియాది సకలపదార్థ

వాక్యార్థాంతరములలోఁ దోచిన కళాపూర్ణునివృత్తాంత మాతరువున కొకశాఖ. సరస్వతీ చతుర్ముఖుల ముఖబింబ ప్రతిబింబముల సంచలనాత్మకమైన చేష్టావిశేషము లందు వ్యంగ్యముగా తోచిన కలభాషిణీవృత్తాంతము మఱియొక శాఖ. ఈ శాఖాద్వయము నకు స్కంధమే యాధారము. కాని కళాపూర్ణుని కథా కల్పనము వాచ్యముగా సూచింపబడినట్లు రహస్యకేళీఘట్టమున కలభాషిణీ వృత్తాంతము సూచింపఁబడలేదు. అది యొక కథాకల్పనశిల్పమర్మము! వ్యంగ్యమర్యాద. పింగళిసూరన మణిస్తంభబింబిత వాణీముఖబింబప్రతిబింబాదుల సంచలనమునందును, వాణీచతురాననుల ముఖబింబ వీక్షణాదిచేష్టా విశేషములందును కలభాషిణీకథా కల్పనరహస్యములను బొదిగిపెట్టినాడు. వాని నీక్రింద పరామర్శించుట జరుగుచున్నది.

కలభాషిణీ కథాకల్పన మంతయు నొకవిధముగా బింబ ప్రతిబింబ రూపకల్పనముపై నాధారపడియున్నది. కలభాషిణి తొలుత మణికంధరుని వలచినది. కాని, మునిశాపభీతిచే నిజహృదయమును బయలుపఱుపక దాచుకొనినది. అపై మణికంధర రూపసామ్యము కొంత నలకూబరునియందుఁ గనవచ్చుటచే నాతని పొందు గోరినది. మణిస్తంభుని సాయమున నామె నలకూబరునిఁ జేర యత్నించినది. కాని నలకూబరాకృతియందున్న మణికంధరుని నామె పొందఁగలిగినది. మణికంధరుఁడు రంభాహృదయమునఁ జూరఁగొనఁ గోరి నలకూబరాకృతిఁ గాంచి రంభాకారమున నున్న కలభాషిణిఁ బొందుటయే కాక, నిజరంభాసాంగత్యమును గూడ పొందఁ గలిగెను. నిజరంభా నలకూబరులు నిజరూపములను నిర్ధారణము చేసికొనిన తరువాత మాయారంభానలకూబరుల వృత్తాంతము బయట పడినది. ఇట్టి తబ్బిబ్బుల ప్రహసనమునకు సాక్షి మణిస్తంభుఁడు. మణిస్తంభుఁడు లేనిచో నీయాట సాగదు.

సరస్వతీచతుర్ముఖుల విలాసకేళిలో సరోవర గర్భమందలి మణిస్తంభమే మణిస్తంభునిగా చెప్పఁబడినది. అట్టి మణిస్తంభుఁడే కీలకమైన వ్యక్తిగా సూరన కలభాషిణీ కథాకల్పనము గావించినాడు. ఇక వాణీచతుర్ముఖబింబ ప్రతిబింబముల తీరును సూరన కలభాషిణీ కథాపాత్రలకు ప్రతీకలుగా భావించిన విధమును గమనింపవలసి యున్నది.

వాణీచతురాననులు సరోవరతటమున తలిరుపాన్పుపైఁ పవళించియుండిరి. వాణీసుందరముఖారవిందమును గాంచి మదనపరవశుడై బ్రహ్మ తన నలుమోముల నా సతి యధరమును చుంబింప నుద్యుక్తుఁ డయ్యెను; ఆ లీలలకు సరస్వతి నవ్వి 'మేలు మే లెంతయు నీవింత లన్యాయ మింతగలదె? మీ మొగంబులు నాల్గు నీ మాడ్కి నువ్విళులూరిన నేకాస్య నొక్కతె నేను జాలుదునె? యివి చాలించెదరొ? మఱి యేమైన గలదొ?' అనుచు నామృగాక్షి మెడబిగించుచు నించు కెడగ వక్త్రము నిల్పి, యధరంబునకు పాణి నడ్డ మిడుచు—

తే. "మొలక నగవును, గోపంబుఁ జెలుపుఁ జిలుకు
తళుకుఁ జూపులఁ జూపులోఁ దర్జనముల

వక్రిత భ్రూలతా తాండవంబు సిరుల
మిగులఁ గెరలించెఁ బ్రియుమది మెఱయుమరుని."

అప్పు డా యజుఁడు బల్మిని వాణీముఖమును వంచి, మోవిపై నున్న చేయిని తొలగించి, ఒక్కించుక నాటునట్లుగా పలుసేర్చెను. అయ్యమ కట్టియెడ కళాభిదుర మై యింపొన రింపగా మోహనమధురాంచితశబ్ద మొండు కంఠసీమయం దుదయించెను.

ఇందు యౌవనశోభావిలసిత మగు వాణిముఖము కొంగ్రొత్త వయసున నున్న కలభాషిణీముఖమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. బ్రహ్మయొక్క నాలుగు మొగములు కలభాషిణీముఖచుంబనాకాంక్షులగు బలువురు విటులను బురుడించుచున్నవి. ప్రథమా శ్వాసము నందలి—

"తనదు మెఱుంగుఁజెక్కులు దాఁకఁగనీక మొగంబు నాఁపుచుం
జను బొగడల్ నఖాకలనఁ జక్కిలిగింతలు వోవ లోఁగుచున్
మనసిజు మించు భీతియును నానయుఁ బూనుచు నీమృగాక్షి యిం
పొనరుచు టెన్నడొక్కొ ? యని యువ్విళులూరుదు రత్తఱిన్ విటుల్."
—1.28.

అను పద్యముతో పోల్చి చూచిన భావసామ్యము తేటపడఁగలదు. అట్లు క్రీడాసక్తులైన విటులను కలభాషిణి కాదని త్రోసిపుచ్చి, శ్రీకృష్ణమందిరమున దండకస్తోత్రమును పఠించిన మణికంధరుని విద్వత్సౌందర్యములకు మెచ్చి యాతని వరించినది. ఆ మక్కువలో తద్రచితస్తోత్రము నేకసంధాగ్రాహియై మఱల పఠించినది. ఆమెయం దప్పుడు మణికంధరునకు మరులు జనించినవి. ఇట్లు మొదటిసారిగా నా ముద్ద రాలిచిత్తమును దోచుకొనిన వలపుకాడు మణికంధరుడు. అతని విద్యాప్రదర్శనావసరమున అవ్యక్తముగా కలభాషిణినోట సరస్వతి లాస్యమాడినది. ఈ కథాకల్పనకు బ్రహ్మయేకముఖమున వాణియధరమున పలు నాటించుటయు, సరస్వతికి కళాభిదురమై ప్రీతి జనించుటయు, తత్కారణముగా నామె కంఠమున మణిత మను కలస్వన ముదయించుటయు నను చేష్టావిశేషములు బీజభూతము లగుచున్నవి. అవ్యక్తమధురాంచిత శబ్దమును పలికిన సరస్వతిముఖబింబము 'కలభాషిణీ' కల్పనకు ప్రేరక మనుటలో సందేహ ముండదు.

"అంత నావాగ్దేవి యావిధమున నొదవిన కళామర్మభేదన సామ్రాజ్యసంపదను భనావస్థ మానాలాఘవ శంకఁ" గప్పిపుచ్చుటకై 'తద్విరోధకారిణి యైన విభుని యభిమత కేళికి విఘాతంబుగ నధర పీడనాసహత్వ నాటితకంబున నలుకఁ గల్పించుకొని యవ్వలిమొగంబుగాఁ బొరలె'ను. ఈఘట్టములోని 'లాఘవశంకయే' కలభాషిణికిఁ దోచిన మునిశాప శంకను గల్పించుటకు దోహదకారి యైయుండును.

కలభాషిణి మునిశాపశంక నిట్లు వివరించి చెప్పినది :

"ఆవిధి నుండు నంతట నొకప్పుడు నిన్నునుఁ జూచునో మణి
గ్రీవుని పేరు దోఁచె మదికిన్ మణికంధర! యేకదేశసా
మ్యావగుణంబుచే నతని నాతనియన్నను మద్దిచెట్లుగా
దైవతమౌని తిట్టినవిధంబు తలంపునఁ బాతె నంతటన్." 4.19

"దానన గుండె గుబ్బురనఁ దా నెరియన్ విడిచెం ద్వదంగసంగానుభవేచ్ఛ" అని యొట్టు పెట్టుకొని చెప్పిన దా లలన. కలభాషిణి మునిశాపశంక కారణముగా మణికంధరుని చరిత్రను మణిగ్రీవునిగాథ వలె విషాదభరిత మగునేమో యని భయపడి హృదయము నాతనినుండి దూరము చేసికొనినది. అచ్చట సరస్వతి తనకుఁ గల్గిన లాఘవశంకను కప్పిపుచ్చుకొనుటకై విభుని యభిమతకేళికి విఘాతుక మైన చర్యకు నొకానొక కారణమును వెదకుకొని అలుకఁ గల్పించుకొని విముఖత భజించినది. అఁట మణికంధరుఁడును "దద్విరహదశావికలితధైర్యుండయ్యు, నుల్లంబునం గల్ల గుట్టు నెట్టుకొలిపి, యిట్టట్టు తెల్పుటకుం జొరకుండి" యుండెను. ఇట్లు కలభాషిణీ మణికంధరుల చిత్తవృత్తుల కల్పనకు వాణీచతుర్ముఖుల తత్కాలచిత్తావస్థల విధము ప్రేరకమయ్యె ననుట కవకాశ మేర్పడుచున్నది.

తివ్వలిమొగంబైన సరస్వతి ముఖము కాసారగర్భమున నున్న మణిస్తంభ గర్భమునఁ బ్రతిబింబించె నని సూరన కల్పనము. తద్వాణీముఖబింబమును గాంచి చతుర్ముఖుఁడు వర్ణన మారంభించె నని చెప్పియున్నాడు. ఇచ్చట నొక విషయము మనము స్పష్టముగాఁ దెలియవలసి యున్నది. దర్పణమునందుగాని మణి ముకురము నందుగాని యొకసతి ముఖబింబము ప్రతిబింబింపగా దాని నామెప్రక్కనే యున్న యామెపతి కాంచుచుండె నని భావించినచో సతీముఖ ప్రతిబింబమును దర్శించుచున్న పతిముఖ ప్రతిబింబమును సైతము సతి కాంచఁగలిగియుండును. ఇది లోకమున సర్వ జనవిదిత మైన భౌతికసత్యము. పింగళిసూరనకు కళాపూర్ణోదయ కథాకల్పనావసరమున చతుర్ముఖ ముఖప్రతిబింబ ప్రసక్తి యవసరము లేకపోయినది. అందువలన తత్ప్రతి బింబస్థితి నతఁడు వాచ్యము చేయలేదు. అతఁడు చెప్పకపోయినను మణిస్తంభమున వాణీముఖ ప్రతిబింబ స్థాపనము చేసిన క్షణమునందే, చతుర్ముఖ ప్రతిబింబస్థితి భౌతిక శాస్త్రధర్మము ననుసరించి స్థాపించినాఁడనుట నిర్వివాదాంశము. కలభాషిణీ కథాకల్పన కాదంపతుల ముఖబింబ ప్రతిబింబ హేలయే మూలాధార మైనది!

పింగళి సూరనకు వాణీచతుర్ముఖముఖబింబ ప్రతిబింబములు కలభాషిణీ కథ లోని యేయేపాత్రల కల్పనకు కారకములైనవో పాఠక సౌకర్యార్థ మిచ్చట నీయఁబడు చున్నవి :

1. వాణీముఖము — లేక వాణీముఖబింబము = కలభాషిణి.

2. బ్రహ్మముఖము — లేక బ్రహ్మముఖబింబము = మణికంధరుఁడు.

3. మణిస్తంభ బింబితమైన వాణీముఖప్రతిబింబము = రంభ.

4. మణి స్తంభబింబితమైన బ్రహ్మముఖ ప్రతిబింబము = నలకూబరుఁడు; వీని నీవ్యాసము ందు ముమ్ముందు వివరించుట జరుగును.

సరస్వతి క్రమముగా నా లాఘువశంకనుండి తేఱుకొం నది. ముఖము కళాప్రాభవ మయ్యెను కళాపూర్ణ మైన యాతన్వి ముఖప్రతిబింబము ను నీటియందుఁగల మణిస్తంభ మునఁ బొడఁగాంచి బ్రహ్మ కళాపూర్ణుని కథ ప్రారంభించెను. వాణి ముఖవిలాసమును నలువ తత్ప్రతిబింబమున మనసుగొని చూచుచు, ధైర్యము వహించియుండఁగా సరస్వతి నిజభ్రూవిలాసమున నాతని ధైర్యమును భగ్నము చేసెను. భగ్నధైర్యుఁడయ్యు బ్రహ్మ యామె ముఖప్రతిబింబమునందు హృదయవీక్షణములఁ దనివి తీరక నిల్చియుండెను.

ఈచేష్టావిశేషములందు గమనింపఁదగిన యంశములు రెండు కలవు. చతురాన నుడు సరస్వతీముఖప్రతిబింబమును గాంచుచుండెను.సరస్వతిబ్రహ్మముఖప్రతిబింబమును గాంచుచుండెను. వెనుక నిశ్చయించినట్లు సరస్వతీముఖబింబము కలభాషిణికిని, బ్రహ్మ ముఖము మణికంధరునకును ప్రాతినిధ్యము వహించునన్నచో బ్రహ్మ కళాపూర్ణ మయిన సరస్వతిముఖప్రతిబింబమును గాంచి, హృదయ వీక్షణము లాకృష్టము లైనను ధైర్య మున మసలు చుండగా నాతనిధైర్యము నిజభ్రూవిలాసమున వాణి వికల మొనర్చిన దనుటలో రంభ యింద్రుని వరప్రసాదమున అభినవరూపలావణ్యములఁ బొంది, కళా పూర్ణయై తపమున నున్న మణికంధరునిఁ జేరి విలాసములఁ బ్రదర్శింప నాతఁడు తొలుత కొంత ధృతి వహించినను మనసు చలించుటచే తపోనిష్ఠను గోల్పోయెనను కథాఘట్టమును దలపింపఁ జేయుచున్నది. మణికంధరుఁడు రంభను గవయుట కాయింతి యాసమయమునఁ దాల్చిన యభినవరూపవిశేషమే కారణ మని సూరన స్పష్టముచేసి నాఁడు. మణికంధరుఁడు గంధర్వకుమారుఁడు. నారదునితోఁ గలిసి స్వర్గగమనాదుల కలవాటుపడినవాఁడు. రంభాదుల నాతఁడు చిన్ననాఁటినుండియు నెఱుఁగును. కాని యత నికి భూలోక వనితయైన కలభాషిణి చిత్తమున కెక్కినంతగా నాకవనిత లెక్కలేదు. కలభాషిణి సౌందర్యము నాకవనితల తలదన్నునది. నారదుఁడే యొకసారి—

"..........ఓయంబుజాక్షి !
రంభ మొదలైన యేయచ్చరలకు నైనఁ
దక్కవే ? నీదు రూపసౌందర్య మహిమ
లెక్కడే కాక ! మిగుల నూహించిచూడ"

అని యోగ్యతాపత్ర మొసంగియుండెను. రంభయు దేవేంద్రునితో "అతని (మణి కంధరుని) నీఁట మున్ను పరికించుచుండుదు మస్మదాదుల విలాసంబు లెవ్వియు నెన్నం డును సరకుఁగొని చూచినవాఁడు గాడు" అని తెల్పి యున్నది. దేవేంద్రదత్తమైన యధికరూపలావణ్యవిలాసముల వహించి రంభ మణికంధరుని గాంచియుండుటచే

నాతఁడు-కలభాషిణియం దిదివరలోఁ గాంచిన విలాసాదుల నామెయందుఁ గాంచి-యామెకు వశుఁ డయ్యెనని తెల్ల మగుచున్నది.

సరస్వతి భర్తయందు మక్కువగల్గియుండియు, స్వయంకల్పితకోపకారణముగా బ్రహ్మకు విముఖయై యుండి పతిముఖప్రతిబింబమును గాంచుచుండుటను బట్టిచూడ-కలభాషిణి ప్రథమప్రియుఁడైన మణికంధరునియందు మునిశాప భయముచే నైన వైముఖ్యమును గల్పించుకొని తద్రూపసామ్యము-ప్రతిబింబ భావము-గల్గిన నలకూబరు నియందు మరులుఁగొనిన కథాకల్పనమునకు మూలమగుననుట కాస్కారమేర్పడు చ్చున్నది. కలభాషిణి పలికిన యీ క్రిందిమాట లామె నలకూబరుని వలచుటకుఁ గల కారణమును స్పష్టమొనర్చుచున్నవి.

"...............నాదుచిత్తమో
మానితశీల! యంతట సమంచిత తావక రూపరేఖ చొ
ప్పేనొక కొంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్."

"శాపభయంబున నెఱయఁగఁ
నీపై కోరిక మరల్చి నిధిపతిసుతు నే
పాపపు వేళను జూచితి
నో! పరుసొబ గేను మఱి కనుంగొన గుఱిగాన్."

"శ్రీయుత మైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బారవైచి, త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని చాలఁ గృశించితి గాజుపూసకై
నాయవివేక మే మనుకొనం? దుదఁ దన్మణి యబ్బె నన్న న
త్యాయత తత్సమాగమసుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్."

పైసమన్వయము ననుసరించి సరస్వతీముఖప్రతిబింబము రంభాపాత్రకల్పనమునకును, చతుర్ముఖప్రతిబింబము నలకూబరపాత్రకల్పనమునకు కారణములైనట్లు స్పష్ట మగు చున్నది!

కళాపూర్ణుఁడు ధీరభావునిఁ గడుదూరముగాఁ దరిమి, తనను శరణు జొచ్చిన మదాశయుని సకుటుంబముగా దాను నొనరించి యూడిగములు సేయించుకొనుచుండె నని నలువ కథ చెప్పెను. అప్పలుకుల వాలకించి శారద చిలుకవైపు మోముఁ ద్రిప్పి, "ఆ కళాపూర్ణుఁడు మఱి యేమి యయ్యె? నతనికిఁ దల్లిదండ్రు లెవ్వ?" రని బ్రహ్మ నడుగు మని గఱపెను. ఆ చిలుకయు బ్రహ్మదేవుని నట్లు ప్రశ్నించెను. ఆజగద్గురుఁడు మఱల కథ ప్రారంభించి "అవ్వరవిలాసుఁడు అభినవకౌముది యను కాంతచే వరింప బడె ననియు, అతనికి సుముఖాసత్తి యనునది తండ్రి యనియు, మణిస్తంభుఁ డను వాఁడు తల్లి యనియు" నుడివెను కళాపూర్ణుని తల్లిదండ్రులను బేర్కొనుటలో నైన

లింగవ్యత్యయమును విని వాణి నవ్వి గ్రక్కునఁ గ్రమ్మఱి పతిని గౌఁగిలించి "ఔర ! యింతలో నెన్నితబ్బిబ్బులు ! దద్దరిల్లకుఁ" డని వీపుతట్టి మీదికథనుగూర్చి ప్రశ్నించెను. ఈఘట్టములో బ్రహ్మ కళాపూర్ణుని తల్లిదండ్రులను గల్పించి చెప్పునపుడు శోభనముఖ సామీప్యంబు కారణముగా తత్కాసారమధ్య మణిస్తంభగర్భమున నుదయించి యున్న సరస్వతీముఖ ప్రతిబింబమును గాంచుచు శోభనముఖసామీప్యమును సుముఖా సత్తిగను, మణిస్తంభమును మణిస్తంభునిగను భావించి చెప్పెను.

పింగళిసూరన కీకథాఘట్టము మాయారంభాకథాకల్పన కనువైన కొన్ని సూత్రముల నందించెను. పైఘట్టమునందలి సరస్వతీచతుర్ముఖుల ముఖబింబ ప్రతిబింబముల కదలికలను గమనించినచో నది స్పష్టము కాఁగలదు. ఆ కదలికలను ప్రధానముగా నీక్రిందివిధమునఁ బేర్కొనవచ్చును.

1. సరస్వతీముఖ ప్రతిబింబము చతుర్ముఖుని ముఖబింబమును గాంచుట–ఇది రంభ మణికంధరుని గూడుటను వ్యంజింపఁజేయుచున్నది.

2. సరస్వతీముఖబింబము చతుర్ముఖుని ముఖప్రతిబింబమును గాంచుట – ఇది కలభాషిణి మణిఁస్తంభుని సాయమున నలకూబరునిఁ గవయ యత్నించుటను వ్యంజింపఁ జేయును.

3. సరస్వతిచిలుకవైపు మరలుట–అప్పుడు సరస్వతీముఖబింబ ప్రతిబింబములు వైముఖ్యమును భజించుచుండును గావున– రంభ నలకూబరాసక్తమైన చిత్తముతో నతని నామోచ్చారణ మొనర్చి మణికంధరుని కప్రీతి కల్గించు కథార్థమును సూచించును.

4. సరస్వతి చిలుకతో మాటలాడి మణిస్తంభమువైపు మరలియుండుట-బ్రహ్మ శోభనముఖసామీప్యమును గమనించుట – శోభనముఖసామీప్యము మణికంధరునకైన కలభాషిణీసాన్నిహిత్యమును వ్యంజించుచున్నది. ముఖసామీప్యమును గమనించియు బ్రహ్మ సరస్వతీముఖప్రతిబింబమునందే రతి గల్గియుండుటచే గలభాషిణిని రంభాకృతిలో మణికంధరుడు పొందగలిగిన కథార్థము వ్యంగ్యము.

5. చిలుకమాట లాలించునెడ బ్రహ్మయొక్క ముఖబింబ ప్రతిబింబములు సరస్వతీ వీక్షణములకు వైముఖ్యమును భజించినవి– దానివలన కలభాషిణి విముఖుడైన నలకూబరుని (లేక నలకూబరవేషుని), రంభ విముఖుడైన మణికంధరుని (నలకూబర సదృశుని) బొందెడి కథాకల్పనలు ధ్వనింపబడుచున్నవి.

6. చతుర్ముఖుడు మఱల వాణీముఖప్రతిబింబమును గాంచుచు కథను కొనసాగించుట – దీనివలన రంభకు మణికంధరునియానుకూల్యము సిద్ధించు కల్పనము సూచింపబడుచున్నది.

7. సరస్వతి చతుర్ముఖునివైపు మఱలుట – దీనివలన మణిస్తంభబింబిత వాణి

ప్రతిబింబము చతుర్ముఖుని ముఖమును గాంచుట తొలఁగినది. అది రంభ మణికంధరుని త్యజించి నిజనలకూబరుని గూడెడు కథాకల్పనకు సూచకమగు చున్నది. వాణీముఖము చతుర్ముఖుని కున్ముఖ మగుట - కలభాషిణీ మణికంధరులు నిజాకృతులతో మృగేంద్రవాహన దేవాలయమునఁ గలసిన సన్నివేశమునకు వ్యంజక మగుచున్నది. ఇట్లు స్థూలముగా మాయారంభావృత్తాంత కథాకల్పనలకు బీజములు వాణీచతుర్ముఖుల బింబప్రతిబింబముల తత్కాలోచిత సంచలనములయందు పింగళిసూరన నిక్షేపించి యుండుట స్పష్టమగుచున్నది.

తనకు అభిముఖమైన భారతీకంఠమును శతానందు డధికసంభృతానందుడై కౌగిలించెను. ఏతత్పరిష్వంగము మృగేంద్రవాహనాలయమున గలసిన కలభాషిణీ మణికంధరులు పూర్వస్మృతిచర్వణ మొనర్చుటకు సంజ్ఞ.

నలువ భార్యాధరపానమహోత్సవమునఁ దేలుచు నొక్కమొగమున నామె నొక్కించుక పీడనము గావించెను. అందుల కాసతి పతి నదలించి "మదిం గొలది యెఱుంగ రెందు" నని కోపము నూపుచు గౌగిలి విడిపించుకొని నాథుని మోముల నిరుకేల బాయగఁబట్టెను. ఈ పరిష్వంగవిశ్లేషము మణికంధర కలభాషిణుల కాజన్మకింక సంయోగము లేదనుటను సూచించుచున్నది.

ఆపై నలువ దృక్కులు వాణీకుచంభములనుండి మధ్యప్రదేశమున కురికినవి. ఇయ్యది మణికంధరుని భృగునిపాతమును సూచించుచున్నది. ఆటుతరువాత దృష్టి సహితముగా నాదేవుని యాత్మ తిరిగి సఖీముఖమునకు వచ్చుటయు, దాన చుంబనేచ్ఛ మగుడఁ బరితుష్టినొందుటయు నది ముఖపానముచేత సఫల మగుటయు పరికింప నుత్తరజన్మమున కళాపూర్ణుడుగా జన్మించిన మణికంధరుడు మధురలాలసగా జన్మించిన కలభాషిణియందు బద్ధానురాగుడయి, వివాహమాడి సుఖంబుండెనను కథాకల్పనకు మూలమగుచున్నది.

ఇట్లు కలభాషిణీ వృత్తాంతమునందలి ప్రధానపాత్రలగు కలభాషిణీమణికంధరులు, రంభానలకూబరులు, మణిస్తంభుఁడు మొదలగు వారిని కల్పించి కథాసన్నివేశములను గూర్చుటకు - మూలకథయైన వాణీచతుర్ముఖుల కేళీవిలాసఘట్టమే యాధారమగుట యాశ్చర్యకరమైన విశేషము.

సరస్వతి స్వయముగా గల్పించుకొనిన పతివైముఖ్యమునకు ప్రాతినిధ్యమిచ్చెడి తలంపుతో సూరన కలభాషిణి కథలో నారదపాత్ర కల్పనము జేసినట్లున్నాడు! ప్రధానకథలో సర్వతి కోపోద్రిక్తయై 'రంభ యనునది యిప్పు డెందు బోయె? దానికిఁ దగిన బుద్ధి చెప్పవలయు' (5 ఆ. 70 వ.) నన్నవాక్కు దబ్బర గాకుండ నారదునిమూలమున కలభాషిణీ జన్మకాలమున రంభకు తగిన బుద్ధిచెప్పుట జరిగినది. అందువలననే రంభ కలభాషిణికథకుమాత్రమే పరిమితమైనపాత్ర. నలకూబరుడు రంభ ననుసరించు వాడు కావున అతడును అంతియే.

ఇక కలభాషిణీ జన్మవృత్తాంతమున శ్రోతృజనాపేక్షానుసారముగా, బెరిగిన యుపాఖ్యానములు గలవు అవి: నారదతుంబుర కలహోదంతము; నాకవాసి యగు శుకమునుగూర్చిన కథ; సుగాత్రీశాలీనుల యుపాఖ్యానము; మణికంధర తీర్థయాత్రాది వర్ణనము మొదలైనవి.

కళాపూర్ణోదయకావ్యము కమనీయ కథాకల్పనకు కల్పలతిక. మూడు జన్మల గాథను ముడివైచి పూర్వాపర వైరుధ్యము లేకుండ కథ నల్లిన సూరన ప్రతిభ యనన్య సామాన్యము అందలి సరస్వతీచతుర్ముఖుల కేళీకథాకల్పనమే యొక యపూర్వశిల్పము. అందు వాచ్యముగా దోచెడి కథ కళాపూర్ణుని వృత్తముకాగా, వ్యంగ్యముగా స్ఫురించెడిది కలభాషిణీవృత్తాంత మగుచున్నది. వాణీచతుర్ముఖ బింబప్రతిబింబ సంచలన వీక్షణ చేష్టావిశేషములను సైతము వృథా కాకుండ కథాకల్పనలో నంగము లగునట్లు సార్థక్యమును సాధించుట సూరనప్రతిభకే చెల్లినది.

## కథాసంవిధాన నైపుణ్యము :

ఎనిమిదాశ్వాసముల కళాపూర్ణోదయ ప్రబంధము నిబిడమైన కథతో నిండారిన గ్రంథము. కాలక్రమ పద్ధతి ననుసరించినచో సరస్వతీ చతుర్ముఖుల ప్రణయకేళి వృత్తాంతము ముందు చెప్పి, ఆపై కలభాషిణి కథ, ఆతరువాత కళాపూర్ణునికథ చెప్పవలెను. కాని, పింగళి సూరన కార్యకారణ పద్ధతి ననుసరించి కథను నిర్మించెను. ఇట్లు కథ చెప్పుట కితడే ఆద్యుడు. ఇతని కథనము ననుసరించి క్రమముగా కలభాషిణికథ, నారద గానమాత్సర్యము, మణికంధరుని కథ, తబ్బిబ్బుల ప్రహసనము, సుగాత్రీ శాలీనుల కథ, సరస్వతీ చతుర్ముఖుల ప్రణయకేళి, కళాపూర్ణోదయము, స్వభావుని కథ, అభినవ కౌముదీ వృత్తాంతము, మదాశయుని కథ, మధురలాలసా కళాపూర్ణుల వృత్తాంతము, అలఘువ్రతుని కథ, సత్వదాత్ముని కథ, లక్ష్మీనారాయణ సంవాదము- అను కథలు చెప్పబడిన వని స్థూలముగా పేర్కొనవచ్చును కాని, ఈ కథలన్నియు కాల క్రమము ననుసరించి చెప్పబడక ఫ్లాష్‌బాక్ పద్ధతి ననుసరించియు, కార్యకారణ సంబంధము ననుసరించియు నడుపబడినవి. ఒక కథను ఒకరే చెప్పవలెననిగాని, ఒక చోటనే చెప్పవలెననిగాని ఒకే పద్ధతి ననుసరించి చెప్పవలెననిగాని నియమము లేకుండుటచే కథాకథన శిల్పమున నెన్ని శిల్పమార్గము లున్నవో అవి యన్నియు ప్రయోగింపబడి ప్రయోజనాత్మకమైన వైవిధ్యము సంతరింపబడినది. పఠితకు ఉత్కంఠ కలిగించుట సూరన కథాసంవిధాన శిల్పరహస్యము.

సూరన శ్రవ్యకావ్య నిర్మాణమున దృశ్యకావ్యరచనా శిల్పమును ప్రవేశపెట్టి నిర్వహించుట విశేషములలో విశేషము. ఈ కావ్యమునందలి కథయంతయు నైదురంగములలో నాట్యమాడినది. అవి: ద్వారకానగరము, మృగేంద్రవాహనా దేవాలయము, శ్రీశైలపర్వత శిఖరము. సత్యలోకము, క్రమకకంఠోత్తరపురము. ద్వారకానగర ఘట్ట మీకథా రూపకమునకు ప్రథమరంగము. నాటకమున ప్రథమరంగమున కథాబీజ

నిక్షేపము కావలెను. ప్రథమాంక నిర్వహణము రూపకకర్త ప్రతిభకు ప్రత్యక్షపరీక్ష. కథార్థ సూచనలచే భావికథావస్తువును ధ్వనింపజేయు రచనాశిల్పము నచ్చట వెలార్ప వలెను. ప్రధానపాత్రల పరిచయముగాని, సూచనముగాని చేయవలెను. సర్వకథాప్రగతికి ప్రాతిపదికయైన ప్రాణము నందు ప్రతిష్ఠాపింపవలెను. సూరన అట్టి శిల్పమున సిద్ధహస్తుడు. ఇతడు వ్రాసినది కావ్యమా నాటకమా అను అబ్బురపాటు కల్గించునట్లు కథా ముఖమును నిర్వహించినాడు.

కథానాయిక యైన కలభాషిణి తూగుటుయ్యాల లూగుచున్నట్లు ప్రథమాశ్వాసమున రంగము ప్రత్యక్షమైనది. ఊయల తూగువలెనే కథాసంవిధానము వెనుకముందుల కూగుచుండునను ధ్వనియేమో! నీలాకాశ మను యవనిక రంగము వెనుక శోభిల్లుచున్నది. నారదమణికంధరులు గగనవీథిలో ప్రవేశించినారు. వారిరువురు గురుశిష్యులు. శిష్యుడు కవి. మగువల మనోజ్ఞ సౌందర్యము వీక్షించినాడు. అతని నోట రమణీయార్థ ప్రతిపాదక శబ్దము ఛందోమార్గమున సాక్షాత్కరించినది.

"తమిఁబూఁ దీ గెలఁ దూగుటుయ్యేలలఁ బంతాలాడుచుం దూఁగు నా
కొమరుల బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చను దెంచు తీవిఁ గనఁగొంటే దివ్యమౌనీంద్ర ! నా
కమ్మృగీ నేత్రలమీఁద గయ్యమునకుం గాల్ సాఁచులా గొప్పెడున్."

ఆజన్మబ్రహ్మచారియైన నారదమునీంద్రుడు డాప్రశంసలోని అంతరార్థము నూహించి శిష్యుని వారించుటకు బదులు ప్రశంసించుటయే కాదు, తానును భట్టువలె కీర్తించినాడు.

"బళిరా! సత్కవి వౌదు నిక్కము! తగన్ భావించి నీ వన్న యా
యెలప్రాయంపు మిటారికత్తెలబెడం గే నెందునుం గాన, వా
రల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యౌ
దలఁ దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి? యొప్పె యగున్."

'నానృషిః కురుతే కావ్య'మ్మని కదా న్యాయము శిష్యుడు కవి; గురువు ఋషి. ఒకనిది కవివాక్కు; మఱియొకనిది ఋషియైన కవివాక్కు. లౌకికులైన సాధువుల శబ్దములు అర్థములవెంట పరుగెత్తును. ఆద్యులైన ఋషుల వాక్యముల వెంట అర్థము ననుసరించునని కదా భవభూతి నిర్దేశము. మణికంధరుని నోట అనుద్దిష్టముగా భావికథార్థ సూచనమైనది. మహర్షినోట అవితథముగా నది ప్రవర్తిల్లునని ధ్రువపడినది. కలభాషిణీ రంభల కలహమునకు బీజావాపన మైనది.

వెనువెంటనే మొగులమఱు గను తెరను చిమ్ముకొని రంభానలకూబరుల విమానము రంగమున ప్రవేశించినది. కలభాషిణీ ప్రశంస రంభకు రోషము తెప్పించినది. సౌందర్యగర్వము కన్నుగప్పిన ఆ నాకసుందరి కలహభోజనునితో నధిక్షేపము లాడినది.

"ఊహ యొనర్పరో యతిశయోక్తుల వర్ణనలందు నిట్టి య
వ్యాహతి చెల్లునంచునొ యిటాడితి ? రింతయకాక, యేవరా
రోహలు మమ్ముఁ బోలమికి రూఢిగ నిమ్మెయి నున్న యీ జగ
న్మోహనమూర్తి యర్థపతిముద్దుకుమారుడె సాక్షి" నావుడున్—

నారదుని నాలుకపై నాందిపల్కిన నాటకమునకు ప్రస్తావన ప్రారంభించినది రంభ—

ఉ. "అల్లన నవుచున్ ముని సురాంగనఁ జూచి 'యెటాడు కొన్ననుం
జెల్లుఁ గదమ్మ నీకుఁ గడుఁ జెల్వుఁడు నిబ్బరమైన ప్రేమ రా
జిల్లఁగ నిట్లు వర్తిల్లుటఁ జేసి మృగేక్షణ, యైన నిట్లు రా
వెల్లదినంబులున్, సవతి యేగతిఁ గల్గునొ మీఁదు గంటివే ?"

క. "నినుఁ బోలు వనిత నీకును
వనజముఖీ ! యతనిఁ బోలువాఁ డితనికి నెం
దును గల్గి కలచునో ? యి
ట్టి నిగాఢపు ముదముసొంపు లీవులు చనునే ?"

నారదుని వాక్కులలో భావిరంగము సూచ్యార్థమైనది; కాని, ఆ రంభారూపధారిణి ఎవరు ? నలకూబరరూపధారుఁ డెవఁడు అను ఉత్కంఠ మిగిలినది. నారదుడు సూత్రధారుడై కథా సూత్రము చేపట్టినాడు. పాత్రల నాయత పఱచుటకు ఉపక్రమించినాడు. కథకు వేడితో పాటు వేగము వచ్చినది. కలభాషిణి ఎదుట కలహాభోజను డన్నమాట యిది—

"సవతి యన నింక నొకతెన్
భువి లోపల వేఱ వెదుకఁ బోవలయునె యో
ధవళాక్షి ? నీవ కానే
రవె ? దైవనియుక్తిఁ గొంత ప్రాప్తి గలిగినన్"

కలభాషిణి రంభకు సవతి యగు నను మాట తెలిసినది కాని ఎట్లగునన్న ఉత్కంఠ మిగిలినది. శతపత్రదళ మొక్కొక్క రేకు విచ్చుచున్నట్లున్నది కథలోని ప్రతి వాక్యము. మణికంధర కవితాప్రశంస వచ్చినది, కలభాషిణి ఆతని శ్రీకృష్ణ దండకము వినిపించినది. మణిహారము ప్రసక్తి తోచినది. కలభాషిణీ మణికంధరుల ఆంతర్య మేమిటో భావికథా ప్రగతిలో పఠిత ప్రతీక్షకు మిగిలి పోయినది. మణిహార మీకథాసూత్ర మను సత్యమున కిచ్చుట వ్యంగ్యబీజము నాటబడినది.

అంతలో కలభాషిణి కళాపూర్ణుని ప్రశంస తెచ్చినది. ఆమె దానిని రంభానలకూబరుల సంభాషణము నుండి గ్రహించినది. నలకూబరునిపై వలపు నారదమునిని

దర్శింపక పూర్వమే కలభాషిణి హృదయమున మొలకెత్తినది. అలు మగనికి చెప్పరాని అకళాపూర్ణుని సుద్దిలోని అంతర్యమామె కోరినది. అదియే వారిద్దరి నెడము చేయు హేతువైనచో తా నా రహస్యమును పొంది లాభపడవలెనని ఆమె యుద్దేశము. నారదుడు దివ్యదృష్టి సారించినాడు. "ఆరంభ ప్రియునకుఁ జెప్పరాదనినకథ యత్యపూర్వంబు ; నాకునుం జెప్పఁ దగ" దని పలికినాడు. ఆకథ నిజముగా అప్పుడు చెప్ప రాదు. చెప్పినచో కథలో బిగువులేదు. కథనములో కళ లేదు. కలభాషిణితో పాటు పఠితకు పట్టరాని ఉత్కంఠ కలిగించినది ఈమాట. చెప్పని కారణము వినినచో మనము విస్తుపోయెదము.

"ఆ కథ లిఁకఁ జెప్పినట్టివారును, విని
నట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్రాది బహు సంతతిని దన
ర్చుచుఁ జిరకాలంబు ప్రచుర సంప
దభివృద్ధిశోభిత శుభసౌఖ్యములు గాంతు
రను మాట యున్నది."

ఇది కళాపూర్ణుని కథవినినచో కలిగెడు ఫలము. ఈ ఫలము భూలోక వాసులకు భాగ్య దాయకము, సురలోక వాసులకు శాపసదృశము. మనకు వినవలయు నని యున్నను రంభానారదులు చెప్పరు. విప్పని ఈ ముడి కథను చివరిదాక మనచే చదివించును. అంతకంటె అద్యంకమున ఆశించు శిల్పమేమి యుండుఁ ? పథమాశ్వాసము ప్రథమ రంగము వంటిది. నిర్వహణాంకమునకు కావలసిన ప్రాతిపదిక లన్నియు ప్రతిపాదిత ములైనవి. ప్రధానపాత్రలు పరిచయమైనవి. ఇట్లే ఈకావ్యమున ప్రతి ఆశ్వాసము పూర్వకథకు పురోగతి హేతువు; భావికథకు వ్యంగ్యార్థసేతువు.

ఈ ప్రబంధమునందలి ముఖ్యపాత్రలకు కళాపూర్ణత్వము సాధించు లక్ష్యముండుట యొక విశేషము. శ్రీకృష్ణుడు, అతని భార్యలు, వాణీచతుర్ముఖులు సర్వకళా పూర్ణసిద్ధి కలిగిన పరిపూర్ణపాత్రలు. నారదుడు గాంధర్వ గానకళాపూర్ణు డగుటకు శ్రీకృష్ణుని సేవించి కృతార్థుడైనాడు. కలభాషిణీ మణికంధరు లాతని నాశ్రయించి గాన విద్యాకళాపూర్ణులైనారు. వీరి ప్రయత్నము లన్నియు ఒక యెత్తు. మణిస్తంభుని యత్నము మఱియొక యెత్తు. మృగేంద్రవాహన దేవాలయ కల్పన మీకావ్యమున ఒక విచిత్ర సృష్టి. మానవు డాశించు సర్వసిద్ధు లిచ్చట సాహసకార్యములచే సిద్ధించును. ఆ దేవాలయమున రెండేళ్ళు జితేంద్రియత్వముతో తపస్సుచేసిన కోరిన కోర్కెలు సిద్ధించును. గోరుగంట కన్నులు పొడుచుకొనినచో దూరదర్శన శక్తి లభించును. నారసము చెవులలో జొనుపుకొనినచో దూరశ్రవణశక్తి అలవడును. సురియతో నాలుక కోసికొనినచో అద్భుతకవిత్వశక్తి సిద్ధించును. గండకత్తెరతో తల నుత్తరించుకొనినచో ఆ తల మరల అదుకుకొని జీవించుటయేకాక తనను చంప యత్నించు వానిని

చంపు శక్తి యేర్పడును. రూపమునను, గానమునను సాటిలేని వారవధూటి నాదేవికి బలి యిచ్చినచో రాజ్యసంపద కలుగును. వృద్ధు లచ్చట దేహము చాలించినచో వారికి వెంటనే యౌవనరూపసిద్ధి యగుటయేకాక, వారు తలచిన కోరికలు నెరవేరును. మణి కంధరుడు స్వభావసిద్ధుని వలన సింహవాహన కరవాలాదులను, వయస్స్తంభనమును పొందియు, ఈసిద్ధుల నన్నింటిని యత్నించి సర్వసిద్ధిపూర్ణుడగుటకు యత్నించెను. మణి కంధరుడు కవితాకళాసిద్ధి వడసెను. సుముఖాసత్తి యౌవనరూవసిద్ధిని గాంచెను. ఇట్లన్ని పాత్రలు ఏదియో ఒక నెపమున ఈ దేవాలయమున తమ కోర్కెలను సాధించి నవే. చివరకు శల్యాసురుడు కూడ గండకత్తెరతో తల నుత్తరించుకొనినవాడే. మానవాతీత శక్తులు అత్యంత సాహసము కలవారికి సిద్ధించునను ఒక ఆశయమున కీ మృగేంద్రవాహన దేవాలయము రూపకల్పనము. సర్వకళాపూర్ణత్వమునకు సాధన మెంత ముఖ్యమో సాహసమంత అవసరమని కాబోలు పింగళి సూరన భావము.

పింగళి సూరన కల్పించిన పాత్రలలో కలభాషిణి విచిత్ర సృష్టి. ఆమె వేశ్య. వేశ్యను నాయికగా సృష్టించుట కావ్యలక్షణ సమ్మతము కాదు. దానికి కారణము ఆమె కులీన కాదనియు, ఆదర్శపాత్ర కాదనియు. ఉత్తమత్వమునకు కులీనత్వము కారణము కావలసిన అక్కరలేదని సూరన అభిమతము. ఆమె ఒకనిని మనసులో వలచినది. ఆ వలపు ప్రళయము కలిగించునని మనసు మరలించుకొనినది. మణికంధరుని రూపు నలకూబరునియందు గాంచి యతని పొందుకోరినది. కాని, తాను మున్ను వలచిన వానినే నలకూబరాకారమున పొందినది. ఇట్టి వికారము ఆమె శీలముపై పరితకు వెగటు కలుగు నట్లుకాక సానుభూతి కలుగునట్లు చిత్రింపబడినది. ఆమె కోరునది కామతృప్తి వలె మనకు కనుపట్టదు, రూపానుభూతివలె తోచును. ఆమె అలౌకి నంద చైతన్యమును లౌకికముగా నందుకొనుటకు యత్నించిన కళాకారిణిగా కనుపట్టును. అట్టి ప్రవృత్తిని భావించుట ఎంత కష్టమో దానిని ముమ్మూర్తుల చిత్రించుట అంత విశిష్టము. అందువల ననే కలభాషిణి అమరముగా నిలిచిన ఆంధ్ర ప్రబంధ పాత్రలలో ఒకటి.

పింగళి సూరన ప్రతిభ అపూర్వపాత్ర చిత్రణమున ప్రఖ్యాతి గాంచినది. అట్టి విఖ్యాతికి కారకములైన పాత్రలలో సుగాత్రీశాలీనులు ఎన్నదగినవారు. శాలీనుడు సిగ్గరి యైన ఇల్లరికపు టల్లుడుగా, సాహసికుడైన సిద్ధుడుగా జీవితమును సాగించినవాడు. కామము అతజీవితములోని అంతస్సూత్రము. అతని వింతప్రకృతిలో అది చిత్ర విచిత్రముగా వెలికి వచ్చినది. అతనికి ముగ్ధమైన గ్రామిక జానపద స్త్రీ శృంగారముపై ప్రీతి. అది యొక చెరిగిపోని ముద్రవైచినది అతని చిత్తవృత్తియందు. భార్య సాలం కారయై సాక్షాత్కరించినచో సౌముఖ్యము చూపింపడు. నిరలంకారయై నిద్దమైన యం దము క్రుమ్మరించినచో అతనికి మన్మథోద్దీపనము కలుగును. పడకగదిలో ప్రసన్నుడు గాని ఆ పెండ్లికొడుకు తోట పనిలో సాయముచేయు జవరాలిని కౌగిట చేర్చినాడు. అతని మనసునకు నచ్చిన మగువ యంద మిది—

సీ. "తోరంపుఁ జనుదోయి త్రుళ్ళింతల నిడంగఁ
దగుచోట్లు గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి;
వ్రేఁగైన పిఱుఁదు బల్విడిఁ జలింపంగను
వడి నిట్టు నట్టును నడచి నడచి;
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్ళకు మడవలు మార్చి మార్చి;
నడుము లేఁదేవియ నకనకల్ గుడువ, నిం
పునఁ దగు మోపుల మోసిమోసి,

చిఱుచెమటఁ బేర్చు వింత క్రొమ్మెఱుఁగుతోడఁ
గొమరు మే నొప్ప, సారెకుఁ గొప్పు కదల
నేమిటికినైనఁ దా మున్న యేఁగి యేఁగి
యెల్ల పనులు నొనర్చె నింపెసఁగ మెసఁగ. 4.98

కలభాషిణి వలె ఇతడు రూపానుభూతిని వాంఛించువాడే కాని అది జీవితమున నిత్యమై భాసింపవలె ననెడి అకాంక్ష కలవాడు. యౌవనము నశ్వరమైన దని అతనికి తెలియును. ఆ నశ్వరత్వ మతడు సహింపలేడు ఇది యొక వింతయైన కామన. తనభార్య అమృతము సేవించియో; సిద్ధరసము సాధించియో కౌమరుంబ్రాయమున దినమున కొక క్రొత్తకళ నీనుచు కౌమరొందవలె నని ఆతనికోరిక. వనితకు గర్భమైనచో వయసు వాడిపోవు నని అతనిభయము. 'ఒక కాన్పుతరువాత ఒడ్డెనానికికూడ కొరగాదను' మోటుసామెత కలదుకదా! వాణి నందువలననే అత డొక వింతవర మడిగితి నని భార్యకు చెప్పినాడు.

"అనిశము నీదు యౌవనశుభాకృతిఁ గౌఁగిటఁజేర్చు వేడుకన్
దనియమిఁజేసి వేడితిని దక్కక నీకును గర్భ మెన్నఁడున్
జనితము కాకయుండ, నల శారదఁ బూజ యొనర్చువేళ; వా
రనికృప నట్ల యిచ్చితి వరం బని యాయమ పల్కె నత్తఱిన్". 4.165

దీనికి ప్రతిగా ఆతనిసతి "నాదు సంగమమున నా నాధునకు నందనుడు గలుగవలె" నని వాణిని వరము కోరినది. ఆసంగతి తెలియగనే అతడు క్రుద్ధుడై శతతాళదఘ్న హ్రదమున బడినాడు. అంత అభిమాన మతనికి.

అతడు భార్యయం దాశించిన సిద్ధి అతనికి లభించినది; అతడు మణిస్తంభుడైనాడు. మృగేంద్రవాహన దయవలన సుముఖాసత్తిగా పేరందిన సుగాత్రి నవయౌవన విలాసములను పొందినది. అతని కొక వింతకామము మఱల జనించినది—అతడు స్త్రీ కావలె నని, అతనిభార్య పురుషుడు కావలెనని. స్త్రీ పొందెడి రతిసౌఖ్యము నెఱుగవలెనని.

"అదియును గాక, యంగనల కంగజ సంగర కేళికా విశే
షదశలయందు నెక్కుడఁట సౌఖ్యగతుల్ మగవారికంటె: నా
కిదియు నెఱింగికో నిపు డభీష్టము; గావున, నిట్ల యుండఁ గో
రెద నొక కొన్నినాళ్ళు; విహరింపుము నీవును బూరుషాకృతిన్." 5.106

అని తాను వనితగా మారి భర్తయైన భార్యతో కాపురము చేసినాడు. మణిస్తంభుని సంశయము కామసూత్రములలో విపులముగా చర్చించబడిన ఒక వింతసమస్య. స్త్రీ పురుషులలో నెవ్వరికిని దాని సమగ్ర కళానుభూతిలేదు. స్త్రీ పురుష రూపద్వయధారికి ఆ సమస్య సమన్వయించును. తత్సిద్ధికి తార్క్షణము మణిస్తంభుని మనోరథసిద్ధి. శృంగారమునకును కామశాస్త్రమునకును దగ్గరిసంబంధము కలదు. ఒకటి కళ, మరి యొకటి శాస్త్రము. శాస్త్రవ్యుత్పత్తిని కళామయముగా చిత్రించుటకు కావ్య మొక సాధనము. దానిని పింగళ సూరన సాధించెను. సూరన వ్యక్తిత్వము ప్రతిబింబించిన పాత్రయని ప్రశంస పొందిన శుచిముఖి వజ్రనాభునియెదుట షట్‌శాస్త్ర పాండిత్యముతో పాటు—

"కావ్య నాటకాలంకార గాన మదన
శాస్త్ర పరిచయ మహిమంబు జాలపాద
భామినీమణి నెఱపె నుద్దామపటిమ
నా యసురభర్త మెచ్చి పురే యనంగ"

అని సూరన వ్రాసినాడు. మనుశాస్త్రముతోపాటు మదనశాస్త్రమునకు కూడ ప్రబంధ కాలములో అంత ప్రాధాన్య మున్నదని కాబోలు కవిసూచన. పైచెప్పిన శాస్త్రమర్యాద లన్నియు కళాపూర్ణోదయమున పింగళిసూరన రసానుగుణముగా ప్రదర్శించినాడు. చిట్ట చివరకు కళాపూర్ణునిచేత ఇద్దరుభార్యలకు మ్రొక్కించి శ్రీకృష్ణునికంటె నాతనిని రసికుని గావించినాడు.

కళాపూర్ణోదయమునందలి శృంగార రసపోషణ శిల్పమును వివరించిన ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి వాక్యములు స్మరింపదగినవి—

"ఈ కావ్యమున వెల్లివిరియు శృంగార రసప్రవాహము సత్యలోకమునం దుద్భ వించి గంధర్వలోకము గుండ మర్త్యలోకమున కవతరించు చున్నది. భూ స్వభావమును బట్టి భూమిపై ప్రవహించు జలము లగుణము మారునట్లే ఆ శృంగారము మూడులోక ములలో మూడురూపములు తాల్చెను. అందు ప్రథమరంగమైన సత్యలోకమున దాని స్వరూపము కామవాసన లేని దివ్యలీల. సరస్వతీ చతుర్ముఖుల విలాసలీలయే ఈ విశ్వ సృష్టికి ప్రభవ కారణము. సత్యలోకమునుండి ప్రవహించు ఆ రసప్రవాహము మధ్యే మార్గమున రెండవ రంగస్థలమైన గంధర్వలోకమున తాల్చు రూపమునకు గాంధర్వ ప్రణయ మని పేరు. ఈ కథలో కలభాషిణీ మణికంధరుల శృంగారము ఏతత్ ప్రణయ

స్వరూపము. గంధర్వలోకమునుండి మర్త్యలోకమునకు అవతరించునప్పటి ఈ రస వాహిని సహధర్మచర్యము అనెడి రూపము తాల్చును. ఇదియే కావ్యములోని సుగాత్రీ శాలీనుల దాంపత్య శృంగారము. అయెడ 'ప్రజాయై గృహమేధినః' అన్ననూక్తితప్ప మరేమియు వర్తింపదు. గార్హస్థ్య నిర్వహణమునకు, దాంపత్య సిద్ధికి పాతివ్రత్యము ఆధారము. మూర్తిమంతమైన పాతివ్రత్యమే ఈ కథలోని సుగాత్రి."

" ఈ ప్రవాహము అంతటితో నాగక మానవలోకమునుండి అధోలోకమున గూడ ప్రవహించి కామము అను పేరు తాల్చును. దానిని కామ మనుటకంటె తుచ్ఛకామ మనుట మరియు మంచిది. అననురక్తయైన యువతిని బలాత్కరింప నెంచు రాక్షస స్వభావుడు దానికి ఆలంబనము. ఈ కథలో అభినవకౌముదిని బలాత్కరింపనెంచి వెంటబడిన శల్యాసురుని వృత్తాంతము ఇందుకు నిదర్శనము. ఈ నాల్గు శృంగారగతు లకు క్రమముగా......దివ్యము, గాంధర్వము, మానవము, రాక్షసము అని పేర్లు పెట్ట వచ్చును".

—తెలుగు విజ్ఞాన సర్వస్వము.

కళాపూర్ణోదయము ఆధునికాంధ్ర విమర్శసాహిత్యమున నొక ఉజ్జ్వలాధ్యాయ మును సృష్టించినది. డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వ తత్త్వవిచారము నందు పింగళిసూరన ప్రతిభాసామర్థ్యములను తెలుగువారికి మొదటిసారి ప్రపంచించి సాహిత్య విమర్శపద్ధతిలో కావ్యతత్త్వము నాస్వాదించు నూత్నవిధానము నావిష్క రించి, పాశ్చాత్య కావ్య విమర్శపద్ధతిలో నీ కావ్యమును విమర్శించి గుణదోష విచా రము కావించిరి. అది తెలుగువారికొక కనువిప్పైనది. కళాపూర్ణోదయము ఒక మహా కావ్యముగా పండితలోకము మన్నించినది. వారి విమర్శలో కానవచ్చు ప్రాచ్యసిద్ధాంత నిరసనము కొందరికి నిరుత్సాహము కల్పించినమాట నిజమైనను ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంత సమన్వయదృష్టి కది బాటలు వైచినది. అట్టి మార్గమున నడిచి డా. జి. వి. కృష్ణారావుగారు కళాపూర్ణోదయ కావ్యప్రాశస్త్యమును నిరూపించు గొప్ప విమర్శ గ్రంథము రచించినారు. అది 'Studies in Kalapurnodayam'. అందు వారు పింగళసూరన విశిష్టాద్వైత సిద్ధాంతము ననుసరించి సమగ్ర కావ్యకళావిష్కార సిద్ధాం తమును తన కావ్యమున ప్రవచించె నని ప్రతిపాదించినారు. పూర్వ విమర్శలకు సమా ధానము లిచ్చినారు. ఈ కావ్యము పై, కవిపై నింక నెన్నియో వ్యాసములు, గ్రంథ ములు, పీఠికలు పలువురు పండితులు రచించిరి. నేను 'కలభాషిణీ కథాకల్పనలకు వాణీ చతుర్ముఖుల ప్రణయకేళిలో వ్యంగ్యముగా బీజములు కల'వని ఒక నూత్న సమ న్వయ సిద్ధాంతమును ప్రతిపాదించితిని. కళాపూర్ణోదయ కావ్యతత్త్వమును చెప్ప బూనుట సముద్రమున కేతము పట్టుట. సమకాలీనకవులు మెచ్చని ఈ కృతిని ఆధునికు లాదరించుట సాహిత్య దృక్పథములోనే వచ్చిన మార్పుని చెప్పకతప్పదు.

ప్రాచీనులు పద్యవిద్యకును, కవితాశైలికిని, శాస్త్రపాండిత్యమునకును ఇచ్చి నంత ప్రాముఖ్యము కావ్యరచనా శిల్పముల కిచ్చియుండలేదు. ధ్వనిమార్గము త్తమమని చెప్పుచునే ఆలంకారికపద్ధతిని ప్రాచీనులు వెలయించిరి. ఆధునికులకు ఆనందవర్ధనుని

మార్గము ఆదరపాత్రము. శబ్దచర్చలకంటె శిల్పచర్చలు, లక్షణైక దృష్టికంటె విలక్షణతను వెలికితీయు వివేకము, గతానుగతికమైన ప్రక్రియకంటె కాలగతి కెదురు నిలిచిన నూత్నప్రయోగములు నవ్యులకు నచ్చిన సాహిత్యమార్గములు. శబ్దరత్నాకరకర్త పింగళి సూరన ద్వితీయశ్రేణి కవి వర్గములో చేర్చినను ఆంధ్రకావ్యవిమర్శకులు నేడు అతనిని అగ్రశ్రేణి కవిగా ఆదరించి గౌరవించుచున్నారు.

"ఏగతి రచియించిరేని సమకాలమువారలుమెచ్చరేకదా!" అనినసూక్తి సూరనకు తప్పలేదు. వారిని మెప్పించుటకొఱకై వ్రాసిన ప్రబంధము ప్రభావతీ ప్రద్యుమ్నము. ఐదాశ్వాసముల ఆ ప్రబంధము నాటకీయత నందగించుకొనిన ఆంధ్ర ప్రబంధములలో నొకటి. హరివంశమునందలి వజ్రనాభ వృత్తాంతమును, 12 వ శతాబ్దమున రవివర్మ రచించిన ప్రద్యుమ్నాభ్యుదయమను సంస్కృత నాటకమును ఆధారముగా గొని వాని లోని లోపములను సమరించి నూత్నకల్పనలతో రసవత్తరమైన యీ ప్రబంధమును సూరన రచించెను. ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయము, చంద్రమతీ గుణవతుల వివాహము, చిలుకదౌత్యము, శుచిముఖి సామర్థ్యము, భద్రనటుని రంగ ప్రయోగము ఈ కావ్యకథలోని జీవభూతములైన కథార్థములు. శుచిముఖి అంచలేమ యైనను కథా సూత్రములను ధరించిన చైతన్యమూర్తి. ఆంధ్రప్రబంధములలో ప్రజ్ఞా ధురీణలైన స్త్రీ పాత్రలలో శుచిముఖి శిరోమణి.

పింగళి సూరన స్త్రీ పాత్ర సృష్టిని గూర్చి ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగా రిట్లు వ్యాఖ్యానించిరి— "ఈ రెండు గ్రంథములలో సృజింపబడిన నానావిధ స్త్రీ పాత్రలు భిన్నభిన్న ప్రకృతులతో, భిన్నభిన్న మూర్తులతో ప్రాణవంతములై వెలుగొందుచుండుటయే కాక, విశ్వప్రకృతికివలె ఈ కావ్యప్రకృతికిని స్త్రీ ప్రాణియే చోదకశక్తియని నిరూపించు చుండును. స్త్రీపాత్ర నిర్మాణములో ఈ కవికి సాటిరాగల తెలుగుకవి లేడు. ఈయన సృష్టించిన స్త్రీపాత్రసమూహము నంతను సూక్ష్మముగా పరిశీలించినచో వానిలో కొన్ని ప్రేమమూర్తులుగా, కొన్ని ప్రజ్ఞామూర్తులుగా స్థూలముగా వర్గీకరింప దగి యున్నవి. కలభాషిణి, సుగాత్రి, మధురలాలస మొదటి వర్గమునకు దృష్టాంతము. ఇట్లనుట ఆ ప్రేమమూర్తులు ప్రజ్ఞాశూన్యులని కాని, ఈ ప్రజ్ఞా మూర్తులు ప్రేమశూన్యులని కాని నిర్ణయించుట కాదు. గుణప్రాధాన్యమును బట్టి రెండు విభాగములని అంగీకరించుట. ప్రతియోగఘటనచే పాత్రల గుణస్వభావ తారతమ్యమును ప్రస్ఫుట మొనర్చుట కృతహస్తులైన మహాకవులు పాటించు కళాధర్మములలో నొకటి."

"ఈయన రెండు కావ్యములలో ఇంచుమించు ప్రధానపాత్రల కన్నింటికిని ప్రతియోగ పాత్రలు కలవు. కలభాషిణికి రంభయు, మణికంధరునకు నలకూబరుడును, నారదునకు తుంబురుడును, అభినవకౌముదికి మధురలాలసయు, శుచిముఖికి రాగవల్లరియు ప్రతియోగ సన్నివేశములైన పాత్రలు. ఈ జంటలలో ఒకటి రెండవ దానిని అతిక్రమింపజూచు స్పర్ధ వాని తారతమ్యమును ప్రస్ఫుట మొనర్చుటయేకాక కథాగ

మనమునకు వేగమును, బలమును చేకూర్చుచుండును. సూరన ఈశిల్ప సూత్రమును పాత్రచిత్రణమునందే కాక, రూపచిత్రణమునందును కొని యాడెను." (తెలుగు విజ్ఞాన సర్వస్వము).

విమర్శకులలో కొందరు కళాపూర్ణోదయము కంటె ప్రభావతీప్రద్యుమ్నము ఉత్తమ ప్రబంధ మందురు. కొందరు కళాపూర్ణోదయమే శ్రేష్ఠమని యందురు. ప్రభావతీ ప్రద్యుమ్నములోని ప్రబంధరచనాకళయంతయు కళాపూర్ణోదయమున గతార్థమైనది. కాని, పద్యరచన ప్రభావతీ ప్రద్యుమ్నమున బాగున్నదని కొందరి తలంపు. పద్యరచనలో ఈతనిని మించినవా రున్నారు. కాని, అపూర్వ కల్పితకథాసంవిధాన వైచిత్రి యందు అతనిని మించినవారు లేరు.

"ఊహించి తెలియరాకుండ సూరపరాజు
 శ్రమఁ గళాపూర్ణోదయము రచించె"

నని చేబారలు సాచువారు అప్రౌఢులు.

"ఒకటి పూర్వోత్తర విరోధమొదవకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొసరఁ
బలుక నేర్చిన బహుతపః ఫలముగాదె !"

అని ప్రభావతీ ప్రద్యుమ్నమున చెప్పబడియున్నను పింగళి సూరన తపఃఫలము ఫలించినది కళాపూర్ణోదయమునందే.

సూరన కవిత్వమునకు మాధుర్యము ముఖ్యలక్షణము.

"చలువ గల వెన్నెలల చెలువునకు సౌరభము
 గలిగినను, సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలు పెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
 నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు
 మలయపవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన, నీడు మఱి కల దనఁగ వచ్చుఁ, గడు
 వెలయఁగల యీసుకవి పలుకులకు నెంచన్."

ఎన్నిగుణము లున్నను కవితకు మాధుర్యమే మణికిరీట మని తనకవితాలక్షణమునందు పేర్కొనినాడు. ఇతని కవిత్వ మంతయు దాని కుదాహరణము.

పింగళి సూరన నివసించిన కాలము విశ్వసాహిత్య చరిత్రలోనే ఒక ఉజ్జ్వల యుగము. ఎందరో ప్రసిద్ధకవులు పాశ్చాత్య దేశములందు కావ్యప్రయోగములు చేసి కీర్తికెక్కిన మహత్తర కాలము. ప్రసిద్ధాంగ్ల నాటకకర్త షేక్స్పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' 'ట్వెల్త్ నైట్' వంటి వస్తువులను సృష్టించి విశ్వవిఖ్యాతి గాంచినాడు. ఆయన పింగళి సూరనకు దాదాపు సమకాలికుడు. ఆమహాకవి నాటకవస్తువులకంటె మహత్తరమైన కల్పన చేసిన పింగళి సూరన ఆయన కోవలో చేరదగిన వాడు. కళాపూర్ణోదయము ఆంగ్లభాషలో అనువదింపబడినచో తెలుగువారికి పద్యనాటకము రచించిన మరొక షేక్స్పియర్ ఉన్నాడని విశ్వము గుర్తింపగలదు. పద్యకృతిగా నవలను నిర్మించిన మహాంధ్రనవలాకర్త విశ్వసాహితికి పరిచయము కానగలడు. అట్టి శుభావకాశము అచిరభవిష్యత్తులో కలుగుగాక అని ఆశించుచున్నాను.



# గద్యతిక్కన, సంఘసంస్కర్త

# కందుకూరి వీరేశలింగం పంతులు

## శ్రీ ఆరుద్ర గారు

"తెలుగు జాతిని తెరలు తెరలుగ
కారుచీకటి కమ్మినప్పుడు
మూఢఛాందసగాఢరుగ్మత
మూలుగుల్లో చొచ్చినప్పుడు
కాంతి ఖడ్గం, కరుణ వైద్యం
కార్యవాదిగ కావ్యశీలిగ
జాతి జనుల సముద్ధరించగ
జననమొందెను తెనుగు గడ్డను."

ఆయన సంఘ సంస్కర్త, గద్యతిక్కన కందుకూరి వీరేశలింగంగారు.

ఇది వీరేశలింగం గారిలో విప్లవభావాంకురాలకు శతజయంతి సంవత్సరం. సరిగ్గా నూరేళ్ల కిందట, 1873 లో ఆయన స్త్రీవిద్య ఆవశ్యకత, బాలవ్యాకరణం అసమగ్రత గుర్తించారు. ఎక్కడ ఏ అక్రమం కనపడ్డా సహించి ఊరుకునే తత్వంకాదు వారిది. ఆయనకు ఒక అభిప్రాయం పుట్టిందంటే, ఆ పుట్టడానికీ దానిని నెరవేర్చడానికీ మధ్య ఆలస్యం విశేషంగా ఉండదు. అందుకే స్త్రీవిద్య అవసరమనే రచనలు వ్రాసి, పురుషార్థప్రదాయినికి ప్రచురణార్థం పంపించారు. సంగ్రహ వ్యాకరణం అనే గ్రంథాన్ని రచించి, కోరంగిలో తమ శిష్యులకు దాని ప్రకారమే పాఠాలు చెప్పేవారు.

అప్పుడు వీరేశలింగంగారి వయస్సు పాతికేళ్ళు. అప్పటికే ఆయనకు 'అభినవ తిక్కన' అన్న బిరుదు సమకాలికులు ఇచ్చారు. తిక్కనగారిలాగే నిర్వచనకావ్యం రచించినందుకే ఈ బిరుదు వచ్చింది. పంతులుగారు ఇరవయ్యోఏట పద్యాలు అల్లటం మొదలుపెట్టారు. అయిదేళ్ళలో అగ్రశ్రేణి కవిగా పేరుపడ్డారు.

పంతులుగారు కలం పట్టిన కాలంలో పద్యాలు చేసిన వాళ్ళకేగాని, వచనం వ్రాసిన వాళ్ళకు గౌరవంలేదు. అంచేతనే "ముద్దియ విద్దె పెద్ద కార్యము" అంటూ స్త్రీ

విద్యను సమర్థించే రచనను పద్యాలలో వ్రాశారు. ఈ పద్యాలలో మత్తేభ విక్రీడిత కంద గర్భ సీసాలు, గోమూత్రికాబంధాలు వగైరాలు ఉన్నాయి. ఇంతటి పాండిత్యం ప్రదర్శించకపోతే వాదానికి నష్టం లేకపోయినా, వ్యక్తిత్వానికి నష్టం.

పాండిత్య ప్రకర్షలో పంతులుగారు అసమానులు. అప్పటిదాకా ఎవరూ తొక్కని కొత్త పుంతలు తొక్కాలని, ఎవరూ చేయని ఫీట్లు చెయ్యాలని వారి సంకల్పం. ఐతే లాక్షణికుల శాసనాలను అతిక్రమించకూడదు. నియమాలు ఎంత కఠినంగా ఉంటే నైపుణ్యం అంత రాణిస్తుందని పంతులుగారు భావించారు. కొన్ని కొన్ని నిషేధాలను పాటిస్తూ రచించిన కావ్యాలు తెలుగులో అప్పటికి కొన్నే ఉన్నాయి. ఒక్క సంస్కృతపు ముక్క రాకుండా అచ్చ తెనుగులో వ్రాసినవాళ్ళు ఇద్దరే ఉన్నారు. ఒక్క వచనంకూడా వాడకుండా పూర్తిగా పద్యాలలోనే కావ్యం చెప్పినవారు ఒకరే. పెదవుల కదలిక లేని అక్షరాలతోనే గ్రంథమంతా రచించినవాళ్ళు ఇద్దరో ముగ్గురో.

అందుచేత ఈ నియమాలన్నీ ఒకే కావ్యంలో పాటిస్తూ రచనచేస్తే ఎంత యశస్సు? అని పంతులుగారు తమ ఇరవై ఒకటోయేట భావించారు. సంకెళ్ళు వేసుకొని సర్కసుఫీట్లు చేయాలనుకొన్నారు. 'శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య నైషధం' రచించారు. ఇది ప్రౌఢకావ్యం కాదని ఉత్తరోత్తరా పంతులుగారే కొట్టిపారేసినా ఆ గ్రంథాన్ని ప్రచురించీ ప్రచురించగానే ప్రశంసలు కురిశాయి. యూనివర్శిటీవారు ఆమోదించి, దాన్ని పట్ట పరీక్షకు పఠనీయ గ్రంథం చేశారు. వారి పంథాను ఇతరులు అనుసరించసాగారు. [శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య కుశ చరిత్ర అంటూ ఒక గ్రంథాన్ని మచ్చా వెంకటరావు అనే ఆయన రాశాడు]. పంతులుగారిలో కొత్త ఉత్సాహం వచ్చింది. ఆ వేడిలో 'రసికజన మనోరంజనం' అనే కావ్యం వ్రాశారు. దీనిలో 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధ మహాకావ్యరచనా చాతురీ ధురంధర' 'సద్యశోబంధుర' అనే బిరుదులను సగర్వంగా గద్యలో చెప్పుకొన్నా ఈ కావ్యంలో నిర్వచన నిరోష్ఠ్య నియమాలు పెట్టుకోలేదు. ఒక్క శుద్ధాంధ్ర నియమమే పెట్టుకొన్నారు. దీన్ని పండితులు మెచ్చుకొన్నారు. ప్రభుత్వంవారు ఈ కావ్యాన్ని ఆమోదించారు. ఎఫ్.ఏ., తరగతికి పఠనీయ గ్రంథంగా పెట్టారు. పత్రికలో ప్రశంసలు కోకొల్లలయ్యాయి. గ్రంథాల అమ్మకం వల్ల రాబడి వస్తోంది.

ఇంకెవరైనా అయితే, అంతటితో ఆగి, ఆ యశస్సును కాపాడుకొనడానికి ఆ తరహా రచనలే చేస్తూ, కాలక్షేపం చేసేవారు. కాని వీరేశలింగంగారు అలాంటివారు కారు. అప్పటి కాయన చిన్నయసూరి శైలినీ, చిన్నయసూరి స్థానంలో వచ్చిన కొక్కొండవారి పత్రికను కొండంత కొనియాడే దశలోనే ఉన్నా, వారిలో అనాటి ఇతర పత్రికా పఠనంవల్ల అభ్యుదయభావాలు అంకురించాయి. ఆ రోజుల్లో స్త్రీవిద్య మీదనేకాదు, స్త్రీ పునర్వివాహ సమస్యపైకూడా పురుషార్థప్రదాయినిలోనూ, తత్త్వబోధినిలోనూ వ్యాసాలు వస్తూ ఉండేవి. పంతులుగారు వాటినన్నిటిని ఆకళించుకొన్నారు. ఆయనలో అభ్యుదయ భావ పరిణామం ఒక క్రమంలో సాగింది. ఆయన పన్నెండోఏట

ఇంగ్లీషు చదువు ప్రారంభించడానికి ముందే ఛాందస ప్రవృత్తి బలపడం మొదలు పెట్టింది. త్రికాల సంధ్యావందనం, సహస్ర గాయత్రీ జపం, సూర్యుడికి అర్ఘ్య ప్రదానం, ఆలయాలల్లో పూజలు, దయ్యాలను చూడాలనే తహతహ, హిమాలయాలకు వెళ్ళి తపస్సుచేసి మహిమలు సంపాదించాలనే ఉబలాటం ఆయన లక్షణాలు. ఇరవయ్యో సంవత్సరందాకా ఇవి ముదురుతూనే ఉన్నాయి. ఆ యేట అభ్యుదయ సాంగత్యంవల్ల పూర్వవిశ్వాసాలు కొన్ని మారడం మొదలెట్టాయి. పంతులుగారి ఇరవయ్యోఏట ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు బందరునుండి బదిలీఅయి రాజమండ్రి కాలేజీకి వచ్చారు. ఆయన బ్రహ్మసమాజకులు. వీరేశలింగంగార్కి వీరి పరిచయం కల్గి సాంగత్యం లభించింది. కేశవచంద్రసేనుని ఉపన్యాసాలు ఉత్సాహంతో పంతులుగారు చదివారు. పూర్వం సత్యాలని నమ్మే కొన్ని విషయాలను గురించి వారికి కొన్ని సందేహాలు కలిగాయి. విన్న దానినంతా విశ్వసించకూడదు; విశ్వసించిన దానిని ఆచరించాలి అనే నమ్మకానికివచ్చారు. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారి ప్రోత్సాహంవల్ల వీరేశలింగంగారూ, వారి స్నేహితులూ ఒక డిబేటింగ్ సొసైటీవంటిది పెట్టుకొన్నారు. ఆ రోజులలో నలుగురు ఒకచోటకూడి సభచేయడమే ఒకతప్పు! ఊళ్ళోవాళ్ళంతా వీరేశలింగంగార్ని, వారిమిత్రులను వేలెత్తి చూపిస్తూ "మీటింగ్‌వాళ్ళు వీళ్ళేనర్రో" అని వెక్కిరించేవాళ్ళు. అందుచేత ఇంట్లో తలుపులు మూసికొని సభచేసుకొనేవారు. 1868 లో ఇలా జరుపుకొన్నది మరోపదేళ్ళకు 1878 లో ఇంకో కొత్త విడ్డూరం విషయంలో మళ్ళీ జరుపుకోవలసివచ్చింది. పంతులుగారు తమ ముప్ఫయ్యోఏట రాజమండ్రిలో ప్రార్థన సమాజం స్థాపించారు. సమాజంపేరు విని పెద్దమనుషులుసైతం పరిహసించడంచేత వీరేశలింగంగారు వారిమిత్రులు ప్రతివారం తెల్లారుఝామున వారిమేడమీద తలుపులు మూసికొని ప్రార్థనలు చేసుకొనేవారు. వెక్కిరింతలకు భయపడి తొక్కినతోవను విడిచే స్వభావం పంతులుగారిలో ఏకోశానా లేదు. విశ్వసించిన భావాలను వెల్లడిచేయకపోవడం అన్నదికూడలేదు. అందుకే స్త్రీవిద్యామండన వాదాన్ని ప్రారంభించిన ఒకఏడాదిలో తమ ఊహల్ని స్వంత పత్రికద్వారా లోకానికి వెల్లడిచేయడం యుక్తమని, "వివేకవర్ధని" స్థాపించారు. తమ అభిప్రాయాలను నిర్భయంగా ప్రకటించారు. దేశాభివృద్ధికోసం, భాషాభివృద్ధికోసం పాటుపడతామన్నారు. "సర్వజనోపయుక్తములైన విషయమ్ములును, నీతివిషయమ్ములును సులభశైలి నందరకును దెలియునట్లు కఠినసంధులు లోనుగాగలవి విడిచి వ్రాయుచు నొకప్పుడన్యదేశీయులును లోనుగా గలవానిని పూనికూడ్తు" అని భాషావిషయంలో తమపోలసీని ప్రకటించారు పండితులకు గంగవెర్రు లెత్తాయి.

అప్పటికే పంతులుగారు జటిలమైనభాషలో కఠినమైన సంధులతో చిన్నయసూరి 'నీతిచంద్రిక'కు ఇదే సాటి అనిపించేటట్టు 'విగ్రహతంత్రా'న్ని వ్రాసి ప్రచురించారు. ఉద్దండపండితులు శ్లాఘించారు. ఖర్చు లిచ్చి పిలిపించి చెన్నపట్నంలో వీరేశలింగంగార్కి బహుజనపల్లి సీతారామాచార్యులుగారు మొదలైనవారు సన్మానించారు. మధ్యన కూర్చో పెట్టుకొని ఫొటో తీయించుకున్నారు. వెండిచెంబు బహూకరించారు. అటువంటి సత్కారాలు పొందిన శైలిని పంతులుగారు వదులుకున్నారు.

విగ్రహతంత్రాన్ని పండితులైతే మెచ్చుకున్నారు కాని సాధారణజనులు అర్థం చేసుకోలేకపోయారు. "ఎంతయు గడ్డుశైలి రచనాంపగ బడ్డదటంచు పల్మరున్ వింతగ నాకు లేఖలను పెక్కురు," వ్రాశారని పంతులుగారే తర్వాత చెప్పుకున్నారు. ఆ పెక్కురు 'మనభాష'కి చాలా ఉపకారం చేశారు. ఆ వింతలేఖలు చదివాక పంతులు గారు తమలో తాము చాలా చర్చించుకున్నారు.

'భాషవల్ల ప్రయోజన మేమిటి? జనులు తమ అభిప్రాయాలను ఒకరికొకరు తెలుపుకొనడం. భాషలోని గ్రంథాలవల్ల ప్రయోజన మేమిటి? తమ భావాలను దూరాన ఉన్నవాళ్ళకి రాబోయే తరాల వాళ్ళకి సులభంగా తెలపడం. అయితే గ్రంథాలు ఎలా ఉండాలి? అందరికీ తెలిసేటట్టు సులభంగా ఉండాలి' అని పంతులుగారు తమలో తాము ఒక నిర్ణయానికి వచ్చారు. అభిప్రాయాన్ని వెంటనే పత్రికాముఖాన ప్రకటించేరు. పండితు లంగీకరించక పరిహసించారు. కొక్కొండవారు ఒక్క గ్రంథాలుమాత్రమే కాదు, పత్రికలు కూడ గ్రాంథిక శైలిలోనే ఉండాలన్నారు. వీరేశలింగంగారు ఆ వాదాన్ని 'వివేకవర్థని'లో ఖండించారు. "పత్రికలభాష గ్రాంథికఫణితి నున్న పండితులు గాని వారికి బనికిరావు, పత్రికోద్దేశమే కొంఅవడును దాన, గాననెపుడు సర్వజనోపకార మొదవ, పామరులకును తెలియంగ వ్రాయవలయు" అని ఖచ్చితంగా చెప్పారు. పంతులు గారి ఉద్దేశంలో గ్రంథరచనలో ఆవశ్యకం "పామరులకు తెలివిపుట్టించి" వారిని మంచి కోవకు తిప్పడమే.

యుగలక్షణాలను అవగాహన చేసికొని, భాషలో తగు మార్పులు తెచ్చుకోవా లన్న ఇంగితజ్ఞానం మార్గదర్శకులకే తెలుస్తుంది. అందుకే తిరుపతివేంకటకవులు కూడ వీరేశలింగంగారి నిర్ణయాలకే తామూ వచ్చారు.

"కాలముబట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి దేశభా
షాలలితాంగి మారు టది సత్కవి సమ్మతమౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాష గలవౌటను నొచితిబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మవి పండితు లేగతి నొప్పుకొందురో"

అని తమ పాణిగ్రహీతలో తిరుపతి కవులు స్పష్టంచేశారు. "పామరు లు పయోగించే సామాన్యపు మాటనే ఉపయోగిస్తే మా పాండిత్యము, మా ఆధిక్యము ఏమి టండీ?" అని లులాయ శాస్త్రులు వంటి వారే భావిస్తారు. యుగకర్తలు క్రాంత దర్శనం చేస్తారు. అందరికి తెలిసే సులభశైలిని చేపట్టబట్టే పంతులుగారి స్త్రీ విద్యా ప్రచారం ఒక ఏడాదిలో ఫలించింది. ఆయన హెడ్‌మాస్టరుగా ఉంటున్న ధవళేశ్వరం లోని ప్రజలు చందాలు వేసికొని ఒక బాలికా పాఠశాలను స్థాపించారు. ఆ రోజులలో ఆడవాళ్ళ పాఠశాలంటే రాజమండ్రిలో వేశ్యలచదువుకూట మనే అర్థంట. అటువంటి పరిస్థితులలో బాలికా పాఠశాల స్థాపనకు ప్రజలు ముందుకు వచ్చారంటే పంతులుగారి కృషే కారణం. తలుపులు మూసుకొని మీటింగులు జరుపుకొనే అవస్థనుండి ఒక దశాబ్దం

లోనే విద్యాధికులను తప్పించారు. పంతులుగారి మిత్రులు బసవరాజు గవర్రాజుగారు 'రాజమహేంద్రవర దేశ పాఠశాలా సమాజా'న్ని స్థాపించారు. ప్రతి ఆదివారం ఉపన్యాసాలు ఉండేవి. వీరేశలింగంగారు ప్రతివారం మధ్యాహ్నం 3 గంటలకి ఎండ వేళప్పుడు 4 మైళ్ళు నడిచి వెళ్ళి రాజమండ్రిలో ఉపన్యాసం ఇచ్చి మళ్ళీ వస్తూ ఒంటరిగా ధవళేశ్వరానికి నడిచి వెళ్ళేవారు. "జనోపయుక్తమైన సభలన్న నా కప్పుడంత ఉత్సాహము" అని పంతులుగారు స్వీయ చరిత్రలో చెప్పారు

మీటింగుల లాగే ప్రార్థనలు కూడ తలుపులు మూసికొని చేసే అవస్థకూడ ఏడాదిలోనే పంతులుగారు తప్పించారు. విజయనగరం మహారాజా వారి బాలికా పాఠశాలలోనికి ప్రార్థన సమాజాన్ని మార్చారు. బహిరంగంగా ప్రార్థనలు, ఉపన్యాసాలు జరిగేవి. వందలకొద్దీ ప్రజలు వచ్చి ప్రార్థనలు వినేవారు. వర్తకులు తమ అంగళ్ళను కూడ కట్టేసి వచ్చి పాల్గొనేవారు. ప్రార్థన సమాజం సభ్యులు రాత్రి బడులు పెట్టి విద్యాదానం చేసేవారు. పోనుపోను పంతులుగారు సారంగధర మెట్ట మీదనే ప్రార్థనలు చేసేవారు. వారివెంట సమాజం సభ్యులు, విద్యార్థులు, ఊరేగింపులా వెళ్ళేవారు రాత్రి దారి పొడుగునా పాటలు పాడుకుంటూ ఇళ్ళకు చేరుకొనేవారు.

ప్రత్యక్షంగా ఉన్న ఊళ్ళోనూ, పత్రికాముఖాన దేశంలోనూ పంతులుగారు సంఘ సంస్కార ప్రబోధం ప్రారంభించిన వెంటనే విద్యార్థులు, యువకులూ ముందుకు వచ్చారు. ఉద్యోగులు, వృద్ధులు గడగడ లాడారు. అధికారంలో ఉన్నవారు ఆగ్రహించారు. కుటిలకార్యాలు చేసేవాళ్ళు కోపం వెళ్ళగ్రక్కారు. పంతులుగారి మాటల లోనే చెప్పాలంటే—

"లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము; వేశ్యాంగన సంగమము నీతి కాదన్న శృంగార నాయకులకు కోపము. పూర్వాచారములు మార్చుకోవలెనన్న పామర జనులకు కోపము, నీతిమాలిన బాహ్యవేషములు మతవిరుద్ధము లన్న ఆచార్య పురుషులకు కోపము. మా పత్రికోద్దేశమును నిశ్శంకముగా నిర్వహింప వలసినచో నిన్ని కోపములను సరకు చేయకుండవలెను". వీరేశలింగంగారు ఆ కోపాలను లక్ష్య పెట్ట లేదు. దుర్మార్గులమీద, దురాచారపరుల మీద దుష్టచితులమీద, సంఘ జీవితాన్ని కలుషితం చేస్తున్న కపటచిత్తులమీద, అషాఢభూతులమీద, దొంగవైద్యులమీద, కుహనా స్వాములమీద, భూతవైద్యులమీద, భోగలాలసుల మీద, తమ తరక్షురూక్ష లేఖినిని దూశారు.

స్త్రీ విద్యకోసం ప్రచారం చేశాక. పంతులుగారు స్త్రీ పునర్వివాహాలకోసం కృషి చేశారు. 1874లోనే చెన్నపట్నంలో ప్రముఖులు పునర్వివాహ సమాజాన్ని స్థాపించారు. అన్ని మండలాలకు ప్రకటన పత్రికలు పంపారు. పంతులుగారు "అనామకులు" కనుక వారికిపంపలేదు. ఇంతలో పురుషార్థ ప్రదాయినిలో ఎవరో "సౌఖ్యార్థి" అనే మారు పేరుతో పునర్వివాహ విషయంపై రాశారు. అది పంతులుగారే రాసి ఉంటారని పొరపడి, ధర్మవరం కృష్ణమాచార్యులుగారు ఒక ఉత్తరం రాశారు. "మీ రట్టిపని గుణవంతమని వాదింప

బూనుకొందురేని క్రియాసాధన మేమియు లేకున్నను కొందరచే నేని నిందింపబడుట ప్రాప్తించు" అని చెప్పారు. ఆ లేఖలోనే ఇంకా ఎత్తిపొడిచారు "చెన్నపట్నమున అట్టి సమాజ మేర్పడి దాదాపున రెండేండ్లగుచు వచ్చెగదా, ఏదీ ఎందరు బాలవిధవలు వారిచే వివాహితులైరి? ఈ హిందువులెట్టి వారోగాని, ఎట్టి నూతనాచారమునకును నెడమీయరు" అని ధర్మవరం వారు నొక్కిచెప్పారు. ఆయన స్త్రీ విద్యకు అనుకూలురే, దానికి పూనుకున్నవారే అయినా పునర్వివాహాలకు సుముఖులు కారు. "స్త్రీ విద్యకును విధవా వివాహమునకును నింతయంతర ముండుటయు, అవి రెండింటిని నేయేవిధమున జన సామాన్య మెన్నుటయు నెఱింగిన మీకు విశేషము విన్నవింపలేను" అని ధర్మవరం వారు వ్రాశారు. విశేషాలు పంతులుగారే చిత్తానికి తెచ్చుకున్నారు.

ఈలోగా విశాఖపట్టణంలో పరవస్తు వెంకటరంగాచార్యులుగారు 1875 లోనే స్త్రీ పునర్వివాహాలు శాస్త్ర సమ్మతాలని సమర్థిస్తూ ఒక చిన్న గ్రంథాన్ని ప్రకటించారు. ఉత్తరోత్తరా వీరికి మహామహోపాధ్యాయ అన్న బిరుదు వచ్చింది. ఆయన అంతటి ఉద్దండ పండితులైన కొక్కొండ వారి దృష్టిలో మాత్రం నవనాగరితాధీనులు-పరవస్తు వారి వాదాన్ని ఖండించడానికి కొక్కొండ వారు వీరేశలింగంగార్ని కలుపు కోవాలని చూశారు. నవనాగరికుల కున్న స్వాతంత్ర్యము మనకును కలదు. జంకనేల? తోచిన ధర్మము నిక్కముగ వక్కాణించుట కెల్లరును స్వతంత్రులు కాబట్టి తాము దురాచార మర్దనమునకు నడుగిడరు" అని ఒక జాబు వ్రాశారు. వీరేశలింగంగారు అక్షరాలా అంతే చేశారు. అయితే కొక్కొండవారిలాగా పునర్వివాహం దురాచార మని భావించ లేదు. నిషేధమే దురాచారమని భావించారు. అతి బాల్య వివాహాలవల్లనే నిర్బంధ వైధవ్యం ప్రాప్తిస్తున్న దని. శుద్ధ వ్యావహారిక భాషలో "బ్రాహ్మవివాహం" అనే నాటకం వ్రాశారు. దానిని జనులు గుంపులు గుంపులుగా కూర్చుని చదువుకొనే వారు. పంతులుగారు ఏ సీనుపెట్టినా దాన్ని "పెద్దయ్యగారి పెళ్ళిపుస్తకం" అని పేర్కొనే వారు. ఇది తెలుగులో మొట్టమొదటి సాంఘిక నాటకం.

కొందరు పరిశోధకుల దృష్టిలో వావిలాల వాసుదేవశాస్త్రిగారు వ్రాసిన నందక రాజ్యమే మన భాషలో ప్రప్రథమ సాంఘిక నాటకం. అయితే అది 1880 లో ప్రచు రణ అయ్యింది. వీరేశలింగంగారి బ్రాహ్మవివాహం 1876 లోనే హాస్యసంజీవినిలో సీరియల్‌గా ప్రకటన పొందింది. 1878 లోనే పుస్తకరూపం పొందింది. 'పెద్దయ్యగారి పెళ్ళి పుస్తకా'న్ని విద్యావిహీనులు సైతం విని ఆనందించేవారు ఈ రోజులలోనే పంతులుగారి దృష్టి పూర్తిగా వచనంవైపు మళ్లింది. "పుస్తకములను సంస్కృత భాషలో వ్రాయుటకంటె దేశభాషలలోనే వ్రాయుట మేలైనదని అట్టి యుపయుక్త గ్రంథములను వచనములుగా వ్రాయుట ముఖ్యకార్యము" అని 1875 లోనే స్థిర మైన అభిప్రాయానికి వచ్చారు. కవితా చమత్కృతులు, వర్ణనలు ఉండి, ఉల్లాసం పుట్టించే కొన్ని గ్రంథాలు మాత్రం పద్యరూపంలో ఉండవచ్చు నన్న అభిప్రాయంకూడ వారి కుంది. శృంగారప్రబంధాలు చేయు మేలుకంటె కీ డెక్కువ అన్న సిద్ధాంతానికి

వచ్చి పూర్వప్రబంధాలను అవహేళనచేస్తూ అభాగ్యోపాఖ్యానం రచించారు. ఆనాటి కుళ్ళిపోయిన సమాజంలో ఆంధ్రదేశంలోని ఏ ఊరికైనా వర్తించేటట్టు ఒక్క చరణంలో "పురిని పుట్టిన కుక్కైన పుచ్చిపోవు" అని మన దౌర్భాగ్యాన్ని వర్ణించారు.

ఈ దౌర్భాగ్యాన్ని రూపుమాపి దేశాభివృద్ధిని సాధించడానికి పంతులుగారు సంఘసంస్కార సమాజాన్ని స్థాపించారు. పంతులుగారి సహపాఠి, దేశాభిమాని, ప్రియమిత్రుడు చల్లపల్లి బాపయ్యగారు స్త్రీ పునర్వివాహ విషయమై కృషిచేయాలని పంతులు గారితో చెప్పారు. తమకు విశేష పాండిత్యం, విత్తం, లౌకికాధికారం లేక పోగా దుర్బలశరీరం ఉండడంచేత ఆ కార్యభారం వహించలేమని పంతులుగారు భావించారు. అయినా బాపయ్యగారు నిరాశులు కాలేదు. మళ్ళీమళ్ళీ ఈ ప్రసక్తి తెస్తూనే ఉండేవారు. ఒకనాడు పంతులుగారు బాపయ్యగారిని చూసి "నిన్ను మీ అన్నలు విడిచి పెట్టినా, బంధువులు బాధపెట్టినా, నన్ను విడవక, కడవరకు నాతో పనిచేస్తావా?" అని ప్రశ్నించారు. బాపయ్యగారు అణుమాత్రం సంశయించక "మీతో ఉంటాను"అన్నారు. అది ఈశ్వరప్రేరితమైన ఆజ్ఞగా పంతులుగారు భావించారు మారుమాటాడక సభాహ్వాన పత్రికను వ్రాసి పట్టుకరమ్మన్నారు. తామే సంతకంపెట్టి ప్రకటిస్తామన్నారు. మహోద్యమానికి నాయకత్వం వహించారు.

చిన్నప్పటినుండి వీరేశలింగంగారిలో నాయకత్వపు లక్షణా లున్నాయి. ఛాందసత్వపు రోజులలోకూడ ఆయన ఉపదేశం విని హిమాలయ పర్వతం మీద తపస్సు చేసుకొనడానికి ముగ్గురిని ప్రయాణం చేయించారు. 18వ ఏట పాఠశాలలో ఉన్న అందరిలోను, ఎవరు మంచి విద్యార్థి అన్న సంగతి తేల్చవలసివస్తే తమ తరగతివాళ్లే కాక పై తరగతివాళ్ళు, క్రిందతరగతివాళ్ళు ఏకగ్రీవంగా వీరేశలింగంగారి పేరే చెప్పారు. 19వ ఏట వీరేశలింగంగారు విద్యార్థినాయకు లయ్యారు. అట్టే ఇంగ్లీషు సాహిత్యంలేని అసమర్థుడు హెడ్మాష్టరుగా ఉండకూడ దని ఆందోళన లేవదీశారు. మహజర్లు పెట్టించారు, సమ్మెలు చేయించారు. ప్రభుత్వంవారి విద్యాశాఖనే ఒక ఊపు ఊపి, హెడ్మాష్టరును బదిలీ చేయించారు. ఆయన కార్యదీక్ష అటువంటిది.

పంథొమ్మిదవ ఏటనే అంత దక్షులైన పంతులుగారు తమ ముప్ఫయిఒకటో ఏట పరిపూర్ణ నాయకులయ్యారు. పునర్వివాహసమస్యను కూలంకషంగా చర్చించుకోదలచారు. ఆ రోజులలో ఈ సమస్యపై ఏయే గ్రంథా లున్నాయో వారికి తెలియవు. ఈశ్వరచంద్ర విద్యాసాగరుల గ్రంథ మున్నట్లు తెలిసినా, అప్పుడు వారి కది లభించలేదు. మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, పరాశర స్మృతి మాత్రమే ఉన్నాయి. తత్త్వబోధినిలో వ్యాసం ఒకటి, పురుషార్థప్రదాయినిలో వ్యాసంఒకటి వారికి తోడ్పడ్డాయి. ఈ గ్రంథాల సహాయంతో పంతులుగారు తమ తొలివ్యాసం వ్రాశారు. విప్లవ యజ్ఞం మొదలుపెట్టారు. ఈ యుగానికి పరోక్షంగా సామినేనివారి హితసూచని సామినేని మంత్రాలు చదివింది. చిన్నయసూరిగారి తీరున కాక జియ్యరు సూరిగారి తెన్నున వెళ్ళడంవల్లనే పంతులుగారు విప్లవోన్ముఖులయ్యారు. సభను ఏర్పాటు చేశారు.

ఆహ్వాన పత్రికలు వెళ్ళగానే వైదికవృత్తిలోని వాళ్ళు ధ్వజమెత్తారు. పూర్వాచారపరాయణులైన లౌకికశిఖామణులు, వైదికోత్తములు కత్తులు నూరారు. 1879 జూలై 7 వ తేదీన రాజమండ్రిలోని, విజయనగర మహారాజా వారి బాలికా పాఠశాలలో స్త్రీ పునర్వివాహ విషయంపై మొదటి ఉపన్యాసం చేశారు. ఆగస్టు 3 వ తారీఖున ప్రప్రథమ విజ్ఞాపన చదివారు. ఆ రోజు మొదలుకొని ఊళ్ళో ప్రతిఇంటా మళ్ళీ పెళ్ళి చర్చలే జరిగాయి. వీధుల్లో అందరూ ఆ విషయాలే చెప్పుకో సాగారు. పంతులుగారి ఉపన్యాసం అచ్చుపడగానే ఆంధ్రదేశమంతటా దుమారం రేగింది. ప్రతివాదులకు సభలలోనూ, పత్రికాముఖానా పంతులుగారు సమాధానాలు ఇవ్వసాగారు.

ఈ రచనలు ముఖ్యంగా పెద్దయ్యగారి పెళ్లి పుస్తకం చదువుకొనే వారి యొక్క వేడుక కోసమే ఉపయోగపడుతున్నాయని, అంతకంటె ఎక్కువ ప్రయోజనం దానివల్ల కలగలేదని పంతులుగారు భావించారు. ఎవరైనా తాను ఉపదేశించేదాన్ని అనుష్ఠించి చూపిస్తేనే గాని కేవల శుష్కోపన్యాసాలవల్ల, పుస్తకప్రకటనవల్ల కార్యముండదనే నిశ్చయానికి పంతులుగారు వచ్చారు. స్త్రీ పునర్వివాహ సంఘంలో ఒక అంతరంగిక వర్గాన్ని ఏర్పరిచారు. రెండేళ్లపాటు దేశమంతటా వాద ప్రతివాదరూపమైన వాగ్యుద్ధం జరుగుతున్నా, క్రియలేని నిరర్థకవాదం ఎందుకని ఆచరణకు పూనుకొన్నారు.

వివాహం అన్నది జీవితంలో చాలా ముఖ్యమైన సంస్కారాలలో ఒకటి. వివాహమయ్యాక దంపతులు సంఘంలో జీవించాలి. సంఘం వారికి సర్వవిధాల సహాయం చేయాలి. పునర్వివాహం చేసుకున్నవాళ్లకి ఈ సదుపాయాలు ఉండవు. అందుచేత వాళ్లకు సంఘంలోని ఒక వర్గమైనా చేయూత ఇవ్వాలి. వాళ్లని ఆదుకోవాలి. పునర్వివాహం చేసుకున్న వాళ్లకి ఆర్థిక రక్షణ ఉండాలి. నెలసరి ఆదాయానికి హామీలు ఉండాలి. పునర్వివాహం చేసుకొనే వాళ్ల పోషణభారం తనమీదనే ఉందని పంతులుగారు భావించారు. అభ్యుదయభావాలు గల శ్రీమంతులతో సంప్రదించారు. పైడా రామకృష్ణయ్యగారు పంతులుగారి ఉద్యమానికి ముప్ఫయివేల రూపాయలు ఇస్తామన్నారు

ఆర్థిక సహాయం లభిస్తుందన్న విశ్వాసం కలిగాక పంతులుగారు విజృంభించారు. వితంతుకన్యలు దొరికితే తాము వివాహమాడుతామని కాలేజీలోని విద్యార్థులు అనేకులు ముందుకొచ్చారు. పంతులుగారు బాపయ్యగారు యింటింటికి తిరిగి అడిగితే లౌక్యులయిన బ్రాహ్మణగృహస్థులు ముప్ఫయిమందికంటే ఎక్కువమంది వివాహ భోజనానికి వస్తామన్నారు. సబ్‌జడ్జీలు డిస్ట్రిక్టు మునసబులు, న్యాయవాదులు చేయూత ఇచ్చారు.

అంతలో పునర్వివాహ ప్రయత్నాలు అపడానికి విరూపాక్ష పీఠాధిపతులు రాజమండ్రిలో దిగారు. వీరేశలింగంగారు ఆ స్వాములవారి అకృత్యాలను వివేకవర్ధనిలో బయటపెట్టారు అందుచేత స్వాములవారికి రాజమండ్రిలో భిక్షలే కరువయ్యాయి. పీఠం సిబ్బందిలో ఒక కులటాపుత్రు డున్నాడట. అతణ్ణి బయటకు పంపించే దాకా స్వాముల వారి ముఖం చూసినవాళ్లే లేరు. స్త్రీ పునర్వివాహ విషయంమీద శాస్త్ర సిద్ధాంత

నిర్ణయం చేయడానికి సభ పెట్టించండని పంతులుగారు స్వాములవారిని సవాలుచేశారు. సభ ముగిసినప్పటికి స్వాములవారి ప్రతినిధి అద్దేపల్లి కృష్ణశాస్త్రిగారు 'బహుజనులు అభిప్రాయపడితే కొత్త నిబంధనలు చేసుకోవచ్చు. ఆక్షేపం లేద'ని ఒప్పుకొని తప్పుకొన్నారు.

వీరేశలింగం గారి శాస్త్రజ్ఞానం అంతటి నిర్దుష్టమైంది. ఆయన కలకత్తానుంచి, బొంబాయినుంచి ఎన్నో గ్రంథాలు తెప్పించారు. శాస్త్రవిచార విషయాల్లో అనుమానాలు వచ్చినప్పుడు కలకత్తాలోని ఈశ్వరచంద్రవిద్యాసాగరులతో, బొంబాయిలోని మహదేవ రానడే గారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి సందేహాలు తీర్చుకొనేవారు. పీఠాధిపతులను ఓడించి, వారి ఆంక్షలను వారి ముఖం మీదనే కొట్టి, పంతులుగారు 1881 డిసెంబరు 11 వ తేదీన ఆంధ్రదేశంలో మొదటి పునర్వివాహం జరిపించారు.

పెళ్లిళ్ళలో కాగడాలు వేసే చాకలివాళ్లనూ, బాజాలు వాయించే మంగలివాళ్లను ప్రతిపక్షులు బెదిరించారు. పంతులుగారు డబ్బు విచ్చలవిడిగా వెదజల్లి ఊళ్లో ఉన్న భజంత్రీమేళాలన్నింటినీ ఒక పెళ్ళికి కుదిర్చేశారు. పెళ్ళి చేయించవలసిన పురోహితుని భార్య గోదావరిలో పడతానంది. పురోహితుడికి వంద రూపాయలు ఇచ్చారు. వంట బ్రాహ్మణులకు నీళ్లబ్రాహ్మణులకు నూరేసి రూపాయలిచ్చి నెలకు ఏడేసి రూపాయల జీతం, ఏడాదిపాటు ఉద్యోగానికి గ్యారంటీ, పెళ్ళి రోజుల్లో నాలుగేసి రూపాయల బత్తా చొప్పున ఏర్పాటుచేసి పెట్టుకున్నారు. పెళ్ళి సమయంలో హిందూ రక్షకభటులు ప్రతిపక్షులతో కలుస్తారేమో అన్న భయంతో పంతులుగారు అధికారులను చూశారు. వాళ్ళు పై స్థలాల నుండి మహమ్మదీయ, క్రైస్తవ రక్షకభటులను రప్పించారు.

పంతులు గారిని ఉద్యమ నాయకత్వాన్ని స్వీకరించమని తాను వెంట నుంటానన్న చల్లపల్లి బాపయ్యగారు పెళ్ళికి రాలేకపోయారు. అన్నలకు భయపడ నంటూ చెప్పిన ఆయనను ఆ అన్నలే ఆ రాత్రి గదిలో పెట్టి తాళం వేశారు. న్యాపతి సుబ్బారావుగారు అద్దెయింట్లో ఉంటున్నారు. పెళ్ళికి వెళితే మళ్ళీ గుమ్మంలో అడుగు పెట్టకూడదన్నారు ఇంటి యజమానులు. స్వగృహంలో ఉంటే వచ్చేవారే. అయినా చాలామంది ధైర్యవంతులు, దేశాభిమానులు తాంబూలానికే కాక భోజనాలకు కుడా వచ్చారు.

పెళ్ళి ఊరేగింపులో జిల్లాజడ్జీ, జాయింటు మేజిస్ట్రేటు, కాలేజీ ప్రిన్సిపాలు మొదలైన తెల్లదొరలు నడిచారు. పోలీసు సూపర్నెంటు దగ్గరుండి బందోబస్తు చేశారు. 'ఆ రాత్రి జరిగిన ఊరేగింపు మహోత్సవవైభవం సంస్థానాధిపతుల వివాహములందు కూడ జరిగియుండదు' అని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాశారు. తమకు ఇష్టంలేకపోయినా ఊరేగింపులో భోగంమేళం పెట్టారు. ఎంచేతనంటే 'మేళం లేని పెళ్ళి పెళ్ళి కాదంటారేమో'? తాము చేసినది సలక్షణమైన వివాహం అని నిరూపించాలి. అందుకే రాజీపడ్డారు. మెజారిటీ అభిప్రాయాన్ని మన్నించారు. నాలుగు రోజుల్లో ఇంకో వివాహం జరిపించారు.

వితంతువివాహ ప్రయత్నప్రారంభదశలో పంతులుగారికి విశిష్టజనుల కంటె విద్యార్థిజనులే ఎక్కువ సాయం చేశారు. పంతులుగారు చిన్నవాళ్ళకు పెద్దవాళ్ళకు సమానంగానే బోధించినా పెద్దవాళ్ళ గుండెలు కాలినగుండెలలాగ గట్టిపడి నూతనోప దేశాలు లోతుకు దిగలేదు. విద్యార్థుల గుండెలు పచ్చికుండలు. మెత్తన. నూతనోప దేశాలు సులభంగా నాటుకొన్నాయి. విద్యార్థులు వెన్నంటి అంగరక్షకులుగా ఉండడం వల్ల యువశక్తులు అండదండలు ఇవ్వడంవల్ల పంతులుగారు పాతికేళ్ళలో 55 పునర్వివాహాలు చేయించారు.

ఈ సంఘసంస్కారం ఇలా సాగుతూఉండగా పంతులుగారు తమ బహుముఖ ప్రజ్ఞను వివిధప్రక్రియలలో చూపించారు. సంస్కృతంనుంచి, ఆంగ్లంనుంచి నాటకాలు తెనిగించారు. స్వతంత్రనాటకాలు వ్రాశారు. వాటిని ఆడించారు. నవలలు వ్రాశారు. కావ్యాలు చేశారు. వ్యాసాలు వ్రాశారు ప్రహసనాలు గుప్పించారు. స్త్రీలకోసం రచనలు చేశారు. పత్రిక నడిపారు. రెండవ తరగతి వాచకం నుండి పండిత సమ్మతమైన కవుల చరిత్రదాకా ఎన్నో రచనలు చేశారు. వారి పుస్తకాల జాబితా తయారు చేస్తే, తాపీ ధర్మారావుగారు చెప్పినట్లు ఏదో పుస్తకాల వ్యాపారి కేటలాగు లాగ ఉంటుంది.

"తెలుగుభాషను వృద్ధి చేయవలెనన్న అభిలాషము నాకు మొదటినుండియు విశేషముగా నుండెను. నేను నా కాలమంతయు భాషాభివృద్ధి నిమిత్తమే యుపయోగించి పాటుపడిన పక్షమున గొంతవరకు నా యభిలాసము నెరవేరియుండునేమో" అని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాసుకొన్నారు. వారికి పన్నెండో యేటినుండి యుద్ధాల గురించి తపస్సుల గురించి చదవడం సరదా. పెద్దయ్యాక తామే ఎన్నో యుద్ధాలు చేశారు అభ్యుదయం కోసం ఎంతో తపస్సు చేశారు. ఆ యుద్ధాలకోసం, ఆ తపస్సు కోసం తమ చిన్నప్పటి 'అభిలాషములు' ఎన్నో మార్చుకొన్నారు. ఆదిలో భారతంలో ఆయనకు ఉత్తరగోగ్రహణం చాలా ఇష్టం. అయితే పెద్దయ్యాక ఆయన దక్షిణగోగ్రహణాన్నే స్వతంత్ర నాటకంగా వ్రాశారు. తాము చేయవలసిన నీతిబోధకి అదే అనువు.

అలాగే చిన్నప్పుడు ఆయనకు వసుచరిత్ర అంటేఎంతో మోజు.అయితే వాళ్లింట్లో ఉన్న తాటాకు కట్టల్లో అది లేదు బజారులో కొనుక్కోవచ్చు. బళ్లో జీతం కట్టకుండా ఆ సొమ్ములో పుస్తకం వాయిదాలమీద కొనుక్కొని చదవాలని ఆయన ఉబలాట పడ్డారు. ఒక నెల జీతం ఎడ్వాన్సుగా ఇచ్చి షాపులోనే కూర్చుని చదువుకొనే ఒప్పందం చేసుకొన్నారు. బడి ఎగవేస్తున్న సంగతి రెండో నెలలో బయటపడింది. పంతులుగారి తల్లిగారు పుస్తకం కొని ఇచ్చింది. వసుచరిత్రకోసం చిన్నప్పుడు తల్లిగారిని మోసం చేసిన పంతులుగారు పెద్దయ్యాక "వసుచరిత్రాది గ్రంథములు సహిత మంతగా చదువ తగినవి కావు. "అవిసహితము పరిమళయుక్తమై విషస్వభావములు గల పుష్పమాలవలె తమ సౌరభము ననుభవింప బూనువారిని కామోన్మత్తుల జేయకమానవు" అనే అభిప్రాయానికి వచ్చారు. తారాశశాంకవిజయం లాంటివి తగలెట్టమన్నారు.

సంఘసంస్కారాన్ని చేపట్టకముందు పంతులుగారు కావ్యరచన చేస్తూ గర్భ కవిత్వము, బంధకవిత్వమూ వ్రాసినవారే. అయినా 1895 లో చిత్రకవిత్వాలకు లక్ష్య గ్రంథమైన ప్రబంధరాజ వెంకటేశ్వర విజయవిలాసాన్ని నిరసించారు. గణపవరపు వెంకటకవి రచించిన ఆ గ్రంథం అముద్రితగ్రంథ చింతామణిలో నెల నెలా భాగాలుగా అచ్చు పడుతున్నప్పుడు పండితులు వేలాంవెర్రిగా మెచ్చుకున్నారు. దానికి విచారించి వీరేశలింగం గారు 'సరస్వతీ నారదవిలాపం' వ్రాశారు. నారదుడు తన తల్లి సరస్వతి ప్రస్తుతరూపాన్ని చూసి ఆనవాలు పట్టలేకపోతాడు. కారణం అడుగుతాడు. ఆమె తన దురవస్థ చెప్పుకొంటుంది.

"తెలియదు సుమ్మిపుడు నా
పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్
వెలసొమ్ములు గా కివి సం
కెల లయి కడు నాదు మేనికిన్ వెత నించున్.

"దయ మాని తుద ముట్టఁ దలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబులోపలఁ బాదంబు లిమిడించి
వీరుడై నన్ను నొప్పించు నొకడు
ప్రాసంబుపైఁ బెక్కు ప్రాసంబు లడరించి
పోటుబంటయి నన్ను బొడుచు నొకడు
బెండుపల్కులు గూర్చి ఖండించి నగలంచు
దిట్టయై చెవులు వేధించునొకడు

ఖడ్గ చక్రాది రూపమున్ గానిపించి
వర్ణముల్ మార్చి నను జిక్కు పరచునొకడు
కుమతు లొడలెల్ల విరిచి ప్రాణములు తీయ
నొడలి పస లేక శుష్కించి యున్నదాన."

భాషా సరస్వతికి మళ్లీ పంతులుగారు ప్రాణం పోశారు. ఆమెచేత దేశసేవ చేయించారు. 'దేశమంటే మనుషులోయ్' అన్న సత్యం వీరేశలింగం గారికి తెలుసు. 'దేశాభిమాన మనగా దేశములోని జనులమీద అభిమానమే' అని ఆయన స్పష్టంగా ఒక వ్యాసంలో వ్రాశారు. 'జన సామాన్యము యొక్క స్థితి బాగుపడిననే దేశాభివృద్ధి యన బడును గాని ఎవ్వరో కొందరు మహోన్నత దశను పొంది, తక్కినవారు హీనదశలో ఉన్నంతవరకు దేశాభివృద్ధి కలుగుతుందని ఎంతమాత్రము చెప్పడానికి వల్లకాదు' అని వేరొక వ్యాసంలో వ్రాశారు. మనదేశంలో సాంఘిక పతనానికి కారణం చెప్పారు.

'స్త్రీలను పురుషులను సమానముగా గౌరవించుకున్నంత కాలము మనదేశ మెంతో యున్నత స్థితి యందే యుండినది' అని ఇంకొక వ్యాసంలో వ్రాశారు. 'నిజముగా పురుషులు రాజ్యము చేయు నప్పటి కంటె స్త్రీల రాజ్యపరిపాలనములోనే ప్రజాసౌఖ్య మధికముగా నున్నదని లోకానుభవము సహస్రముఖముల ఘోషించుచున్నది. ......స్త్రీలను గౌరవముగాఁ జూచెడి యన్యదేశములమాట యటుండగా స్త్రీలను చిన్నచూపున జూచెడి యీ దేశమునందు సహితము స్త్రీలు రాజ్య పాలనము చేయ దటస్థించు భాగ్యము పట్టినప్పుడెల్లను దేశమధిక సుభిక్షముగా నుండుచు వచ్చెననియు, ప్రజ లధిక సుఖవంతులై యుండుచు వచ్చిరనియు చరిత్రములు మొరపెట్టుచున్నవి' అని రాణీరుద్రమను, అహల్యాబాయిని విక్టోరియా మహారాణి చరిత్రలో పేర్కొన్నారు.

స్త్రీలు పూనుకొనక పోతే సంఘ సంస్కారం జయప్రదం కాదని వీరేశలింగం గారి విశ్వాసం. అందుకే స్త్రీలకోసం ప్రత్యేకంగా సత్యవతి చరిత్ర, చంద్రమతీ చరిత్ర, సత్య సంజీవని అనే వచనకావ్యాలు వ్రాశారు. సత్యవతి చరిత్ర చదివాక చాలామంది తమ కుమార్తెలకు 'సత్యవతి' అని పేరు పెట్టుకొన్నారు చంద్రమతి చరిత్రలో 15 ప్రకరణాలున్నాయి, ఇందులో 10 ప్రకరణాలు చంద్రమతి విద్యాభ్యాసానికి సంబంధించినవే. ఇందులో చంద్రమతి ఉశీనర మహారాజు కూతురులాగ కాదు, ఇన్నీసుపేటలో ఎవరో ధనికుని అమ్మాయిలాగే ఉంటుంది. ఆమె వేళ్లసందున చిన్నచిన్న గజ్జి కురుపులు లేస్తాయి. ఆమె బడికి ఆలస్యంగా వస్తుంది. చివరకు కథ సుఖాంతం అయ్యాక చంద్రమతి తాను చదువుకొన్న దగుట చేత రాజ్యమంతటను బాలికా పాఠశాలలు స్థాపిస్తుంది. పంతులుగారి చేతికి ఏరాయి దొరికినా చాలు దురాచారం పళ్లూడ కొడతారు.

శాస్త్రజ్ఞానం పెరగక పోతే దురాచారాలు తొలగవన్న విశ్వాసంతో పంతులు గారు చాలా శాస్త్రగ్రంథాలు వ్రాశారు. శరీరశాస్త్ర సంగ్రహం, జంతు జ్యోతి శ్శాస్త్ర సంగ్రహం, జంతు స్వభావ చరిత్రము, గర్భిణీస్త్రీల ఉపయోగార్థం పత్నీ హిత సూచని అనే అనేక గ్రంథ రచనలు చేశారు. ప్రకృతి శాస్త్ర విషయాలలో ఒకటి తెలిసినా జనులమౌఢ్యంలో కొంతభాగం తగ్గుతుందని పంతులుగారి విశ్వాసం.

రాజశేఖర చరిత్రను, సత్యరాజా పూర్వదేశ యాత్రలను కూడా జనుల మౌఢ్యం తగ్గించడానికే వ్రాశారు. రాజశేఖర చరిత్రలో తెలుగు జీవితాలలో ఉన్న మూఢ విశ్వాసాలు, దురాచారాలు, దురభిమానాలు, ముఖస్తుతులు, మోసాలు, భూత వైద్యాలు, ఎన్నో వర్ణించి తూర్పార పట్టారు. మన సాహిత్య చరిత్రలో రాజశేఖర చరిత్ర ఒక మైలురాయి మాత్రమేకాదు సరిహద్దుఫలకం. రాజశేఖర చరిత్రను సమీక్షిస్తూ హిందూ పత్రిక విస్తుపోయింది. 'చిన్నయసూరి నీతిచంద్రికకు ఉత్తర భాగంగా ఉద్దేశించిన 'విగ్రహం' గ్రంథకర్త తన పూర్వ సాహచర్యాలను పూర్తిగా విడనాడి తెలుగు సాహిత్యంలో నూతనమార్గం అవలంబిస్తా డని మేము భావించ లేదు.' అని వ్రాసింది. 'ఆంధ్ర సాహిత్య చరిత్ర'లో రాజశేఖర చరిత్ర నూతన శకాన్ని ప్రారంభించిం దని స్పష్టం చేసింది.

తెలుగు వాఙ్మయం మీద ఇంగ్లీషు ప్రభావం గురించి పరిశోధించిన వారికి రాజ శేఖర చరిత్రపై గోల్డుస్మిత్ వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు ముద్ర గట్టిగా పడినట్లు కనబడు తుంది. సామాన్యంగా సమీక్షించే డాక్టరు జి.వి. కృష్ణారావుగారి వంటి విజ్ఞులకు 'ఏవో మూడు పాత్రలకు వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు దోహద మిచ్చింది తప్ప తక్కిన దంతా వీరేశలింగంగారి స్వతంత్ర సృష్టే!' తెలుగు నవలా పరిణామంపై కృషి చేసిన వాళ్లకు రాజ శేఖర చరిత్ర ద్వితీయ రచనే. ప్రప్రథమ రచనగా నరహరి గోపాల కృష్ణమ చెట్టిగారి రంగరాజ చరిత్రనే పేర్కొంటారు. వీరేశలింగంగారిపై సమగ్రపరిశీలన చేసిన వారికి రంగరాజ చరిత్ర అంత ప్రసిద్ధిని పొందలేదు కాబట్టి, రాజశేఖర చరిత్రే ఆద్య మనిపిస్తుంది. ఇందరు ఇన్నిరకాలుగా భావిస్తున్నా, రాజశేఖర చరిత్ర పత్రికాధి పతులచేత తదితరులచేత బహువిధాల పొగడబడ్డా, వీరేశలింగంగారి దృష్టిలో సామాన్యజనులు దానిని గ్రహింపలేక పోయారనిపించింది. 'దానివల్ల వట్టి పొగడ్తలే గాని రశ్మి యేమియు నాకు కలుగలేదు' అని స్వీయ చరిత్రలో వ్రాశారు.

పంతులుగారి గ్రంథ ప్రయోజనాల గురించి స్పష్టమైన అభిప్రాయాలు ఉన్నాయి. సామాన్యులకు పనికిరానిది వారి ఉద్దేశంలో దండుగే. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు తాము 'కాదంబరి' తెనిగిస్తున్నా మని పంతులుగారితో ఒకసారి చెప్పారు. అటు వంటి పుస్తకాలు లోకులు చదవరని అంతటి కఠినకావ్యాలను విశ్వవిద్యాలయాలు పాఠ్యపుస్తకాలుగా పెట్టరని చెప్పి ఆ అనువాదాన్ని పంతులుగారు ఆపమన్నారు.

వీరేశలింగంగారు సామాన్యులకోసం ఉద్దేశించినా వారి 'కవుల చరిత్ర'మాత్రం సాహితీపరులకే వినియోగమవుతూంది. తాము చేసిన గ్రంథాలలో కెల్ల ఆంధ్ర కవుల చరిత్ర ప్రధానమైన దని పంతులుగారే భావించారు. 'పైకి చూచువారికి కవుల చరిత్ర విషయమున నేను పడినపాటు తెలియకపోవచ్చును. గాని యే ఇతర గ్రంథరచనా విష యమునను నేనింత కష్టము పడ లేదని నమ్ముచున్నాను' అని పంతులుగారే స్వీయ చరి త్రలో వ్రాసుకొన్నారు.

వీరేశలింగంకన్నా ముందుగా గురజాడ శ్రీరామమూర్తిగారు 1876లో కవి జీవితాల రచన ప్రారంభించారు. వాటిలో చాలా పుక్కిటిపురాణాలే కావడంవల్ల వీరేశ లింగంగారు సప్రమాణికమైన కవుంచరిత్ర వ్రాయాలని సంకల్పించారు. 1886 లో ప్రారంభించారు. మొదట వివేకవర్ధనిలో ప్రకటించి పుస్తకరూపంలో ప్రచురించారు. అప్పుడా పుస్తకం డెబ్బయిరెండు పేజీలే. 1895లో రెట్టింపుకన్నా ఎక్కువ పేజీలలో వెలువడింది 'ఇంతింతై వటుడింతయై...' అన్నట్టు 1917 ముద్రణలో ప్రథమ భాగమే ఆరువందల ఎనభై నాలుగు పుటల గ్రంథంగా పెరిగింది.

వీరేశలింగంగారి సప్రమాణిక నిర్ణయాలను చూసి గురజాడ శ్రీరామమూర్తిగారు తమ పూర్వపు ఉద్దేశాలు మార్చుకొని తమ కవి జీవితాలను సంస్కరిస్తూ వచ్చారు. 1894 లో గురజాడవారి గ్రంథాన్ని సమీక్షిస్తూ పూర్వం ఆంధ్ర శబ్ద చింతామణి

నన్నయ కృతమని వ్రాసి ద్వితీయ ముద్రణములో వీరేశలింగంగారి వాదన నమ్మి ఆ ఉద్దేశం మార్చుకొన్నందుకు అముద్రితగ్రంథచింతామణి చింతించింది.

అదే అముద్రిత గ్రంథ చింతామణి 1895 లో వీరేశలింగంగారి కవుల చరిత్ర ప్రథమభాగం నాల్గవ ముద్రణ సమీక్షిస్తూ అప్పటిదాకా వచ్చిన కవి చరిత్రలన్నింటిని పేర్కొన్నారు. కావలి వెంకటరామస్వామి ఆంగ్లగ్రంథాన్ని గురజాడవారి పుస్తకాన్ని అంచనా కట్టారు. వీరేశలింగంగారి తర్వాత, వారి పుస్తకంలోంచి గ్రంథచౌర్యం చేసిన వాటిని పేర్కొన్నారు. కావలివారి వ్రాతలన్నీ పుక్కిటిపురాణాలే అని కొట్టిపారేశారు. గురజాడవారిది 'ఆంధ్ర కవుల చరిత్రమువంటి యుపయోగకారి కాదు' అని కచ్చితంగా చెప్పారు. కూరపాటి వెంకటరంగయ్యగారు ఎక్కడెక్కడ చౌర్యం చేసినదీ చూపించారు. 'ఇట్టి గ్రంథములన్నింటికిని శిరోభూషణమై వీరేశలింగంగారి కవుల చరిత్రము వెలయుచున్న'దని ప్రశంసించారు.

1895 లో తమ నలభై ఎనిమిదో యేట కవుల చరిత్ర నూతన ముద్రణ ముగించినా పంతులుగారు విశ్రమించలేదు. గ్రంథ పరిశోధనకోసం తంజావూరు సరస్వతీ మహలుకు వెళ్ళారు. అక్కడ పుస్తకాలు చదివి వాట్లోంచి కావలసిన భాగాలు వ్రాసుకున్నారు. అక్కడ ఉండే చాలా గ్రంథాలకు ప్రతులను వ్రాయించారు. మూడు సంవత్సరాలపాటు వరసగా వేసవి సెలవుల్లో చెన్నపట్నంలో నివసించి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో బ్రౌనుదొరగారు నిక్షిప్తం చేసిన గ్రంథాలు, మెకంజీ కైఫీయతులు, సూయిల్ దొరగారి శాసన సంపుటాలు ఎన్నో సంప్రదించారు. ప్రతిరోజూ పొద్దున్న పది గంటలకు భోజనం చేసి గ్రంథాలయానికి వెళ్ళి సాయంత్రం అయిదుగంటల దాకా పుస్తకాలు చదివి నోట్సు వ్రాసుకొనేవారు. నెలరోజులు కష్టపడి వ్రాసుకొన్న నోట్సు పుస్తకం ఒకనాడు ట్రాములో పోతే చదివిన పుస్తకాలే మళ్ళీ చదివి, తీసుకొన్న నోట్సే మళ్ళీ తీసుకోవలసి వచ్చింది.

ఇంతటి విపుల పరిశోధన చేశారు కనుకనే, 1917 లో కవుల చరిత్ర ప్రథమ భాగాన్ని సప్రమాణికంగా ప్రకటించగలిగారు. వీరేశలింగంగారి అసాధారణప్రజ్ఞను ఒకవంక కొనియాడుతూనే కట్టమంచి రామలింగారెడ్డిగారు కవులచరిత్రను జాతకాలు వ్రాయడమని ఈసడించారు. రెడ్డిగారి దృష్టిలో సాహిత్య చరిత్ర పరిణామ ధోరణిని కల్గించాలి. అందులోని ముఖ్య స్థితుల కుండే పరస్పర సంబంధాలను విశదీకరించాలి. నిజమే, అయితే కాలనిర్ణయం తేలకపోతే ముఖ్య స్థితులలో ఏది ముందో ఏది వెనకో ఎలా తెలుస్తుంది? అముద్రిత గ్రంథ చింతామణి చెప్పినట్టు వీరేశలింగంగారి కవుల చరిత్రవల్లనే ఆంధ్ర కవుల స్థితిగతులు హస్తామలకాలు అయ్యాయి.

ఆంధ్ర కవుల స్థితిగతులనే కాదు విశ్వవిజ్ఞానాన్ని జాతిజనుల చేతుల్లో ఉంచాలన్నది వీరేశలింగంగారి ఆకాంక్ష. తమ గ్రంథాలన్నీ సంపుటాలుగా అచ్చువేసి అందరికీ అందుబాటులో ఉంచాలని భావించారు. తమ 49 వ ఏట 1897 లో రాజమండ్రి

కాలేజిలో తమ ప్రధానోపాధ్యాయ పదవినుండి రెండేళ్లు సెలవుమీద చెన్నపట్నానికి వెళ్ళారు. ప్రెస్సు కొన్నారు. పని ప్రారంభించారు. సాహిత్య వ్యాసంగంకోసం సెలవు పెడితే సర్కారువారు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రధాన పండితుణ్ణి చేశారు. ఆ స్థానంలో ఉన్న కొక్కొండవారిని రాజమండ్రి బదిలీ చేశారు. పంతులుగారు చెన్నపట్నంలో రమా రమి ఎనిమిదేళ్ళున్నారు. ఈ దశ పంతులుగారికి హాని చేసిందని చెప్పాలి. 58 వ యేట ఆయన పింఛను తీసుకొని మళ్ళీ రాజమండ్రికి వెళ్ళేసరికి ఆయన మడుగువీడిన మత్స్యమవడం ప్రారంభించారు. రాజమండ్రిలో వా రెన్ని ప్రజాహిత కార్యాలను చేసినా విద్యార్థులకు దూరం కాజొచ్చారు. ఏ ఉద్యమానికైనా విశిష్టజనులకన్నా విద్యార్థుల సహాయమే ముఖ్యమని తొలిరోజుల్లో గ్రహించిన పంతులుగారు యువకులకు దూరం కావడం వారి రాజకీయాభిప్రాయాలవల్లనే జరిగింది.

అప్పటికే దేశంలో నేషనల్ కాంగ్రెసు స్వాతంత్ర్య సాధనకై కృషి ప్రారంభించింది. వీరేశలింగంగారికి సంఘ సంస్కారం ముఖ్యం. దాని తరవాతనే స్వాతంత్ర సముపార్జన. 'క్రూరములైన కులాచారములకు దాసులమై మన యింట నుండు స్త్రీల కష్టములను నివారింపలేనివారము రాజ్యాంగ స్వాతంత్ర్యములను పొంది దేశముయొక్క కష్టముల నెట్లు నివారింపగలము?' అని 1885 లోనే ప్రశ్నించారు. ఇంగ్లీషు ప్రభుత్వం ఒక్క సంవత్సరం రాజ్యభారమంతా భరతఖండవాసులమీదనే పూర్ణంగా విడిచిపెట్టి పైనుంచి పర్యవేక్షించకపోతే రాజ్యమంతా ఛిన్నాభిన్నమై దేశం అరాచకమైపోతుం దని వారి విశ్వాసం.

ఇటువంటి అభిప్రాయాలు 1905 లో వందేమాతరం ఉద్యమ సంరంభంలో చెప్తే విద్యార్థులు వింటారా? బిపిన్ చంద్రపాల్ 1906 లో ఆంధ్రదేశ పర్యటన చేసి మహోద్రేకంతో ఉపన్యాసాలు ఇచ్చాడు. యువకులు స్వాతంత్రోద్యమంలో దూకారు; కళాశాలలు వదలి పెట్టారు. ఇది పంతులుగారికి రుచించలేదు. "లోకానుభవము విశేష ముగా లేని వారగుట చేత యువజనులు తాత్కాలిక వీరావేశముచేత తలలు విరియ బోసికొని 'వందేమాతరమ'ని కేకలు వేయుచు, చేతులలో ధ్వజములను, మెడలో స్వదేశీ పతకములను ధరించి, విచ్చలవిడిగా తిరగజొచ్చిరి. పాఠశాలలోని బాలురు సైత మీ యల్లకల్లోలములో బడి పాఠముల నుపేక్షించి యుపాధ్యాయులను తిరస్క రించి యనేకులు పాఠశాలలనుండి తరిమి వేయబడిరి. మా సమాజములో జేరకపోగా యభినవ దేశాభిమానుల వలన నాకు చిక్కులును, మనస్తాపములును కలుగుచు వచ్చెను. ఏ యీడువారి కా యీడువారి మాటలు రుచించును గాని, పెద్దవారి హితవచన ములు పథ్యములుగా నుండవు. వృద్ధులు బుద్ధులు లేని శుద్ధావివేక సమృద్ధులని యువ జనుల యభిప్రాయములు. నా యుపదేశములనుబట్టి వారు నన్ను దేశాభిమాన శూన్యు నిగా పరిగణించినారు" అని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాశారు.

అప్పటిదాకా పంతులుగారి శిష్యులై, భక్తులై వారి పేరిట గ్రంథాలయాన్ని స్థాపించిన నాళం కృష్ణారావుగారి వంటి యువకులు తిరుగుబాటు చేశారు. బెంగాల్

విప్లవవీరుడు కుదీరాంబోసు చిత్రపటాన్ని నాళం కృష్ణారావుగారు పెట్టారు. ఎవరు తీసెయ్యమన్నా తీయలేదు. పంతులుగారి పేర నున్న గ్రంథాలయంలో ఉన్నది "విద్రోహి ఫోటో" కనుక తెల్లదొరలు పంతులుగారిని సంజాయిషీ ఇమ్మన్నారు. నాకేం సంబంధం లేదని పంతులుగారు వ్రాశారు. యువకుల దృష్టిలో పతనమయ్యారు. కుముదవల్లిలోనూ భీమవరంలోనూ జరిగిన సభల్లో యువకులు 'ఇంగ్లీషువాళ్ల రక్తం ప్రవాహాలు కట్టించాలి' అని బహిరంగసభలో గర్జించినప్పుడు ఆ సభలకు అధ్యక్షత వహించిన పంతులుగారికి ఆ మాటలు కర్ణకఠోరంగా ఉన్నాయి. ముందుగా పుట్టిన గాంధీగారిలాగ ఇంగ్లీషువానిని ద్వేషించ కూడదని, స్వాతంత్ర్యంకోసం వినయంతో విన్నవించా లని పంతులుగారు చెప్పారు. యువకులు పంతులుగారికి 'పిరికి పంద' అనే నూతన బిరుదాంకాన్ని ఇచ్చారు.

రాజకీయాల్లో తరాల అంతరాలవల్ల పంతులుగారు యువశక్తికి దూరమైనా నడివయస్సువాళ్ళింకా పంతులుగారి పట్ల విధేయులే. పంతులుగారు ఆస్తికోన్నత పాఠశాలను కట్టించారు. వితంతు శరణాలయాన్ని, పతిత స్త్రీ సముద్ధరణ గృహాన్ని, హితకారిణీ సమాజాన్ని స్థాపించారు. తమ సర్వస్వాన్నీ హితకారిణీ సమాజాలకే వ్రాసి ఇచ్చేశారు. వారి అరవై రెండో యేట భార్య రాజ్యలక్ష్మమ్మగారు పోయారు. అప్పటి నుండి పంతులుగారి 'అసహాయదశ' ఆరంభమైంది. అపనిందలు, చికాకులు వచ్చిపడ సాగాయి. 'నా ప్రస్తుతావస్థను తలచుకొనగా పూర్వపు వీరేశలింగము గాక తచ్ఛాయా విగ్రహము మాత్రమే నిలిచి యున్నట్లుతోచు చున్నది' అని పంతులు గారే వ్రాసుకొన్నారు.

రాజకీయాల్లో లాగే భాషావిషయంలో కూడా పంతులుగారు అభ్యుదయ వర్గాలకు దూరం కాజొచ్చారు. పిఠాపురం మహారాజా వారిని నొప్పించకూడదని కాబోలు గ్రామ్యభాషా నిరసన సభల్లో పాల్గొన్నారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వేదిక మీద పంతులుగారి పూర్వ శత్రువులు కొక్కొండ వారు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారు ఉమ్మడి శత్రు సంహారానికి ఏకమయ్యారు.

యువకులు పంతులుగారి జీవితంలో మచ్చలు చూశారు. రచ్చకీడ్చారు రభస చేశారు-పంతులుగారి మీద ప్రత్యర్థులు-ప్రతర్థులమీద పంతులుగారు పరువు నష్టపు దావాలు పరిపాటి అయ్యాయి. వారి 66వ యేట ఆయన ప్రవర్తనపై జాయింట్ మేజిస్ట్రీటు నిందాగర్భమైన రిమార్కులు వ్రాశాడంటే నమ్మశక్యంకాదు. "వీరేశలింగంగారి నిరంకుశత్వం, అవకతవక పనులను అందరికిని తెలియును. అయితే నేమి ఆయన ఒక పెద్ద దేవుడు. పెద్ద దేవుళ్లు చేసే అవకతవక పనులు అవకతవక పనులు కావు. పెద్దదేవుళ్ల నిరంకుశత్వము నిరంకుశత్వము కాదు!" అని టంగుటూరి శ్రీరాములుగారు ఆరోపించారు. బ్రహ్మసమాజం సభ్యులలో కూడా అసంతృప్తి వచ్చింది. బ్రహ్మమత వ్యాప్తికోసం కాకినాడనుండి ప్రచురిస్తున్న "ధర్మసాధని" కూడా పంతులుగారిని ప్రజాసేవ నుండి విరమించమని వ్రాసింది

అన్నిటికన్నా విడ్డూరం-పంతులుగారు తమ స్వంతధనంతో కట్టించి పురజనులకు కానుకగా ఇచ్చిన పురమందిరంసభ్యత్వంనుండి ఆయననే తొలగించాలని తీర్మానం తెచ్చారు యువకులు. ఆ తీర్మానం ఓడిపోయింది. కాని ఆ ఊహ అసలు పుట్టడమే తరాల అంతరాలను సూచిస్తుంది. "ఈ పట్టణములోని యిప్పటి తరము వారితో నాకు పరిచయము లేదు. నాకు శత్రువులు కూడ నున్నారు. ఇచ్చట నాకు నమ్మకమైన స్నేహితులు చాలా తక్కువగా ఉన్నారు" అని ఒక ఉత్తరంలో పంతులుగారు స్నేహితునికి వ్రాశారు. 69 వ యేట "నా కాల మయిపోయినది, నాపని తీరినది" అన్న భావానికి వచ్చారు. అయినా తమ రచనలన్నింటిలో ప్రధానమైన కవులచరిత్ర పరిష్కరించాలన్న ఆశ వారిలో ఉంది. ఆ కార్యంలో నిమగ్నులయ్యారు. పని చేపడితే పంతుగారు బలవంతులవుతారు. "కవులచరిత్రము సరిపరుచుట కొరకే యీశ్వరుడు నాకారోగ్యము దయచేయుచున్నాడేమో" అని పంతులుగారు భావించారు. కవుల చరిత్ర ప్రథమ భాగాన్ని సుపరిష్కృతంగా ప్రచురించారు. ఒకటి రెండు పుస్తకములు వ్రాయుటలో తప్ప నేను తలపెట్టిన కార్యాలన్నీ నెరవేరాయని పూర్వం తృప్తిపడి ఊరుకొన్నారు గాని ఆ ఒకటి రెండు పుస్తకాలు కూడా వ్రాద్దామని నూతనోత్సాహాన్ని పుంజుకొన్నారు.

పంతులుగారు రాద్దామని మానేసిన పుస్తకం ఒక గొప్ప లక్షణ గ్రంథం. దాన్ని 'నవ్యాంధ్ర వ్యాకరణం' అనేపేర రచించ సాగారు "తెనుగున కున్న వ్యాకరణదీపము చిన్నది" అన్న భావం సంస్కృత భాష చదువుకొని తెలుగులో వ్రాసే వాళ్లలో విపరీతం. పంతులుగారు సంస్కృతఫక్కిలో కాక తెలుగు వ్యాకరణం ఇంగ్లీషు బాణీలో వ్రాయాలని వారి ఇరవై అయిదో యేటనే భావించారు "సంగ్రహ వ్యాకరణం" వ్రాశారు. దానిని పాఠశాలల్లో పఠనీయగ్రంథం చేశారు. మొదటి కూర్పు అల్ప కాలంలోనే అమ్ముడయి పోయింది "ఆపుస్తక మిప్పుడును మనదేశము నందలి పాఠశాలలలో మాత్రమే కాక నైజాము రాష్ట్రమునందును వాడబడుచున్నది" అని పంతులుగారు తమ స్వీయచరిత్రలో చెప్పారు.

ఆయన కాలేజీలో పాఠాలు చెప్పేటప్పుడు సైతం తెలుగువ్యాకరణమంతా పది సూత్రాలలో సంక్షిప్తంగా చెప్పేసి, చిన్నయసూరి వ్యాకరణాన్ని నిరసించేవారు. (ఈ మాటలు వారి శిష్యులు ఆచంట లక్ష్మీపతి గారు చెప్పారు). చిన్నయసూరి వ్యాకరణం పేరుకు బాలవ్యాకరణమే గాని నిజానికి కబ్బాల వ్యాకరణం. తెలుగు వ్యాకరణమని చెప్పుకొంటున్నా మొదటి సూత్రం 'సంస్కృతంబునకు వర్ణములిన్ని' అని చెప్తుంది. పంతులుగారు పైలాపచ్చీసులో వ్రాసిన వ్యాకరణంలో ఆంధ్రభాషలో అక్షరా లెన్నో చెప్పారే గాని సంస్కృతం ఊసెత్తలేదు. యౌవనంలోనేగాక పండు ముసలితనంలో వ్రాస్తున్న నవ్యాంధ వ్యాకరణంలో నవీనయుగ లక్షణాలను గుర్తించి వాటికి అనువుగా సూత్రాలు రచించారు. నవకవిత్వాన్ని అంగీకరించారు. పద్య కవిత్వం సశృంఖలం, విశృంఖలం అని రెండువిధా లని పేర్కొన్నారు. గణనియమంలేనిది

యతి ప్రాస నిబద్ధం కానిది విశృంఖల కవిత్వ మన్నారు. అందులో యతికి మారుగా విరతి అపేక్షణీయ మన్నారు. విరతి అంటే యతిస్థానంలో అక్షరమైత్రికి మారుగా నూతన పదం ఆరంభంకావడం.

నవకవిత్వాన్ని, ఆధునిక రీతుల్ని అంగీకరించడంలో పంతులుగారు మళ్లీ సమాజంలోని 'జీవ చైతన్య స్రవంతి'లో పయనించసాగారు. ఒక సారి గ్రామ్య భాషా నిరసన సభలో పూర్వం పాల్గొన్నా ఇప్పుడు వ్యావహారిక భాషావాదుల మతం సమం జసంగానే తోచింది. వెంటనే తమ తోటలోనే 'ఆధునిక విద్వత్సభ' ఏర్పాటు చేశారు. వాడుక భాషను ఆమోదించారు. తాము అధ్యక్షులుగా గిడుగు రామమూర్తిపంతులుగారు కార్యదర్శిగా 'వర్తమానాంధ్ర భాషా ప్రవర్తకసమాజాన్ని' స్థాపించారు. గ్రంథరచనలో వ్యవహారంలో ఉన్న రూపాలే ఉంచాలి. లేని వాటిని పట్టుకు పాకులాడ కూడదని నిశ్చయించారు. అవసరమైన అన్యదేశ్యాలను చేర్చుకోవాలి అని భావించారు.

ఈ నిర్ణయాలు ఆయన ఎన్నడో తమరచనలో పాటించినవారే. 'పెద్దయ్యగారి పెళ్లి పుస్తకం,' 'ప్లీడరునాటకం' వ్యవహారంలో ఉన్న రూపాలని స్వీకరించాయి. తమ సంఘ సంస్కారానికి ఏ రూపం అవసరమైతే ఆ రూపాన్నే ఆయన స్వీకరించారు. సంఘసంస్కారం కుంటుపడుతుందనే ఆయన రాజకీయ స్వాతంత్ర్యాన్ని ద్వితీయ స్థానంలో ఉంచారు. ఇంగ్లీషువాళ్ల పరిపాలన, పర్యవేక్షణ లేకపోతే దేశం కుక్కచింపిన విస్తరి అవుతుందని చెప్పడంలో ఇంకో అంతరార్థం ఉంది. మళ్లీ మూఢాచారాలు తలఎత్తుతాయని వారి భయం, పరపాలన తొలగిన కొన్ని నెలల్లోనే రాజ్యమంతా ఛిన్నాభిన్నమై ఒకపార్టీ వారు ఇంకో పార్టీతోను, ఒక మతంవారు ఇంకో మతంతోనూ ఒక రాష్ట్రంవారు ఇంకో రాష్ట్రంతోనూ పోరాడుతారని ఆయన ఆదిలో జోస్యం చెప్పారు. ఆయన భయపడిన విషయం మరొకటి నిజమైంది. స్వాతంత్ర్యం రాగానే అల్పసంఖ్యాకులైన విద్యాధికుల్ని అధిక సంఖ్యాకులైన మూఢ జనులు అణగ తొక్కేస్తారని ఆయన అప్పుడే చెప్పారు. పార్టీల ఆదేశాల చేత దేశం అరాచక మవుతుందన్నారు.

నేటికి రమారమి తొంభై సంవత్సరాల కింద పంతులుగారు వెలిబుచ్చిన భయాలు చాలావరకు నిజమే అయ్యాయి గాని ప్రజలు ఉద్రేకపూరితులై ఒక నూతనోద్యమంలో దూకుతున్నప్పుడు ప్రజానాయకుడు ఎంత పూజనీయుడైనా సరే, చేదు సత్యాలు చెప్పినా సరే, ప్రజల ఆగ్రహానికి గురి అవుతారు. పంతులుగారు కూడా రాజకీయంగా అభివృద్ధి నిరోధకుల కోవలో పడిపోయారు. స్వచ్ఛందవృత్తిలోని గౌరవం పంతులుగారికి తెలియనిది కాదు. సత్య హరిశ్చంద్ర నాటకంలో హరిశ్చంద్రుని నోటంట ఆయన తమ ముప్ఫయ్యో ఏట ఇలా అనిపించారు.

"పృథివిలోపల పరతంత్రవృత్తితోడ
బడయునట్టి మహేంద్రవైభవము కంటె

ఉత్తములు తాము స్వచ్ఛందవృత్తితోడ
కొంది విభవంబె గొప్పగా తలతు రెపుడు."

అయినా ఆ 'స్వచ్ఛందవృత్తి'కి ఆటంకమైన అభిప్రాయాలు చెప్పబట్టి పంతులు గారిని వారి భక్తుల్లో ప్రముఖులైన చిలకమర్తివారే 'పూర్వకాలపువాడి' గా జమకట్టారు. పంతులుగారివంటి కార్యశూరులు ఎప్పుడూ వెనుకటి సంచికల్లాగ పడి ఉండలేదు. రాజకీయంగా కాకపోయినా సాహిత్యరంగంలో 'ఈ కాలపువాడి'గా సేవచేయాలనే ఆయన నవ్యధోరణులను ఆకళించుకొని వాటికి చేయూతనిచ్చారు. తమ స్వీయచరిత్ర మూడవ భాగాన్ని పూర్తిచేయాలని, కవుల చరిత్ర రెండో భాగాన్ని పరిష్కరించాలని ఆయన తమ 71 వ యేట చెన్నపట్నానికి వెళ్ళారు. చురుకుగా పని చేస్తూ రచనా వ్యాసంగం లోనే కలం చేత్తో పట్టుకొని కన్ను మూశారు.

మహానుభావులు మరణించిన మరుక్షణం నుంచీ మళ్ళీ జాతి చైతన్యంలో జీవిస్తూనే ఉంటారు. వారి ఆశయాలూ, ఆదర్శాలు అసంపూర్ణమైతే వాటిని నెరవేర్చడానికి యువతరం పూనుకొంటుంది వారు దీవించిన వ్యావహారిక భాషోద్యమం నేటికి ఫలించింది. వారు తెచ్చిన వికాసం వెలుగులు వెదజల్లుతుంది. ఆయన మరణిస్తూ ఇచ్చిన సందేశంలోని చివరి మాటలు ఇంకా మాటలుగానే కొన్ని సందర్భాల్లో మిగిలిపోయాయి. "అజ్ఞానంతో, అమాయకత్వంతో జీవితసంస్కారంలేని ప్రజాసామాన్యానికి విద్య, విజ్ఞానం, సమానత్వం, సంస్కారం కలిగించడానికి కృషి చేయా"లని ఆయన ఆదేశించారు. తమ జీవితంలో ఆయన చేసింది అదే. చిలకమర్తివారు ఒక పద్యంలో పంతులు గారి జీవిత చరిత్రను చెప్పేశారు.

"తన దేహము తన గేహము
తన కాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘను డీ వీరేశలింగకవి జనులారా !"

ఈ మాటలు అక్షరాలా సత్యాలు. అదేం చిత్రమోగాని తాము శారీరకంగా దుర్బలులైనా జాతిని బలిష్ఠం చేసి దేశాభివృద్ధిని, భాషాభివృద్ధిని సాధించిన మనోబల భీములలో పంతులుగారు ప్రథములు. రెండోవారు గురజాడవారు. పంతులు గారికి 'గద్యతిక్కన', "దక్షిణభారత విద్యాసాగరుడు" మొదలైన బిరుదు లున్నాయిగాని అవి వారి బహుముఖ ప్రజ్ఞలకు చాలా ఇరుకైనవి. విద్యాసాగరులలాగే పంతులుగారు కూడా పునర్వివాహాలు చేయించినా, శరణాలయాలు స్థాపించినా, రచనావ్యాసంగంవల్ల జీవనోపాధి ఏర్పరచుకొన్న గ్రంథకర్తలే అయినా ఆ పోలికలు కొంతవరకే. విద్యాసాగరులు మధ్యలో విసుగెత్తి ఉద్యమం మానుకొన్నవారు. పంతులుగారు చివరిదాకా పోరాడిన వీరులు

విద్యాసాగరు లంటే పంతులుగారికి చాలా గౌరవం. అందుచేత చంద్రమతీ చరిత్రలో చంద్రమతికి విద్యాసముద్రునిచేత చదువు చెప్పించారు. ఈశ్వరచంద్ర విద్యాసాగరుల చరిత్ర వ్రాస్తూ వారి సాహిత్యవ్యాసంగాన్ని పంతులుగారు ఇలా అంచనా వేశారు: "ఈతడు చేసిన గ్రంథములలో విశేషభాగ మింగ్లీషునుండియు, సంస్కృతము నుండియు, హిందీభాషనుండియు చేయబడిన భాషాంతరములే యయినను, మంచి వచన శైలిని వ్రాయబడిన వగుటచేత నవి బంగాళభాషలో మంచి వచనకావ్యములకు మార్గదర్శకము లయ్యెను."

'దక్షిణభారత విద్యాసాగరు'డన్న బిరుదున్న పాపాన పంతులు గారి సాహిత్య వ్యాసంగానికి కూడా మనం ఇలాగే అంచనా కట్టి వారిని 'గద్యతిక్కన' అన్న ఒక్క బిరుదుతోనే పూజించడం భావ్యం కాదు. వి. టి. రాజుగారు అన్నట్టు పంతులు గారి బహుముఖప్రజ్ఞకు గద్యతిక్కన బిరుదు న్యాయం చేకూర్చదు.

ఆ బహుముఖ ప్రజ్ఞవల్లనే వారు ఆంధ్రదేశనాయకులలో ఎందరినో ప్రభావితులను చేశారు. 'ఒరులే యవి యొనరించిన' అన్న వివేకవర్ధని ఆదర్శాన్ని అనుకరింప చేశారు. బ్రహ్మర్షులు, ఆంధ్రకేసరులు, దేశభక్తులు, విశ్వదాతలు, కాంగ్రెసు చరిత్రకారులు, గ్రంథాలయపితామహులు ఒకరేమిటి గడిచిన రెండు పురుషాంతరాలలోని మహాపురుషులందరూ పంతులుగారి అడుగుజాడలలో నడచినవారే; అభ్యుదయ భావాలను చేపట్టినవారే.

అటువంటి ఉజ్జ్వలచారిత్రుడిని ఏ బిరుదుతో వర్ణించినా అది అసమగ్రమే. అయినా వైతాళికులనే మేలుకొల్పినవాడు అని గురజాడను ముద్దుకృష్ణ అభినందించినట్టు, నవ్యాంధ్రనిర్మాతలనే నిర్మించిన వారిగా నేను పంతులుగారిని భావిస్తున్నాను.

అభినవాంధ్రకు ఆయన ఆద్యబ్రహ్మ !



# అద్యతనాంధ్ర కవిప్రపంచనిర్మాతలు

# తిరుపతి వేంకటకవులు

## ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

బహుసరసకావ్యరచనచేతనే కాక అష్టశతావధానాచరణములచేతను, ఆశుకవితాప్రదర్శనముల చేతను, ఆంధ్రదేశమునందలి సహృదయులనెల్ల నానంద పరవశులఁ గావించిన కవిపుంగవులు శ్రీ తిరుపతివేంకటేశ్వరులు ఆధునికాంధ్రకవిశేఖరులలోఁ బలువురు వారికి శిష్యులో ప్రశిష్యులోనై యుండుటచే శ్రీ పింగళి కాటూరి కవు లన్నట్లు వారి నద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత లని చెప్పవచ్చును. ఆ రోజులలో వారికి శిష్యులగుటయు, వారిని గురువులుగా పేర్కొనుటయు నొక గొప్పగా భావింపఁబడుచుండెను. విద్వత్తాపరిపూర్ణమైన కవిత్వమును దృష్టియం దిడుకొని చూచినచో నాధునికాంధ్రయుగమున వారిని యుగపురుషులుగఁ దలపవచ్చును. వారు ప్రసన్నమధురము, సర్వబోధము నైన పద్యరచనాశైలికిఁ బ్రచారము కలిగించి, తమంతవారైన పలువురు శిష్యులను సృజించి ఆంధ్రవాఙ్మయమున కపారమైన వికాసము నావహించి యుండిరి. ఆంధ్రమున వరాహపురాణ ప్రబోధచంద్రోదయములు రచించిన నంది మల్లయ ఘంటసింగనలు మొదటి జంటకవులు. ఇటీవల జంటకవులు పలువురు వెలసియున్నారు. కాని రచనయందే కాక నామములందును, మనసులందును శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులకువలె అత్యంత సామరస్యసంపద కుదిరిన వారెందఱో లేరు. తిరుపతి క్షేత్ర వేంకటేశ్వర దైవములకు వలె శ్రీ తిరుపతివేంకటేశ్వరకవుల కవినాభావము కల్పించుట భగవంతుని అఘటనఘటనాపాటవమునకుఁ దార్కాణము.

శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులలో మొదటివారైన దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు ప్రస్తుతము పశ్చిమగోదావరీ మండలమునకుఁ జెందిన ఎండగండి గ్రామమున వైదిక బ్రాహ్మణ కుటుంబమందు 1872 వ సంవత్సరమున జన్మించిరి. రెండవవారైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తూర్పుగోదావరీ మండలమందలి కడియము గ్రామమున ఆరామద్రావిడ బ్రాహ్మణ వంశమున 1870 వ సంవత్సరమున నుదయించిరి. ఆ రోజులలో చర్ల బ్రహ్మయ్యశాస్త్రులుగా రను పండితోత్తములు కాశియందు వ్యాకరణశాస్త్ర మభ్యసించి వచ్చి, తాడేపల్లిగూడెము సమీపమునందలి కడియెద్ద యను గ్రామమున సంస్కృతపాఠశాల స్థాపించి, విద్యార్థుల కుచితముగా భోజనము పెట్టుచు వ్యాకరణపాఠములు బోధించ

చుండిరి. శ్రీ తిరుపతిశాస్త్రిగారును, వేంకటశాస్త్రిగారును వారియొద్ద వ్యాకరణశాస్త్రమభ్య సించుటకై యరిగి సహాధ్యాయులైరి. తిరుపతిశాస్త్రిగారు గురుసన్నిధికి చేరిన తరువాత నాలుగైదు మాసములకు వేంకటశాస్త్రిగారు వచ్చి కలసికొనిరి. అప్పటికి తిరుపతిశాస్త్రి గారు సంస్కృత సాహిత్యము గడించి కౌముదిలో కారకపరిచ్ఛేదము పూర్తిచేయ నుండిరి. వేంకటశాస్త్రిగారు గురుసన్నిధికి వచ్చువఱకే సంస్కృతాంధ్ర సాహిత్యము లందు నిష్ణాతులై తెలుఁగున కవిత్వము చెప్పఁగలిగి యుండిరి. తిరుపతిశాస్త్రిగారు వారి నుండియే యాంధ్రచ్ఛందోలక్షణముల నెఱింగి తామును గవిత్వము చెప్ప నారంభించిరి. ఈ కారణముచే సంభాషణపట్లఁ గాకపోయినను వ్రాఁత పట్టున వారు వేంకటశాస్త్రి యెడ గురుభావమును ప్రదర్శించుచునే యుండిరి. వారిరువురును గొంతకాలము వేఱు వేఱుగనే కవిత్వము వ్రాయుచుండినను క్రమముగ కలసి చెప్పుట కారంభించి జంట కవులైరి.

> "ఇరువురుఁ గూడియే రచన యెప్పుడు చేయుదు రొక్కవేళ నొ
> క్క రొకటి యొక్క రింకొకటి కైకొని చేయుదు రందు హెచ్చుత
> గ్గొరులకుఁ గానరాక యది యొక్కరు చేసిన భంగి నుండు నొ
> క్కరు రచించిరేనియును గాఁదగు తిర్పతివేంకటీయమై"

అని వారు పెట్టుకొనిన నియమము చాలవఱకు పాటింపఁబడినది. వారు మొట్టమొదట సంస్కృతముననే కావ్యరచన కావింప నారంభించినను సర్వజనోపయోగము దృష్టియం దిడుకొని తరువాత క్రమముగా తెలుఁగుననే యెక్కువగా రచింపఁదొడంగిరి. వారు మొదటి శతావధానమును కాకినాడపురమున నొనరించిరి. వారి శతావధానములకు కాకినాడ శతావధానమువలెనే, రాజసందర్శనములకు వేంకటగిరి రాజసందర్శన మారంభము. తరువాత వారు పెక్కు ప్రదేశముల కరిగి తమ యవధానాశుకవితాకౌశలముచే సహస్రముల కొలఁది సభాసదుల నలరించి యనేకములైన సన్మానముల నందియుండిరి. బుద్ధచరిత్ర కృతిస్వీకరణానంతరము పోలవరము జమీందారుగారు వారిని దమ యాస్థానకవులుగా నుండఁగోరిరి అప్పుడు వేంకటశాస్త్రిగారి ప్రేరణమున తిరుపతిశాస్త్రి గారు పోలవరము జమీందారుగారి ఆస్థానకవిగా నుండ నంగీకరించి, 1901 వ సంవత్స రమున కాపురమును ఎండగండినుండి కాకినాడకు మార్చిరి. తరువాత మూఁడేండ్లకు అనఁగా 1904 వ సంవత్సరమున వేంకటశాస్త్రిగారు బందరునందలి హిందూ హైస్కూలులో నాంధ్ర పండిత పదవి స్వీకరించిరి. తిరుపతిశాస్త్రిగారు కాకినాడ వచ్చినప్పటి నుండియు జమీందారుగారు నడుపుచుండిన సరస్వతీ పత్రికను నిర్వహించు బాధ్యత వహించిరి. వా రాపత్రికకొఱకై పూర్వకవి రచిత కావ్యములను బరిష్కరించి యిచ్చుటే కాక తాము స్వయముగాఁ గొన్ని గ్రంథములనుకూడ రచించి యిచ్చుచుండిరి. ఆ పత్రిక సుమారు పదుమూఁడేం డ్లాంధ్ర సరస్వతి కవిచ్ఛిన్నమైన సేవ యొనరించి 1912 వ సంవత్సరమున పంచమ జార్జి చక్రవర్తి పట్టాభిషేక సంచికతో నాగిపోయి నది. బందరునందలి వేంకటశాస్త్రిగారి ఉపాధ్యాయ జీవితమున కాంధ్ర వాఙ్మయముపైఁ

గల ప్రభావమపారమైనది. అంతకుముందతిలాఘవముగా పరిగణింపఁబడుచుండిన ఆంధ్రపండిత పదవికి వా రపారమైన గౌరవము కలిగించిరి. ఆ కాలమున వారికి శిష్యులుగా నుండిన వారిలోఁ బలువురు మహాకవులై ఆధునికాంధ్ర వాఙ్మయాకాశమున నుజ్జ్వల తారకములై విరాజిల్లిరి. పింగళి కాటూరి కవులు, విశ్వనాథవారు మున్నగువా రప్పుడు వారికి శిష్యులుగా నుండు భాగ్యమునకు నోచుకొన్నవారే. వేంకటశాస్త్రిగారు సుమారు పదుమూఁడేండ్లాంధ్రపండితపదవి నిర్వహించి, తరువాత నుద్యోగమును విడిచి కడియము గ్రామమున నివసించిరి. 1918వ సంవత్సరమున పోలవరము జమీందారుగారు వ్యాధిగ్రస్తులై మరణించిరి. అనంతరము కోలంక వీరవరముల నేలు జమీందారురాలైన శ్రీ రావురామాంబికగారు తిరుపతిశాస్త్రిగారిని పోషించిరి. తరువాత తిరుపతి శాస్త్రిగారు రెండేండ్లు మాత్రము జీవించి 1920వ సంవత్సరమున తమ సహపాఠులైన వేంకటశాస్త్రిగారినేకాక సకలాంధ్ర ప్రపంచమును దుఃఖాంధకారమున ముంచి దివంగతులైరి.

తిరుపతివేంకటకవులు సుప్రతిష్ఠితులైన పిమ్మట వారికి సమకాలికులైన కొందఱితరకవులతో వాగ్వివాదములు కలుగుట సంభవించెను అవి వారికి మనశ్శాంతి లేకుండఁ జేసినను ఆంధ్రవాఙ్మయమున కభ్యుదయకరములుగానే పరిణమించినవి. గిరతము, గుంటూరుసీమ అనుగ్రంథములు వానికి ఫలముగా నుదయించినవే. అందు మొదటిది వారికి శిష్యులైన వేంకటరామకృష్ణకవులతోడను, రెండవది కొప్పరపుకవుల తోడను జరిగినవాగ్వివాదములను వర్ణించుగ్రంథములు. తిరుపతిశాస్త్రిగారు మరణించిన పిమ్మట వేంకటశాస్త్రిగారు సుమారు ముప్పదియేండ్లు జీవించిరి. వా రప్పుడు కూడా పలువురు రాజులను దర్శించి సన్మానములందిరి. రచనావ్యాసంగమును వా రెప్పుడును మానియుండలేదు. కాని యవధానములను మాత్రము చేసినట్టు కనఁబడదు. ఒకటి రెండుసార్లు వారు శ్రీ కాశీకృష్ణాచార్యులవారితోఁ గలసి యవధానము లొనరించినట్లు వినికిడి. వారికిఁ బూర్వజీవితమున శిష్యులతోవలె నుత్తరజీవితమున గురువులైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారితో వాగ్వివాదము జరుగుట సంభవించెను. శ్రీముఖ సంవత్సరమున వారికి మచిలీపట్టణమందు షష్టిపూర్తిమహోత్సవ మత్యంతవైభవోపేతముగ జరిగెను. పిమ్మటవారి యారోగ్యము క్రమముగా క్షీణించెను చివరిరోజులలో వారు విజయవాడలో నుండిరి. మంచముమీఁదనుండి దిగలేనిస్థితియందుఁ గూడ వా రేదో రచన గావించుచుఁ "గవనార్థం బుదయించితి" నను తమవచనమును సార్థక మొనరించుచునే యుండిరి. 1949 సంవత్సరము మార్చినెలలో సంయుక్తమదరాసుప్రభుత్వ మన్నిభాషలలో నాస్థానకవుల నేర్పఱుప నిశ్చయించి వేంకటశాస్త్రిగారిని ప్రథమాంధ్రాస్థానకవిగా నియమించెను. ఆసందర్భమున వేంకటశాస్త్రిగారిని అభినందించుటకై విజయవాడలో బ్రహ్మాండమైన సన్మానసభ జరిగెను. ఆసభలో సర్వాంధ్రజనులును బాల్గొని తిరుపతివేంకటకవులపైఁ దమకుఁగల భక్తిగౌరవములను వెల్లడించిరి. వేంకటశాస్త్రిగారు తరువాత స్వల్పకాలము జీవించి 1950 ఫిబ్రవరి 15వ తేదిని మహాశివరాత్రి పర్వదినమున శివసాయుజ్యము నొందెను.

తిరుపతివేంకటకవులు పద్యకావ్యములు, గద్యకావ్యములు, రూపకములు, విమర్శలు, వ్యాసములు మున్నగుగ్రంథములు శతాధికములుగా రచించియుండిరి. వానిలోఁ గొన్నియనువాదములు, పెక్కు స్వతంత్రములు. తిరుపతిశాస్త్రిగారి మరణానంతరము వేంకటశాస్త్రిగా రొక్కరుగా రచించినగ్రంథములుగూడ నొక్క "కథలు గాథలు" అను పేరు గల వ్యాససంపుటితప్ప మిగిలినవన్నియు తిరుపతివేంకటీయములు గానే ప్రచురింపఁబడినవి.

తిరుపతివేంకటకవు లారంభమున సంస్కృతమునందే రచన సాగించిరి. రామాయణకథావస్తుకమై పాణినీయధాతురూపముల కుదాహరణములైన ప్రయోగములతోఁ గూడిన ధాతురత్నాకర మను చంపూగ్రంథము వారిమొదటిరచన. వారు తరువాత శృంగారశృంగాటక మను వీధినాటకమును సంస్కృతమున రచించిరి. పిమ్మట లక్ష్మీసహస్రము నొఅవడిగా గ్రహించి కాశీసహస్రమును వ్రాయ నారంభించిరిగాని యది సుమారు మూఁడువందలశ్లోకములతోనే నిలిచిపోయెను. వేంకటశాస్త్రిగారు కాశి కరిగినపుడు కాశి, అన్నపూర్ణ, విశ్వేశ్వరుఁడు, గణపతి, కాలభైరవుఁడు మున్నగు దైవములనుగూర్చి అష్టకములను రచించియుండిరి. తరువాత నొకప్పుడు నెల్లూరుపురమున కరిగిన సందర్భమున తిరుపతివేంకటకవులు పురజనులకోరికపై సంస్కృతమున మూలస్థానేశ్వరస్తుతి శతకము నాశువుగా రచించిరి. చివరిరోజులలో వేంకటశాస్త్రిగారు గురువులైన కృష్ణమూర్తిశాస్త్రిగారితో జరిగిన వివాదము సందర్భమున "క్షమాపణమ్" అనుచిన్నకావ్యమును, నమశ్శివాయ యను స్తోత్రమును, సంస్కృతాంధ్రభాషామిశ్రితములైన స్తుతులను రచించియుండిరి. తిరుపతివేంకటకవులు శుకరంభాసంవాదమున సంస్కృతశ్లోకములను వాని కాంధ్రానువాదపద్యములను తామే రచించియున్నారు.

వారు సంస్కృతమునుండి యనువదించిన గ్రంథములలో పరిమాణమును బట్టి మొదట పేర్కొనఁదగినది దేవీభాగవతము. దీనిని వారు తమ గురువర్యులైన చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి కంకితము గావించిరి. ఇందలి నవమ, దశమస్కంధములను తిరుపతి శాస్త్రిగారి కుమారులైన వేంకటావధానిగారును, నిశ్శంకుల కృష్ణమూర్తిశాస్త్రి; ఆకొండి బలరామమూర్తి, చెళ్ళపిళ్ళ చినవేంకటశాస్త్రి అనువారు రచించి యుండిరి. తిరుపతికవుల యనువాదవిధానము శ్రీనాథుని దానివలె భావానువాద మని చెప్పఁదగి యున్నది.

ఉ॥ "ఒక్కెడఁ జక్కఁగా పదము నొక్కెడఁ జేర్చిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దున్నయటు లుంచి రచించిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్నదాన సగముంచిన మేలగుఁ, దెల్గు సేయుచో
మక్కికి మక్కి యన్నటులు మార్చినఁ గావ్యము శ్రావ్య మెట్లగున్."

అని తమ యనువాదపద్ధతిని వారే వివరించియుండిరి. దేవీభాగవతమున వారి రచన సరళసుందరమును, సర్వసుబోధమునై హృద్యముగా నుండును. తత్త్వమయములును,

వర్ణనాత్మకములునైన భాగములను రచించుటలో వారు చాల మెలఁకువఁ బ్రదర్శించి యుండిరి. కథాకథనమున వారందు చూపిన నేర్పు ప్రశంసింపఁ దగియున్నది. తారా చంద్రులకథయు, హరిశ్చంద్రోపాఖ్యానమును ఇందుకు నిదర్శనములు.

"అకటా రాజ్యము బంధుసంతతియు దవ్వైపోయెఁ జాండాలవా
టికి నేతెంచితి వల్లకాటి నిటు లొంటిన్ వాసముం జేసి సే
వకవృత్తిన్ మనుచుంటి, నియ్యదియు దైవం బోర్వఁగా లేక పు
త్రక ! పాపమున్ గలిపించెనే నిను నసాధ్యం బెద్ది యద్ధాతకున్."

అను లోహితాస్య మరణసందర్భమునందలిపద్య మందలి కరుణరస పూరితమైన శైలికి నిదర్శనము.

జీవితాంతమున వేంకటశాస్త్రిగారు శివనామసంకీర్తన మొనరించుచు శివ మాహాత్మ్య నిరూపకములైన రచనలు సాగించుచు కాలము గడపిరి. అట్టి రచనలలో శివలీల లనబడు ఆంధ్రస్కాందము ముఖ్యమైనది. "నేను శ్రీనాథుఁడు నైషధరచన యందుంబలెఁ గొండొక స్వాతంత్ర్యంబు గైకొని రసానుగుణముగ నా యీ స్కాందము విరచించితిని. ఇందు స్కాందమున లేనివి గూడ రెండుమూఁడు గాథలు కలవు. కొన్ని ఇతరపురాణములనుండి గ్రహించినవియుఁ గలవని యెఱుంగునది" అని యీ గ్రంథ మును గూర్చి ఇటీవలి చర్యలో వేంకటశాస్త్రిగారు తెల్పియుండిరి. వారిందు మొదట రచించిన యేడువేల పద్యములలో విషయానుక్రమమును బట్టి రెండువేల పద్యములను దొలఁగించిరి. ఈ పద్యములు తరువాత "పురాణగాథలు" "వ్రతకథలు" అను నామ ములతో రెండు ప్రత్యేక కావ్యములుగాఁ బ్రచురింపబడినవి.

తిరుపతి వేంకటకవులు ఆత్మకూరు సీతారామభూపాలుని ఆదేశము ననుసరించి సంస్కృతమున కృష్ణమాచార్యకవి సార్వభౌముఁడు రచించినదియు, శబ్దార్థాలంకార జటిలమును, కురుమూర్తి ప్రభువైన శ్రీనివాసుని కల్యాణము వర్ణించునదియు నగు శ్రీనివాసవిలాస మను ప్రౌఢచంపుకావ్యము నాంధ్రీకరించి యుండిరి.

"కేవల శబ్దముల్ తగ లగించి బిగించినయట్టి సంస్కృతం
బేవగ విప్పి చెప్ప నగు నేమన గుడ్డలు రైకలోపలం
బ్రోవిడి నట్టి శుష్కకుచపొంకము బైటికిఁ బెట్టినన్ రసం
బావహిలంగ నేర్చునె మహాకవులార ! యనుగ్రహింపుఁడీ"

అని వారు వ్రాసినపద్య మాగ్రంథముతత్త్వము వ్యక్తముచేయుచున్నది. దీని అనువాదమును మూలమువలనే శబ్దార్థాలంకారములకును, అంత్యానుప్రాసములతోఁ గూడిన పద్యములకును, ప్రౌఢములైన వర్ణనములకును నెలవై విద్వదేకవేద్యముగా నుండును. ఈ యనువాదము సందర్భముననే యాత్మకూరునృపాలుఁడు తిరుపతికవు లను బలువిధముల సత్కరించి ఏనుఁగు నెక్కించి యూరేగించెను.

తిరుపతివేంకటకవులు కాళిదాసాది మహాకవులు రచించిన శృంగారరసమయము లైన ఇరువదేడుశ్లోకముల నాంధ్రపద్యములుగా ననువదించి వానిని రసికానందమను పేర చిన్నగ్రంథముగాఁ బ్రచురించి యుండిరి. అప్పయదీక్షితులు రచించిన వైరాగ్యశతకమునందలి డెబ్బదినాలుగుశ్లోకములను తిరుపతిశాస్త్రిగారు కందపద్యములుగా ననువదించి ఆర్యమతబోధిని యను మాసపత్రికయందుఁ బ్రకటించిరి. మిగిలినశ్లోకములను వారిమరణానంతరము వారికుమారు లాంధ్రీకరించి శతకమును పూర్తిగావించిరి.

తిరుపతివేంకటకవుల అనువాదకావ్యములలో శ్రేష్ఠమైనది బుద్ధచరిత్రము. ప్రోలవరపుజమీందారైన కృష్ణారావుబహద్దరువా రాంగ్లమున "ఎడ్విన్ ఆర్నాల్డు" రచించిన "లైట్ఆఫ్ఏషియా" అనుకావ్యము నాంధ్రీకరింపుఁ డని తిరుపతివేంకటకవులను ప్రోత్సహించిరి. ఆంగ్లభాష తమ కపరిచితమగుటచే నా జంటకవులు దాని అర్థము నితరులచేఁ జెప్పించుకొని దాని నాఱాశ్వాసముల ప్రబంధముగా రచించిరి జమీందారుగారి సూచన ననుసరించి వా రెడనెడ సంస్కృతమున క్షేమేంద్రుఁడు రచించిన బుద్ధజన్మకావ్యమునుండియు, అశ్వఘోషుఁడు రచించిన బుద్ధచరితకావ్యమునుండియు కొన్ని వర్ణనభాగములను గూడ జొప్పించియుండిరి. అందలి కథాసంవిధానము మాత్రము ఆంగ్లమూలమునే యనుసరించుచున్నది. ఈ విధముగా మూలములు మూఁడైనను, అనువాదకు లిరువురైనను, గ్రంథమంతయు నేకధారగా నొకచేతిమీఁదనే సాగినట్లు హృద్యముగా నుండును. ఇందు దయావీరశాంతరసము లధికముగను, శృంగారకరుణబీభత్సముల లతిగను వర్ణింపఁబడియున్నవి. బుద్ధు డంతఃపురమును వీడి యేగినసందర్భమున నంతఃపురజనము కావించిన విలాపనమును, కంటక మనునశ్వమును విడిచిపోవు సందర్భమున బుద్ధుఁడు పొందిన సంతాపమును కరుణరసనిర్భరములై యున్నవి.

"ఒకకొం తేగును, సంశయించును, సముద్యుక్తత్వమున్ బొందు వే
ఱొకకొం తేగు, యథాస్థితిం గను, నిరుద్యోగమ్ము వాటించు, వె
న్కకు దోతెంచుట కిచ్చగించు, నట సన్న్యాసార్థియే యౌను గా
కకటా! యెవ్వనికేని శక్య మగునా యర్ధాంగి వర్జించుటల్"

అను పద్యము నన్నయ్యగారి 'కలి దమయంతిఁ బాపసమకట్టు సతిన్' అను పద్యమును బోలి భార్యను విడిచి పోవునప్పటి బుద్ధుని మనస్తత్త్వమును చక్కగా వ్యక్తము చేయుచున్నది.

"అడలకు ముష్ణవారినయనాంచలపూరిత మౌచు జెక్కులం
బడిదిగఁ జాఱ, నాల్క దిగవంచి పదంబులు నాకఁ బోకు,గీ
ద్వదకుము, నీకు నాకు ఋణబంధము తీరెను నేఁటికిం గనం
బడిన పరిశ్రమంబు పరికష్టఫలప్రదమౌ హరీశ్వరా!"

అను పద్యము కరుణరసమయమై గౌతమునకు కంటకమను నాయశ్వమునెడఁ గల ప్రేమభావమును వెల్లడిచేయుచున్నది.

"మృదులం బంచు నెఱింగియున్ నిను సమున్మీలన్ మనోజాగ్ని దా
హదశన్ నిర్దయబుద్ధినై ప్రతిపదం బత్యార్తి నొందించు నా
యదయత్వంబు సహించి స్వీయమగు రాగాఢ్యత్వమున్ పీడ కో
యధరంబా సెలవిచ్చి పంపుము కృపాయత్తైకచిత్తంబునన్"

అని బుద్ధుఁ డధరమునకు వీడ్కోలు చెప్పు పద్యము భావబంధురమై యాతని పూర్వోత్తర శృంగారవైరాగ్య పరాయణతలను ప్రకటించుచున్నది. ఈ ప్రబంధమునందలి కొన్ని చిన్నకథలు నీతిబోధకములై యత్యంత హృద్యములుగా నున్నవి. ఈ విధముగా బుద్ధచరిత్రము రసపాత్ర పోషణమునందును, ఉదాత్తభావప్రకటనమునందును, రసవన్మనోహర శైలియందును, నుత్కృష్టమై తరువాత నాంధ్రమున వెలసిన బుద్ధకథావస్తుకములైన పెక్కు కావ్యములకు మేలుబంతి కాఁజాలెను.

తిరుపతివేంకటకవుల స్వతంత్రకావ్యములలో నత్యంత ప్రధానమైనది శ్రవణానందము. ఇది అయిదాశ్వాసముల శృంగారరసప్రధానమును నీతిబోధకమునైన సాంఘికప్రబంధము. ఇందు మధుసూదనుఁ డను కవి నాయకుఁడు. బాలామణియను వేశ్య నాయిక. తిరుపతిశాస్త్రిగారి వివాహసందర్భమున వేంకటశాస్త్రిగారికి నీలాచలమను వేశ్యాంగనతోఁ గలిగిన సంబంధమును గ్రహించి తిరుపతిశాస్త్రిగారే ఈ ప్రబంధమునకు శ్రీకారము చుట్టిరనియు, తరువాత వేంకటశాస్త్రిగారు దానిని గ్రహించి నామాదులు మార్చి రచన సాగించిరనియు తెలియుచున్నది. అందుచే నిందలి మధుసూదనుఁడు నామాంతర విలసితులైన వేంకటశాస్త్రిగారేయని చెప్పవచ్చును. మనుచరిత్రమున వలె నిందును నాయికయే నాయకుని వలచి యాతని పొందుటకై యనేకయత్నము లొనరించినది. వరూధినివలె నీమె వంచిత గాక సంప్రాప్తమనోరథయై సంతోషము నందినది. తరువాత నామె యన్యపురుషాసక్తయగుట యెఱింగి నాయకుఁడు విరక్తుడై తన తప్పు తెలిసికొని తనవంటి యితరుల కుపదేశక మగునట్లుగా మనస్సంబోధన రూపమగు నీతిని ప్రకటించెను. "మనమా! వద్దిఁక నాదుమాట వినుమా మర్యాద గాపాడుమా" యను మకుటముతోఁ గూడిన పద్యము లారోజులలో సర్వాంధ్రసుపరిచితములు. ఇందలి కథ సహజమును రమణీయమునునై యున్నది. ద్వితీయ, తృతీయ, చతుర్థాశ్వాసము లందలి సంభాషణములు సరసములై దృశ్యకావ్యరీతిని స్ఫురింపఁజేయుచున్నవి. ఇందలి వర్ణనములు నాతిదీర్ఘములును హృద్యములునై యలరారుచున్నవి.

"పైట దొలంగి పాదములపైఁ బడ, గాజులు మ్రోయ, సరఁదే
శాటన పావనం బగు ధరామరుపాదసరోజయుగ్మ మా
బోటి నమస్కరించె, నల పుష్పశరాసను బాణసం కికిన్
వాటముగాక తా గిరటవైచిన చాప మనంగ నత్తఱిన్."

అను పద్యము ఉత్ప్రేక్షాలంకారగమణీయమై నాయిక నాయకుని పాదముల పైఁబడి నప్పటి యాదృశ్యమును కన్నులకు గట్టుచున్నది. "రైకదాటియు బనారసు కంగువా దాఁటి గబ్బిగుబ్బలకాంతి గంతులిడఁగ", "తడబాటుచేత చే యొడిసెపట్టి కటాక్షముంచుమా యన నాలకించనైతి" మున్నగు వర్ణనాత్మకములైన పద్యములందలి భావములు మిక్కిలి సరసములై యింపు నింపుచున్నవి ఇందు కథ కవసరములును, లక్షణానుసరణమాత ప్రయోజనములు నైన వర్ణనములు మాత్రము గోచరింపవు "నిదుర పోఁగొట్టు, క్రమముగా నెత్తికెక్కు" అను పద్యము వేశ్యానశ్యములకు గల సామ్యమును నిరూపించుచున్నది. వేశ్యానురక్తివలన గలుగు పతన మిందు స్పష్టముగా నిరూపింపఁబడినది. "వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు, వారలు గల పెండ్లికిన్ జనఁగరాదు, జనంగనఁ బోల దాటపాటల, నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగరా" దనునది ఈ ప్రబంధమునఁ గన దగిన సంస్కరణాత్మకమైన నీతి. 'ప్రతిపదంబున రస ముట్టిపడినఁ గాక' యను కవుల కవితాశయమున కనుగుణముగా నిందలి శైలి ప్రతి పదరమణీయమై యొప్పారుచున్నది. ఇందలి పెక్కుపద్యము లిప్పటికిని క్రమము తప్పకుండ నొప్పచెప్పఁగల రసికులు పలువు రుండుట దీని రసనిర్భరత్వమునకు తార్కాణము. శ్రవణానంద ప్రచురణముపై నొకప్పుడు ప్రభుత్వ మాంక్ష విధించుట సంభవించెను. అది దాని ప్రచారమునకు మఱింత దోహద మొనరించెను.

తిరుపతివేంకటకవులు రచించిన మఱొక సాంఘిక ప్రబంధము పాణిగృహీత. "పాణిగృహీతి యందురు వివాహితయైన సతిం దనంతఁ దాఁ బాణిగ్రహించి యుంచుకొను బానిసతొత్తును శాబ్దికాగ్రణుల్ పాణిగృహీత యందు" రని కవులే పాణిగృహీతా శబ్దమునకు నిర్వచన మొసంగియున్నారు. ఇందు జలజాక్షి యనువేశ్య నాయిక. ఆమె తల్లి యొక అజ్ఞాతబాలవితంతువు. నాయిక తల్లిచేఁ బరిత్యక్తయై యనాధగా వేశ్యాగృహమునఁ బెరిగి బలవంతముగా వేశ్యావృత్తిని గ్రహించెను. యౌవనమున నామె యొక విటుని వలచి తరువాత నతని విడిచి ఉదారుఁ డను సుందరాకారుని కుంపుడుకత్తె యైనది. పిమ్మట నామె యొక కవిని మోహించి ఉదారుని కోపమునకు పాత్రయై ఆత్మహత్య కావించుకొనినది. ఇది ప్రహసనప్రాయమగు కావ్యమనియు, నాదినుండియు నిందుఁ బలుచోట్ల శృంగారరసాభాసమును, దుర్విటుల నిర్మర్యాదవాక్యములును గానవచ్చుననియుఁ గవులే పేర్కొనియున్నారు. ఇందు బాల్యవివాహములవలని చేటును, బాలవితంతువుల దుస్థితియు, వేశ్యల చంచలమనోవృత్తియు వివరింపఁబడినవి. కృతిభర్తయగు పుచ్చా సీతారామయ్యగారు "విటులకు బుద్ధివచ్చుగతి, వేశ్యలకుం దలవంపుగా, విశంకటపదగుంఫనమ్ములను గాక కడున్ సులభంపు శైలి నొక్కటి రచియింపుఁ డీకృతి" నని యడుగఁగా కవు లీ గ్రంథమును రచించిరి. ఇందలి సన్నివేశములు పెక్కు వారి జీవితము నుండియే గ్రహింపఁ బడినవఁట:

"ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తఱచుగాఁ గబ్బమ్ములం దెల్లెడన్

> శ్రుతులన్ దన్పుచు నుంటఁజేసి యిఁక నేఁ జోద్యమ్ముగా నూత్నపుం
> గృతి నిర్మింపఁగఁ గోరెదన్ నయమునన్ శృంగారమున్ మీఱఁగన్."

అని కృతిభర్త సూచించిన విధముగనే కవు లీ నూత్నప్రబంధమును రూపొందించిరి. ఇందలి శైలి మిక్కిలి సులభమై పెక్కన్యదేశ్యపదములతోఁ గూడి వ్యావహారికమునకు చాల సన్నిహితముగా నుండును. ఇందలి యవతారికలోఁ గవు లాంధ్రవ్యాకరణమును గూర్చియు, దేశభాషను గూర్చియు కావ్యపదప్రయోగమును గూర్చియుఁ గావించిన సూచనలు గమనింపఁదగినవి.

> "కైత యొకండె కాదిపుడు కాలము సర్వము మాఱె, వ్యర్థపుం
> జాతురి హెచ్చె, నల్ప మగు సాహితితోఁ బెదపెద్దపొత్తముల్
> చూతురు తప్పు దిద్దుదురు శారత చచ్చెఁ గవీంద్రులందు, సీ!
> మూతులు కట్టివైచుకొనఁ బోలదె సత్కవులైనవారికిన్"

అని వా రందు సమకాలిక కవికావ్యపరిస్థితులను వర్ణించియున్నారు

లక్షణాపరిణయ మాశువుగాఁ జెప్పఁబడిన మూఁడాశ్వాసముల ప్రబంధము. శ్రీకృష్ణుఁడు లక్షణ యనుకన్యను బెండ్లియాడుట యిందలివస్తువు. భాగవతమునందు సంగ్రహముగా నున్న కథను గ్రహించి కవులు ప్రబంధోచితములైన వర్ణనలను, గల్పనలను జేర్చి యీ ప్రబంధమును రచించిరి. శుకదౌత్యమున కిం దధికమైన ప్రాధాన్య మున్నది. నాయికానాయకుల విరహ మిందు సమానముగా వర్ణింపఁబడినది.

> "చల మాన నేల మలయా
> చల మారుతమా! వియోగచలమానినులన్
> బలమాఱఁ జేయు టిది యొక
> బలమా! కలమాట తెల్పు పథికులఫలమా!"

అను పద్య మిందలి యమకానుప్రాసాదులతోఁ గూడిన ప్రాబంధికశైలికిఁ దార్కాణము.

ఏలామాహాత్మ్యము ఏలానదీమాహాత్మ్య వర్ణనాత్మకమైన రెండాశ్వాసముల ప్రబంధము. ఇది పరిమాణమునఁ జిన్నదయ్యు కథాకథనమునందును, వర్ణనాదులయందును, శైలియందును మిక్కిలి పరిష్కృత నందినది. ఇందలి ప్రథమాశ్వాసమున గౌతమీనది యొక్కయు ఏలానదియొక్కయు నుత్పత్తులు వర్ణింపఁబడినవి. రెండవయాశ్వాసమున ఏలానదీతీరస్థపుణ్యక్షేత్రమహత్త్వమును సూచించు హృద్యములైన కథ లున్నవి. కర్మఠుఁడైన సోమయాజికథయు, బ్రహ్మపురమందలి బచ్చువానికథయు మిక్కిలి రమ్యములుగా నున్నవి. వర్షఋతువర్ణనము, పార్వతిచెలిక త్తెలు మసలియావుల రూపములు ధరించినప్పటివర్ణనము, జీవచ్ఛవము లెవరెవరో తెల్పు సీసపద్యము మున్నగునవి సహజములును అర్థగంభీరములునై మనోహరములుగా నున్నవి.

సీ. "కప్పుపోయిన యింటఁగల వాసములలేవ
బక్కప్రేవులతోడి ప్రక్కల మర,
నీ రెండిపోయి వన్నియ దక్కి పెన్నాయి
పోఁగాఁ దగు వాలమూల మొలయ
చిరకాలభుక్తయై చివికిన పొలికట్ట
భాతిగ నీరోమవాల మెసఁగ
ప్రాగండపట్టెలపైన యశ్మంకుల
బొగడలు నాఖురములు చెలంగ

గడియ కొక నూఱుసారులు కదలి జాఱు
గోమయస్రుతి యొదలిపై దోమపిండు
ముసరఁజేయంగ పెంపేదు ముసలియాల
యాకృతి వహించి రంత జయావిజయలు."

అని ముసలియావుల వర్ణించు సీసపద్యము చక్కనితెనుఁగుపదములకూర్పుతోఁ గూడి బక్కచిక్కిన యా ఆవులమూర్తులను పఠితలయెదుటఁ బెట్టుచున్నది.

వేంకటశాస్త్రిగారికి జోత్యిషమందును అందలి జాతకభాగమునందును నమ్మకము హెచ్చు. వారు తమజాతకచక్రమును పురస్కరించుకొని ఆయా దశలలో జరిగిన సన్నివేశముల వివరించుచు జాతకచర్య యనుపేర తమ జీవితచరిత్రను ప్రథమపురుషలో పద్యరూపమున రచించిరి. ఇందు వేంకటశాస్త్రిగారి జీవితచరిత్రతోపాటు, తిరుపతిశాస్త్రిగారి జీవిత చరిత్రమును ప్రసక్తానుప్రసక్తముగాఁ జెప్పఁబడినది. ఇది పూర్వోత్తరార్ధములుగా విభజింపఁబడినది. ఇందు వేంకటశాస్త్రిగారు పుట్టినదిమొదలు బందురులో షష్టిపూర్తి జరుగువఱకును గల వృత్తాంతము వర్ణింపఁబడినది. తరువాతివృత్తాంత మిటీవలిచరిత్ర యనుపేర ప్రత్యేకగ్రంథముగాఁ బ్రచురింపఁబడినది. ఇందలిశైలి కడుం గడు సులభమై వచనమువలె సాగిపోవుచుండును. తిరుపతివేంకటకవుల జీవితసారస్వత రచనావిశేషములనేకాక తత్కాలసాంఘిక సారస్వత విషయములను గూడ యథార్థములుగా నెఱుంగుట కిది మిక్కిలి యుపకరించును. తెలుఁగులో పద్యరూపమున వ్రాయఁబడిన మొదటి స్వీయచరిత్ర మిదియే యని చెప్పవచ్చును.

తిరుపతివేంకటకవుల కృతులలో స్తుతులును, విజ్ఞప్తులును, శతకములును బెక్కున్నవి. అవి సాధారణముగా వేంకటశాస్త్రిగారు రచించినట్టివే. ఇందు వారు తమకును తమకుటుంబమువారికిని రోగములవలనఁ గలుగుబాధలను దొలఁగించి యారోగ్యము కలిగింపు మని ప్రార్థించుచును, సమకాలిక సాంఘికరాజకీయాదిపరిస్థితులనుగూర్చియు తమ జీవితమునందలి వివిధ సన్నివేశములను గూర్చియు. భగవంతునికి విన్నపములు గావించుచును, తమశత్రువులవలనఁ గలిగిన క్లేశములను నివారింపవేడుకొనుచును స్తుతివిజ్ఞప్తిపూర్వకముగాఁ బెక్కుపద్యములను రచించియుండిరి. కామేశ్వరీశతకము,

ఆరోగ్యకామేశ్వరి అను స్తుతికావ్యము, ఆరోగ్యభాస్కర స్తవము, మృత్యుంజయ స్తవము, సౌభాగ్యకామేశ్వరీ స్తవము, సతీస్మృతి మున్నగు గ్రంథము లీకోవకుఁ జెందినట్టివి. వీనిలో వేంకటశాస్త్రిగారి ఆత్మీయాంశ పెక్కుచోట్ల వ్యక్తమగుచుండును. వారిజీవితమున రోగ, యోగ, భోగములు మూఁడును సమానముగా గోచరించును. వారిభక్తి అసాధారణమైనది. దానివలన వారు సాధించిన యనామయసిద్ధియు నసాధారణ మైనట్టిదే.

గీరతము, గుంటూరుసీమ, చెళ్ళపిళ్ళజయంతి యనుగ్రంథములు తిరుపతికవుల కితరకవులతో జరిగిన వివాదములను వర్ణించుచు, వారి నిరాఘాటపాండితీకవితాపాటవమును తెల్పు హృద్యములైన గ్రంథములు. గీరతము తిరుపతివేంకటకవులకును ఆరోజులలో పిఠాపురాస్థానకవీశ్వరులై యుండిన వేంకటరామకృష్ణకవులకును జరిగిన వివాదమును వర్ణించును. వేంకటరామకృష్ణకవులలో మొదటివారగు వేంకటరామశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారికి బంధుగు లగుటయేకాక వారియొద్దఁ గొంతకాలము విద్యాభ్యాసముఁ గూడఁ గావించియుండిరి. గీరతమున అధిక్రపసంగదమనము, గురుదక్షిణ, విగ్రహారాధనము, లోకాభిరాయణము అనునాలుగుభాగము లున్నవి. ఇందలి మొదటిరెండు భాగములును మరల పర్వములుగా విభింపఁబడినవి.

శ్లో॥ గీర్షు యేతు రతాస్తేవై గీరతాః పరికీర్తితాః
తా నుద్దిశ్య కృతం కావ్యం గీరతం పరిచక్షతే.

అనునది తిరుపతి వేంకటకవులు గీరత శబ్దమున కిచ్చిన వివరణము. వేంకటరామకృష్ణ కవులు తాము ప్రచురించుచుండిన పత్రికయందును, కోకిల కాకము, శృంగభంగము మున్నగు నన్యాపదేశ గ్రంథములందును తిరుపతి వేంకట కవుల కవిత్వమును హేళన పూర్వకముగా విమర్శించియుండిరి. తిరుపతి కవు లందలి యసత్యములను, అనౌచిత్యములను, దోషములను ఉగ్గడించుచు గీరతరచన సాగించిరి. ఇందలి పద్యములు మధుర ప్రసన్నములై కొన్నిచోట్ల మందలింపుతోడను, కొన్నిచోట్ల ప్రబోధము తోడను, కొన్ని చోట్ల వీరావేశములతోడను, కొన్నిచోట్ల అధిక్షేప హేళనముల తోడను గూడి చదివిన కొలంది చదువవలె నను నుత్కంఠ రేకెత్తించుచుండును. వేంకటశాస్త్రిగా రొక్కచో,

"వెంకన బంధువౌ కతన వేదురు వ్రాఁత లొకింత సైచు, మీ
ర్జంకుట గాఁదలంచి వెలుచం గుఱుచల్ లభియించుచుంద్రు మీ
వెంకెతనాలు సాగ వల బెబ్బులిపై వెలనాటి సింగ మి
ట్టింకుల నింకఁజేయు నెపుడేనియు డొంకలె నూ శరణ్యముల్."

అని వారిని హెచ్చరించియుండిరి. కాని వా రా హెచ్చరికను లెక్కసేయక అపహాస్యమునకు బాల్పైరి. వా రచ్చటచ్చట తాము తిరుపతివేంకటకవుల కీశ్వరవేరుల మని యపలపించు చుండుట విని తిరుపతిశాస్త్రిగా రాగ్రహావిష్టులై "మీరు మమ్ము సభకు

రప్పింపుఁడు లేదా మేము మిమ్ము సభకు రప్పించెదము. రండు ఈశ్వరవేరులో, జీలుగుబెండ్లో విద్వల్లోకమే నిర్ణయింపఁగల" దని యుత్తరము వ్రాసిరి. దానికి జవాబుగా వారు "కాకవికాచ పాత్రలమొగంబు మూయఁగ జీల్గుబెండ్లయే" అని సమాధాన మొసంగియుండిరి. ఇందలి 'కాకవి' యను పదమును సంబోధనగా చేసి తిరుపతి వేంకట కవులు,

"కాకవి! కాచపాత్రల మొగంబుల మూసెడు జీల్గుబెండ్లకుం
జేకుఱునే సభాస్థితియుఁ జేకుఱుఁగా కది తద్రసంబులన్
గైకొనువేళ నొక్కఁకడగాఁ బడవైవరె? పట్టుపట్టినన్
మేకు బిగించి లాగి బలిమి న్బలుముక్కలు చేయకుందురే."

యని యావేశముతో సమాధాన మిచ్చిరి. మఱియు నామేకుబిగింపు పర్వముననే

"మాకన్నన్ మహనీయులైన కవులీక్ష్మామండలిన్ లేకపో
రీ కాలంబున యుష్మదీయ కవితాద్వీపంబు ముంపంగ న
స్తోక శ్రీక మదీయదివ్యకవితా తుంగార్భటీ ఘోర గం
గా కల్లోలవతీ ప్రభావభరవేగ ప్రక్రియల్ చాలవే"

యని గర్జించిరి. కాకరపఱ్ఱున వేంకటశాస్త్రిగారికి శృంగభంగము జరిగినదని వ్రాయఁబడిన వ్రాఁతలు చూచి తిరుపతిశాస్త్రిగారు,

"చుక్కలు రాలలేదు, రవిసోములపోకడ మారలేదు, న
ల్దిక్కులు కూలలేదు, జలధిజ్వలనం బులుకంగ లేదు నేఁ
డక్కడ రామకృష్ణకవు లర్భకు లేగతి సేయనేర్తురా
ధి క్కృతవైరి వేంకటసుధీ కవిమౌళికి శృంగభంగమున్."

అని యుత్తరము వ్రాసిరి. నిశితమైన యుపాలంభమునకు నిలయములయ్యు గీరతము నందలి పద్యములు లోకమునందలి శిష్యుల కుపదేశము నందిచ్చుచు తిరుపతి కవుల హృదయమునందు గూఢమైయున్న యపారశిష్యవాత్సల్యమును సూచించుచున్నవి.

గుంటూరుసీమ తిరుపతి కవులకును కొప్పరపు కవులకును జరిగిన వివాదమును వర్ణించు కావ్యము. ఇది పూర్వరంగము, ఉత్తరరంగము అని రెండు భాగములుగా విభజింప బడినది. ఈవివాదమునకు రంగస్థలము గుంటూ రగుటచే దీనికి పేరు పెట్టఁబడినది. నిజమునకు కొప్పరపుకవులకును తిరుపతి కవులకును సహజమైన ద్వేష మేదియును లేదు. కాని అన్యులప్రేరణచే నంకురించి యది యసత్యములైన వ్రాఁతలకును తద్ద్వారా అనవసరమైన వైషమ్యమునకును దారితీసినది. అది క్రమముగా నియోగి, వైదిక కలహముగాఁ బరిణమించుట శోచనీయము. ఈ సందర్భమున మధ్యవర్తులను గూర్చి తిరుపతి కవులు,

"శాఖలోఁ గొంద ఱాకాశసౌధ మొకటి
గట్టిపెట్టిరి కొ(త్త)పంపుఁగవుల కొఱకు
ఎక్కలేము మొట్టో యన నెక్కితీఱ
వలయు నని త్రోయుచున్నారు బలముకొలఁది."

అని వ్రాసియుండిరి. ఈ వివాదమున తిరుపతికవులతోపాటు వారి శిష్యులుకూడ కవితాపాండితీప్రాభవమును ప్రకటించి గురువుల కీర్తిగౌరవములను ద్విగుణీకృతము లొనరించిరి. గుంటూరుసీమయందలి పద్యము లాశుప్రాయములై రసవంతములై, సర్వసుబోధములై మిక్కిలి యింపుగా నుండును. కవుల కలహములు నహృదయులకు మనఃఖేదము కలిగించుమాట నిజమే యైనను ఒక్కొక్కప్పుడు వానివలన నెన్నో అపూర్వశాస్త్రవిషయములు వెలువడి జ్ఞానమునకు పెంపు చేకూర్చుచుండును.

తిరుపతిశాస్త్రిగారి మరణానంతరము వేంకటశాస్త్రిగారికి గురువులైన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారితో వాగ్వివాదము తటస్థించినది. వేంకటశాస్త్రిగారు రచించిన బొబ్బిలి పట్టాభిషేక కావ్యముపై శ్రీపాదవారు దోషోద్ఘాటనపూర్వకముగా విమర్శ ప్రకటించుటయే ఈ వాదమునకు మూలము. వేంకటశాస్త్రిగా రది సహింపఁజాలక "మీసా లిప్పుడు లేవుగాక కవితోన్మేషానకున్ లేవాకో మీసా" లని విజృంభించి, గురువుగారికి సమాధానముగా జయంతి యను కావ్యమును రచించి, దానిని జయంతిరామయ్య పంతులుగారి కంకితము గావించిరి. వారు మొదలు గురువుగారిని ప్రార్థించి సంధికై యత్నించి యుండకపోలేదు కాని శ్రీపాదవా రాయత్నమును సాగనీయలేదు. వేంకటశాస్త్రిగారు,

"శ్రుతపాండిత్యము తక్క లేని గురుఁ డీసుం బూని నన్ రేగఁగొ
ట్టి తదౌద్ధత్యము చూపుఁగాక గురుతో డీకోక యత్మావన
స్థితి కే కొంచెమొ పోరుచుంటి నది వీక్షింపంగఁ బ్రార్థింతు
మతికిన్ దోఁచిన మాట పత్రికలకున్ బంపింపు మార్యాగ్రణీ."

అని రామయపంతులుగారిని వేడుకొనియుండిరి. జయంతియందలి పద్యములు ధారా శుద్ధికిని భావగాంభీర్యమునకును నిలయములై వేంకటశాస్త్రిగారి దేహమునకేకాని కవిత్వమునకు వార్థక్యము లే దను విషయమును జాటుచుండును. వా రొకవంక భక్తి చూపుచునే గురువుగారి నుపాలంభించు పద్ధతి యెంతో యాశ్చర్యము కలిగించును.

పై వివాదకావ్యములోకాక తిరుపతివేంకటకవులు రచించిన అన్యాపదేశకావ్యములు మఱికొన్ని యున్నవి. వానిలో బిడాలోపాఖ్యానము, శనిగ్రహము, గ్రామసింహము, వ్యాసనిష్కాసనము, మల్లేశ్వరవిజ్ఞప్తి, దైవతంత్రము, రాసభకుమారుఁడు, సంగదోషము మున్నగునవి ముఖ్యములైనవి. వేంకటరామకృష్ణకవుల కృతఘ్నత నెత్తిచూపుటకై వ్రాయఁబడిన బిడాలోపాఖ్యానము శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి పేర ప్రకటింపఁ

బడినది. ఇందలి పులులు తిరుపతివేంకటకవులు, పిల్లులు రామకృష్ణకవులు; సింహము చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు. శనిగ్రహ మిఱువదేడు పద్యములతోఁగూడిన చిన్నకబ్బమే యయ్యును సుప్రసిద్ధమైనది. రాజుగారితోఁ గొండెములు చెప్పి తమసన్మానమున కడ్డము వచ్చిన యొకవైష్ణవపండితు నన్యాపదేశముగా నుపాలంభించుచుఁ జెప్పిన కావ్య మిది. ప్రతిపద్యము చివఱను "శనిగ్రహంబ! ఇఁక మా సామర్థ్యమున్ జూడుమా" యను మకుట ముండుటచే నిది యొక యసంపూర్ణమైన శతక మని చెప్పవచ్చును. ఈ పద్యము లందలి యర్థ మొకవంక శనిగ్రహమునకును నింకొకవంక నా వైష్ణవపండితునికి నన్వయించుచుండును.

"నీ తోఁబుట్టువు దున్న నెక్కు మఱియున్ నీతండ్రి వారాంగనా
చేతశ్చోరుఁడు తీర్థపత్ని రమియించెన్ నీదు మేనల్లుఁ డీ
వాత గ్గ్లిన నీకు మాత్ర మెటులన్ బాటిల్లు సద్వృత్తి నీ
చా! తుచ్ఛాత్మ! శనిగ్రహంబ! ఇఁక మా సామర్థ్యముం జూడుమా"

అను పద్యమున వారిరువురి పుట్టుపూర్వోత్తరములును వివదింపఁబడి యున్నవి. ఈ కావ్యమున తిరుపతికవుల జ్యోతిశ్శాస్త్రపాండిత్యము లెస్సగాఁ బ్రకటిత మగుచున్నది. గ్రామసింహ మనుకావ్యము గురువువలన నభ్యుదయ మంది యాతనికే యెగ్గు తలపెట్టిన శిష్యునిగూర్చి యన్యాపదేశముగా వ్రాయబడినది. మల్లేశ్వరవిజ్ఞప్తి సాంఘికమును వైయక్తికమునైన నిశితమైన యధిక్షేపముతోఁ గూడియున్నది. పాశవిక మనఃప్రవృత్తులపై శక్తిమంతమైన కవిత్వము పొందిన విజయము నీ కావ్యము చక్కగా సూచించును. రాసభకుమారుఁడు మున్నగు నితరకావ్యములు గూడ నన్యాపదేశముగా రచింపఁబడినవే.

తిరుపతిశాస్త్రిగారు మరణించిన పిమ్మట వేంకటశాస్త్రిగా రొక్కరును రచించిన గ్రంథములు పెక్కున్నవి. అందు 'గోదేవి' అనంతామాత్యుని భోజరాజీయమునందలి గోవ్యాఘ్ర సంవాదము ననుసరించి వ్రాయఁబడిన స్వతంత్రకావ్యము 'పతివ్రత' జానపద సాహిత్యమైన ప్రసిద్ధ పాముపాటకు కావ్యరూపము 'బొబ్బిలిపట్టాభిషేకము'. బొబ్బిలిరాజుగారి పట్టాభిషేకమును విపులముగా వర్ణించు వర్ణనకావ్యము. ఇందు కొన్ని సమకాలిక రాజకీయాంశములు కూడ వివరింపఁబడియున్నవి. 'సుఖజీవి' శ్రీ ఈదర వేంకటారావు పంతులుగారి గుణగణములను ప్రశంసించు చిన్నకావ్యము 'సుశీల' సమకాలిక సాంఘికాద్యాచారములను, దేవమాహాత్మ్యమును బ్రతిపాదించు నాఱాశ్వాసముల కల్పిత కావ్యము. పూర్వహరిశ్చంద్రచరిత్ర మను కావ్యమున హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితుఁడు మున్నగువారి పూర్వజన్మ చరిత్రములు వివరింపఁబడియున్నవి. ప్రధాన కథలో నిందు పెక్కవాంతరకథలు చొప్పింపఁబడియున్నవి. ఇందలి శైలి ప్రసాద గుణభూయిష్ఠమై ద్రాక్షాపాకమున నొప్పారుచున్నది.

తిరుపతివేంకటకవులకు మహాకవులుగానే కాక నాటకకర్తలుగా గూడ నపారమైన ప్రసిద్ధి యున్నది. వారు రచించిన నాటకముల సంఖ్య మొత్తము పదునెనిమిది.

అందు మూఁడు సంస్కృతానువాదములు; పదొకండు పౌరాణికములు; రెండైతిహాసిక ములు; రెండుసాంఘికములు. ఇవి గాక వారు రచించిన ప్రహసనములు కూడ కొన్ని యున్నవి.

తిరుపతికవుల యనువాదనాటకములలో మొదటిది రాజశేఖరుని బాల రామాయణము. ఇందు పదియంకము లున్నవి. ఈ నాటకము సీతాస్వయంవరమునకై రావణుఁడు మిథిలానగరమున కరుగుటతో నారంభించి రావణవధానంతరము సీతారామలక్ష్మణులు విమానముపై నయోధ్యకు తిరిగివచ్చుటతో ముగియును రామాయణకథ కిందు కవి పెక్కుమార్పులు చేసియున్నాఁడు. తృతీయాంకమున సీతాస్వయంవర వృత్తాంత మంతర్నాటకముగా నిర్వహింప బడియున్నది. దశరథుఁ డయోధ్యలో లేని తఱి శూర్పణఖా మాయామయులు కైకాదశరథులుగా నటించి రాము నడవికిఁ బంపి రను కల్పనము కైకాదశరథుల శీలములను పోషించుటకై యుద్దేశింపఁబడి యున్నది. ప్రదర్శనానుకూలమైన నిర్మాణము లేమిచే నీ నాటక మనుకొన్నట్లు జనాదరమును బడయ జాలక పోయినది. ఇందు సుమారు ఏడువందలయేఁబది పద్యము లున్నవి.

తిరుపతికవుల రెండవయనువాదనాటకము విశాఖదత్తరచితయైన ముద్రారాక్షసము. నందపరాభూతుఁడైన చాణక్యుఁడు నందకులోన్మూలనము గావించి చంద్రగుప్తుని రాజ్యమునందు సుప్రతిష్ఠితు నొనరించుటయు, రాక్షసు నాతనికి మంత్రిగాఁ జేయుటయు నిందలి యితివృత్తము. ఇది కుటిలరాజనీతిమయమైన నాటకము. కవి తనకు గల యర్థశాస్త్రకౌశలమునంతను ఇందు ప్రదర్శించెను. ఇం దేడంకము లున్నవి. స్త్రీపాత్ర లేదు. ఈనాటక మాంధ్రదేశమునఁ బలుసార్లు ప్రదర్శింపఁబడినది.

తిరుపతికవుల మూఁడవ యనువాదనాటకము వసంతసేనాచారుదత్తుల ప్రణయము వస్తువుగాఁ గల మృచ్ఛకటికప్రకరణము ఇందు పదియంకము లున్నవి. భాసుని దరిద్రచారుదత్తమునకు రాజకీయమైన ఆర్యకవృత్తాంతమును జతచేసి శూద్రకు డీ ప్రకరణమును కల్పించెను. రసపాత్ర పోషణమందును, సన్నివేశకల్పనమందును, సమకాలిక సాంఘికవృత్తచిత్రణమందును కవి ఇందు చూపిన నేర్పనన్య సాధారణమైనది. ఇది పలుసార్లు రంగముమీఁద ప్రదర్శింపఁబడి సహృదయానందసంధాయకమై విరాజిల్లినది.

తిరుపతివేంకటకవుల నాటకానువాదపద్ధతి విశిష్టమైనది. వా రెడనెడ పద్యపూరణమునకై కొన్నికల్పనలను గావించినను సాధ్యమైనంతవరకు యథామూలముగనే తమ యనువాదము సాగించిరి. అది తెనుఁగుదనముతో నిండారి మూలభావములను స్పష్టముగా వివరించుచు ననువాదమయ్యు స్వతంత్రమువలె భాసిల్లుచుండును.

"కూరవరుగు చెడదు, గుమ్మడికాయయుఁ
జెడదు గోమయంబుఁ దొడిమఁబూయఁ
బోదు నీటికూడు, పొగచినమాంసంబు
నా విరోధ మెన్నినాళ్ళకైన."

మున్నగు పద్యములు జాతీయపదప్రచురములై సులభములయ్యు శక్తిమంతములై యొప్పారుచున్నవి. ఇతరులు కావించిన యనువాదములందువలె వారి యనువాదము లందలి పద్యముల నర్థముచేసికొనుటకు సంస్కృతశ్లోకములకై వెదకవలసిన యక్కఱ యుండదు. సంస్కృతశ్లోకభావమును జీర్ణము చేసికొని తెలుఁగుకవి ప్రతిభోపేతముగా రచించిన పద్యము లగుటచే వానియందు భావక్లిష్టత ఎచ్చటను గోచరింపదు. వారు మూలభావమును గ్రహించి దానిచే యించుక స్వతంత్రముగా వెల్లడించినచోట్లును, మూలశ్లోకభావమును పఠితలకు స్పష్టతరము గావించుటకై దానిని వివరించియో, కొంచె ముగా మార్చియో వానికి వన్నె చేకూర్చుటయు మూఁడు నాటకములందును గోచరిం చును. 'నగర్యాం విశుద్ధాయాం పశుఘాత మివ దారుణమ్' అనుదానికి "కాశిలో గోవుఁ జంపిన కరణి నేఁడు దారుణంబుగ జంపింతుఁ జారుదత్తు" ననియు, "న తేన కశ్చిద్వి భవై ర్విమానితః" అను దానిని "రిక్తులను బ్రోవ నతఁడు దరిద్రుఁడయ్యెఁగాని యైశ్వ ర్యమదమునఁ గాదుసువ్వె" యనియు ననువదించుట వారు మూలమునకుఁగూడ మెఱుఁ గులు దిద్దిరనుటకుఁ దార్కాణము. శ్లోకములు రసభావప్రధానములు గాక విషయప్రధా నము లైనప్పుడును; పాత్ర లాయాసందర్భములలో పద్యములు పఠించుట యుచిత ముగా నుండ దని తోచినప్పుడును వారు వానిని వచనరూపముననే వెలయించి యుండిరి. మూలశ్లోకములందు పునరుక్తి గోచరించినపు డనువాదమున దానిని దొలఁ గించుటకై వారు కొంత భాగమును విడిచివేసిన పట్లు కూడ కొన్ని గలవు. శ్రీనాథుని వలె కొన్నిచోట్ల వారు మూలశ్లోకపాదములను యథాతథముగా తెలుఁగుపద్యములందుఁ జొప్పించి యుండిరి. "లూనక్షత్రియకంఠమండల గళత్కీలాలకుల్యాభృతప్రాగ్భారో" అను బాలరామాయణశ్లోకానువాదమైన "కృత్తక్షత్రియకంఠమండలగళత్కీలాలధారా సరస్వత్తీర్థంబున" నిత్యాదిగాగల పద్య మిందుకుఁ దార్కాణము. ఇట్లు చేయుట ప్రౌఢతా ప్రీతిచేతనే కాని యసమర్థతచేఁ గాదు. తిరుపతికవులు తమ నాటకములలో స్త్రీసేవకా దులకుఁ గూడ గ్రాంథికమే వాడియుండిరి. అయ్యు నది వ్యవహారసన్నిహితమై జాతీయమై మనోహరముగా నుండును. వారి యనువాదపద్యములుగూడ సొంతపద్యముల వలె నెచ్చటను గుంటువడక ధారాళముగా సాగిపోవుచుండును. ఆంధ్రనాటకకర్తలలో ధర్మ వరమువారు సన్నివేశకల్పనమునందును, పానుగంటివారు సంభాషణరచనా చాతుర్య మునందును, తిరుపతికవులు నాటకోచితపద్యరచనాపాటవమునందును కృతహస్తులను విమర్శకోక్తి యొకటున్నది. తిరుపతికవుల పద్యరచనాపాటవమును గూర్చి చేయఁబ డిన ఈ విమర్శ వారి స్వతంత్రనాటకములందువలె ననువాదనాటకములందును బరమ సత్యము.

తిరుపతికవుల పౌరాణికనాటకములను పాండవకథాప్రధానములు, ఇతరములు అని రెండు వర్గములుగా విభజింపవచ్చును. వారి పాండవనాటకము లాటింటికిని మహా భారతమే ప్రధానమూలము. వా రందలి ముఖ్యఘట్టములను మాత్రము గ్రహించి ఎడనెడ కొద్ది మార్పులు చేర్పులు కావించుచు నా నాటకషట్కమును రూపొందించిరి. పాండవా శ్వమేధనాటకమున జైమినిభారత కథాక్రమము ననుసరించిన సన్నివేశములును గొన్ని

యున్నవి. భారతమునఁ జివరఁగలఆశ్రమవాసాదిపర్వములందలి కథాభాగమును వారు నాటకీకరించి యుండలేదు. పాండవనాటకములలో మొదట వారు రచించినది పాండవ విజయము. అది తొలుత సరస్వతీపత్రికలోఁ బ్రకటింపఁబడియున్నది. ఆ పత్రికలోఁ బ్రకటింపఁబడిన రచనలన్నియు తిరుపతిశాస్త్రిగారొక్కరే రచించిరని ప్రతీతి కలదు. ఉద్యోగవిజయములతోఁ గూడిన యా నాటక మత్యంతవిస్తృత మగుటచే వేంకటశాస్త్రి గారు తాము మఱికొన్ని యంకములు క్రొత్తగా రచించి దానిని పాండవోద్యోగపాండవ విజయము లను రెండు నాటకములుగా రూపొందించియుండిరి. ఏ అంకము లెవరు రచించినవైనను రచనయంతయు నొక్కచేతిమీఁదుగా సాగినట్లే యనిపించును. పాండవాశ్వమేధ, పాండవప్రవాస, పాండవజనన, పాండవరాజసూయము అనునవి మిగిలిన నాల్గు నాటకములు.

పాండవజననమున వ్యాసోత్పత్తి, సత్యవతీశంతనుల వివాహము, భీష్మపరశురాములయుద్ధము, పాండుధృతరాష్ట్రుల జననము, కర్ణజననము, పాండవావిర్భావము అను వృత్తాంతము లున్నవి. దాశకన్యాపరాశరుల సంగమము కేవలము కామవాంఛా ప్రేరితము కాదనియు, వ్యాసుని యవతారమును దృష్టియందిడుకొనియే పరాశరుఁడట్లు వర్తించెననియు, దాశకన్య జన్మవృత్తాంతము నాతఁడు దివ్యదృష్టిచేఁ గాంచెననియు తిరుపతికవులు సూచించియుండిరి. భీష్ముని గురుపితృభక్తివరాక్రమము లిందు లెస్సగా వర్ణించబడినవి వారైదవయంకమున కుంతి నేకాకినిగాఁ గాక సఖీసహితఁగాఁ బ్రవేశపెట్టి సూర్యునిచే కుంతిశంకకు సంతృప్తికరమైన సమాధానము చెప్పించిరి. వారీ నాటకమున సత్యవతీకుంతీపాత్రల చిత్రణముద్వారా వంశాభివర్ధనమున స్త్రీలకుఁ గల ప్రాధాన్యమును సూచించియుండిరి. ఇం దంగిరసము ధర్మవీరము; శృంగారకరుణాద్భుతము లంగములు.

పాండవప్రవాస మెనిమిదంకముల నాటకము. అర్జునాదులు ద్రుపదునిఁగట్టి తెచ్చి ద్రోణునకు గురుదక్షిణగా నొసంగుట, బకాసురవధ, ద్రౌపదీస్వయంవరము, ద్యూతము, ద్రౌపదీవస్త్రాపహరణము, ఊర్వశి యర్జుననకు శాపమొసఁగుట, సైంధవుని పరాభవము. ఉత్తరగోగ్రహణము, ఉత్తరావివాహనిర్ణయము అనునవి ఇందలి ప్రధానాంశములు. ప్రవాసమనఁగనే అజ్ఞాత వృత్తాంతము స్ఫురించును. కాని తిరుపతికవు లంతకుముందు జరిగిన కథాభాగములనుగూడ నిందుఁ జేర్చియుండిరి ఇందు గురుదక్షిణావృత్తాంతమున కుచితమైన స్థానము కనఁబడదు. నన్నయ వస్త్రాపహరణ సందర్భమున "ద్రౌపది కృష్ణుఁ దలంచె భీతయై" యని మాత్రము వ్రాసియుండెను. తిరుపతికవులు నాటకమున నా భాగమును భక్తికరుణరసమయముగా సంతరించి యుండిరి. అర్జునోర్వశీవృత్తాంతము రసాభాసమయ్యు, హేతువాదపూర్వకమైన సంభాషణచాతుర్యమున కాలవాలమై హృద్యముగానున్నది. మొత్తముమీఁద నిందలి వస్తువునందుగాని, రసమునందుగాని ఏకత్వము కానరాకున్నది.

శిశుపాలవధ వస్తుకమైన పాండవరాజసూయ మేకాంకరూపకము. వ్యాయోగలక్షణములన్నియు నిందుఁ గానవచ్చుచున్నవి. ఇది పద్యమయమై చిన్న కావ్యమువలె

నున్నది. ఇందు వీర మంగి; రౌద్ర మంగము. ఇందలి ప్రస్తావన సుదీర్ఘమై చక్కని కావ్యార్థ సూచనతోఁ గూడియున్నది.

పాండవోద్యోగవిజయములు తిరుపతికవుల భారత నాటకములకే కాక యాంధ్రమునందలి సకల పౌరాణిక నాటకములకును తలమానికము లని చెప్పఁదగి యున్నవి. అవి బహువారములు బహునగరములందు ప్రదర్శింపఁబడి రచించిన కవులకును, నటించిన నటులకును అఖండఖ్యాతి నావహించినవి. తిరుపతికవుల పద్యరచనా కౌశల మిందు పరాకాష్ఠ నందినది. ఆంధ్రదేశము నందలి యక్షరాస్యులలో నందలిపద్యములు రెండోమూఁడో నోటికి రానివా రుండ రనుటలో నతిశయోక్తి లేదు. పాండవోద్యోగమున నాఱంకము లున్నవి. అర్జున దుర్యోధనులు యుద్ధమున కృష్ణుని సాహాయ్యము నర్థించుటకై ద్వారక కరుగుటతో మొదలిడుచున్నది ఉద్యోగ మనగా ప్రయత్నము. ఈ కథాభాగమున యుద్ధమునకువలె సంధికిని బ్రయత్నము సాగినది. కవు లీనాటకమును పంచమాంకముతో ముగించి షష్ఠాంకమును పాండవవిజయమున చేర్చియుండినచో వస్తుసంవిధానము మఱింత యుచితతరమై యొప్పియుండెడిది. ఏలయన యుద్ధమునకుఁగాని, సంధికిఁగాని చేయఁబడిన యుద్యోగమంతయుఁ బంచమాంకముతోడనే పరిసమాప్తి నొందినది. ఉద్యోగపర్వమున కృష్ణుని రాయబారమునకు ముందు ద్రుపద పురోహితుని రాయబారమును సంజయుని రాయబారమును కలవు. తిరుపతికవు లీ రెండింటిని సూచ్యమాత్రములు కావించిరి. వా రిందుఁ గొన్నిచోట్ల తిక్కన భావములనే గ్రహించినను బెక్కుచోట్ల సొంతభావములతో గూడిన రమణీయమైన పద్యములను రచించియుండిరి "అదిగో ద్వారక— బనను పోయిరావలయు హస్తినకు— సేవాధర్మము సూత్రధర్మమును— చెల్లియొ చెల్లకో— జెండాపై కపిరాజు" మున్నగు పద్యములు సర్వాంధ్రజన సుపరిచితములు. ఇందలి ద్వితీయాంకమున భారవి కిరాతార్జునీయమునందలి శ్లోకముల యనువాదములు కొన్ని గోచరించును. ఉద్యోగమందలి ప్రధానరస ముత్సాహస్థాయికమైనవీరము; రౌద్రకరుణశాంతహాస్యాద్భుత రసములిం దంగముగఁ బోషింపబడినవి. భీముని మనసునఁ గోపము రగులు కొల్పుటకై కృష్ణుడాతనితో నొనరించిన సంభాషణ మొకవంక చమత్కారమునకును నింకొకవంక హాస్యమునకును దార్కాణమై యొప్పుచున్నది. కవు లీ నాటకమున పాత్రపోషణమునఁ బ్రదర్శించిన నేర్పు ప్రశంసాపాత్రముగా నున్నది. ఇందలి కథ పౌరాణిక మగుటచే నొందు రెండుచోట్ల నతిలోకవిషయమును బ్రదర్శింపక తప్పినదికాదు. విశ్వరూప సందర్శనము, సూర్యుఁడు కర్ణుఁడు కౌంతేయుఁడేయని సాక్ష్య మొసంగుట అనున విందుకు నిదర్శనములు. ద్వితీయాంకమునందలి "అడుగు దాటరు పాండవు లన్నమాటకున్" అనుచో అన్నమాటకున్ అను ప్రయోగమునందును, "న్యాయమార్గంబు వినని కర్ణత్రయంబు గలుగు వాఁడుగదా" యను గద్యమునందలి కర్ణత్రయమను ప్రయోగమును అర్థద్వయముతో గూడి కవుల పాండిత్యమును, సమయస్ఫూర్తిని, చమత్కారమును బ్రకటించుచున్నవి.

పాండవవిజయ మెనిమిది యంకముల నాటకము. దీనిని మొదట తిరుపతి శాస్త్రిగారు సంస్కృతమున వ్రాయనారంభించియు వేంకటశాస్త్రిగారి ప్రేరణచే నా ప్రయత్నము మాని, తెనుఁగుననే రచించిరఁట. మొదటి విజయమును ఉద్యోగవిజయ ము లను పేర రెండు నాటకములుగా విభజించిన పిమ్మట విజయమునందలి మొదటి యంకమును వేంకటశాస్త్రిగారు క్రొత్తగా కల్పించిరి. ఇందు భీష్మార్జున యుద్ధము వర్ణింపఁబడియున్నది. భీష్ముని ధాటికాగలేక కృష్ణుఁడు చక్రము కేలఁ బట్టుట, అర్జు నుఁడు కృష్ణుని ప్రార్థించి మరల్చుట, అతఁడు శిఖండిని ఎదుటఁబెట్టుకొని యుద్ధము చేయుచుండ భీష్ముఁ డస్త్రసన్యాసము కావించుట ఇందలి విషయములు. తరువాత దుర్యోధనుల ద్రోణ కర్ణ శల్యపర్వములందలి వృత్తాంతము వివరింపఁబడియున్నది. భీమ గదాయుద్ధమైన పిమ్మట నశ్వత్థామ పాండవవంశాంకురము లేకుండ నిర్మూ లించెదనని దుర్యోధనునికి వాగ్దానము చేసి సౌప్తికవధానంతరము కృపాచార్యు నితో తిరిగివచ్చెను. తరువాత దుర్యోధనుఁ డసువులఁ బాసెను. పాండవులకు విజయము లభించెను. భారతమందు ధర్మరాజు 'అశ్వత్థామా హతః కుంజరః' అని పల్కుట నేదో విధముగా సమర్థించుట కవకాశమున్నను అది యాతని శీలమునకు కళంకమనియే చెప్ప వలెను. తిరుపతికవులు నాటకమున ధర్మరాజు కృష్ణుఁ డెంతగాఁ బురికొల్పినను అసత్యమాడుట కంగీకరింపలే దనియు, మాయాకుశలురాలైన హిడింబ ధర్మజుని యెలుంగుతో నామాట పల్కెననియు రచించి కార్యసాఫల్యమును కలిగించుటేకాక ధర్మజు నసత్యదోషమునుండియు, గురుద్రోహాపరాధమునుండియు రక్షించియున్నారు. కథావిషయమున తిరుపతికవు లీనాటకమునఁ గావించిన ప్రధానమైన మార్పిదియే. యుద్ధ మును రంగమునఁ ప్రదర్శింపరాదని ప్రాచ్యలాక్షణికులు నియమించియుండుటచే నట్టి వర్ణనలకై తిరుపతి కవులు సూచ్యార్థ సూచకములను నిపుణముగా వాడియున్నారు.

> "అఱనిలోతునీటి కొల నక్కట పూచిన తమ్మికిన్ విధి
> ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబదితొమ్మి దింక నా
> నీరజమందుఁ దా మిగులునే యొకరే కటులుండెఁ బో యలం
> కారములౌనె యా కొలను గాని సరోజముగాని భూమికిన్."

అను చూళిక తొంబది తొమ్మిదిమంది కౌరవులు నిహతులుకాఁగా దుర్యోధనుఁ డొక్కఁడే శేషించి యుండెనను విషయము నెంతో యద్భుతముగను, భావగంభీరముగను సూచించు చున్నది. కొన్నిచోట్ల తిరుపతికవులు యుద్ధాదులను కరండకుఁడు, బకోటకుఁడు, యుయుత్సుఁడు మున్నగు వారిచే కథనరూపముగాఁ జెప్పించిరి. ప్రదర్శనములం దిట్టివి సాధారణముగా పరిహృతము లగుచుండును. ఉద్యోగమున వలెనే విజయమునఁగూడ తిరుపతికవులు ప్రదర్శించిన రసపాత్ర పోషణచాతుర్య మనన్యసామాన్యమై యలరారు చున్నది. వారు ధర్మజుని లోకజ్ఞతా ధర్మాసక్తులను, కృష్ణుని రాజనీతి కౌశలమును, దుర్యోధనుని యభిమానాహంకారములను, భీష్ముని భక్తిపరాక్రమములను, కర్ణద్రోణా దుల యసాధారణవిక్రమమును, అభిమన్యుని అతిలోక ధైర్యసాహసములను, బలరా

ముని దుర్యోధన పక్షపాతమును చక్కఁగా వర్ణించియున్నారు. విజయమున ప్రధాన రసము వీరమే. దానికి కరుణాదు లంగముగా నున్నవి. అర్జునుఁడు ధర్మజు నుపాలంభించు ఘట్టమును, కర్ణవధ ఘట్టమును, జలస్తంభన విద్యచే దాగిన దుర్యోధనుఁడు బయటి కరుదెంచి భీమునితో యుద్ధ మొనరింప సిద్ధమగు ఘట్టమును అత్యంత కౌశలముతో వర్ణింపఁబడియున్నది. "చచ్చిరి సోదరుల్ సుతులు చచ్చిరి" అను పద్యము ధర్మజుని ధర్మపరాయణతనే కాక యుపాలంభన నైపుణ్యమునుగూడ చక్కఁగా సూచించుచున్నది. అభిమన్యువధానంతరము ధర్మజార్జునులు విలపించిన సన్నివేశము కరుణ రససముద్రము. ధర్మజుఁ డభిమన్యుని యుద్ధమునకు పంపుచు,

"దగ్గఱ లేరు మామయును, దండ్రియును ద్రోణునితోడి పోరు కాఁ
దగ్గది, భార్య గర్భవతి, తల్లి సుభద్ర త్వదేకపుత్ర నీ
పగ్గె నిరంకుశంబు, పసిపాపవు, పాపులు వారు, మేనికిన్
గగ్గరుపాటు పుట్టెఁ గొడుకా! నిను యుద్ధము సేయఁబంపఁగన్."

అని దుఃఖించిన పద్యము వినునప్పుడు శ్రోతలకుఁగూడ గగ్గురుపాటు పుట్టకమానదు. ప్రథమాంకమున భీష్ముఁడు కృష్ణుని స్తుతించు పద్యము లాతని భక్తిభావమును బ్రకటించుచు శాంతరసమున కాకరములై యున్నవి. ఇట్లే విజయమున నాయాసన్నివేశములందు రౌద్ర బీభత్స భయానకములు చక్కఁగా పోషింపఁబడినవి. ఉద్యోగమునవలెనే విజయమునఁగూడ నాయా సన్నివేశములందు రచింపబడిన పద్యములు సులభములయ్యు శక్తిమంతములై మిక్కిలి యింపునిచ్చుచున్నవి. "అనృతము లాడఁగూడదనునంత వివేకము లేకకాదు— కొడుకుల నిర్వ్యరం గనియె గొంతి మమున్—ఇంటికిఁబోద మేల పదునెన్మిదినాళ్ళు గతించె—అతఁడ నేక యుద్ధముల నారియుతేరిన వృద్ధమూర్తి—వంధిమాగధులు కైవారంబు సేయకున్నా రేల నీరజనాభ నేఁడు—హరిసారథ్యము లేదు" మున్నగు పద్యములు భావగంభీరములై అత్యంతరసవంతములుగా నున్నవి. భీముఁడు దుశ్శాసనుని రొమ్ము బ్రద్దలు చేసి రక్తము ద్రాగు సందర్భమున,

"అక్కసుమీఱ రాజసుత నంతలు చేసిన వాని వక్షమున్
జెక్కలుచేసినన్ వగవఁజెల్లదు కాని తదీయమాంసమున్
గుక్కలునక్కలున్ దినవు, క్రోలరు నిక్కము వాని రక్తమున్
రక్కసులైన నీ వెటులు ద్రావెద వేవము లేక తమ్ముఁడా!"

అని ధర్మరా జన్న పద్యము ధర్మజ దుశ్శాసనుల శీలముల నెంతో నిపుణముగా విశదీకరించుచున్నది. తిరుపతికవుల పద్యముల కున్న నాటకోచితత్వ మనన్యసాధారణమైనది. అదియే వారి ఉద్యోగవిజయముల కెనలేని శోభ చేకూర్చినది. వీనిలో వారు కావించిన పాత్రప్రవేశ సూచనలను, భవిష్యదర్థ సూచనలును మనోహరములుగా నున్నవి అభిమన్యుఁడు యుద్ధమున కరుగుచుండఁగా ధర్మజుఁడు "నీక విజయంబు నువి.

సుభద్రాకుమార" అని యాశీర్వదించెను. ఇది "నీకే విజయమగుఁగాక-నీ కపజయము కలుగుఁగాక" అను రెండర్థములను స్ఫురింపఁజేయుచు భావికథను ధ్వనింపఁజేయు చున్నది. తిరుపతికవుల ప్రతిభ ప్రధానముగా ప్రాబంధికమే అయ్యును వారు ఉద్యోగ విజయములలోఁ బ్రదర్శించిన నాటకీయకళాకౌశలము అప్రతిమానమై అలరారుచున్నది.

పాండవాశ్వమేధము పాండవనాటకములలోఁ జివరిది. అశ్వత్థామ యుపపాండవాదులను సంహరించి అస్త్రసన్యాసము గావించుట, శిరోమణిగ్రహణము, స్త్రీ పర్వ వృత్తాంతము, కర్ణుఁడు కౌంతేయుఁడని యెఱిఁగి ధర్మరాజు దుఃఖించుట, భీష్మని నిర్యాణము, గంగాశాపము, అర్జునుఁడు యాగాశ్వముతో నరుగుట, అశ్వమేధయాగ నిర్వహణము అనునవి యీ నాటకమున ప్రధానాంశములు. తిరుపతికవు లందు కొన్నిచోట్ల జైమిని భారత కథావిధానమును కూడ ననుసరించినారు. ఇందు భీష్మనిర్యాణము విదురకృష్ణ సంభాషణమూలమునను, బభ్రువాహ నార్జునులయుద్ధ మంతర్నాటకము మూలమునను వివరింపఁబడి యున్నవి. గంగ యర్జునుని శపించిన వృత్తాంతము జైమిని భారతమునుండి గ్రహింపఁబడినది. ధర్మజుఁడు కర్ణచరిత్ర నెఱింగి విలపించిన ఘట్ట మాతనియుదాత్తతను, భ్రాతృప్రేమను వ్యక్తము చేయుచున్నది. స్త్రీపర్వ వృత్తాంతమునకు నాటకరూప మని చెప్పఁదగిన ద్వితీయాంకము కరుణరసమయముగా నున్నది. ఈ నాటకమునందలి ప్రధానరసము వీరము; కరుణ రౌద్రాద్భుతము లంగములు.

తిరుపతికవులు దేవీభాగవతము నాంధ్రీకరించునప్పుడు తమ మనస్సు నాకర్షించిన కొన్నియుపాఖ్యానములను తరువాత నాటకములుగా రచించియుండిరి. సుకన్య, అనర్ఘ నారదము అను నాటకము లిట్టివి. సుకన్య నాటకమున దేవీమహాత్మ్యమును, భక్తిమహిమయు నంతర్వాహినులుగాఁ బ్రవహించుచున్నవి. ఇందు సుకన్య పాతివ్రత్యము పరమావధిగా వర్ణింపఁబడియున్నది. ఇందలి ప్రధానరసము ధర్మవీరము. కరుణరౌద్ర హాస్యములును, శృంగారాభాసమును అంగములు. కవులం దెడనెడ దేవీభాగవతములందలి పద్యములనే వాడియుండిరి. అనర్ఘనారదమున నాలంకము లున్నవి. వైకుంఠమున తన్ను దర్శింపవచ్చిన నారదునకు విష్ణువు మాయాస్వరూపమును జూపనెంచుట ఈ నాటకకథకు బీజము. నారదుఁడు సౌభాగ్యసుందరియై తాలధ్వజుని వరించుట, తరువాత సృంజయ రాజకుమారియైన మదయంతిని వివాహమాడి తుంబురుశాపమునుండి విముక్తుఁడగుట యిందలి వృత్తాంతములు. ఇందలి ప్రధానరసము శృంగారము; హాస్యాద్భుతము లంగములు. విద్యాసౌందర్యము లెట్లు స్త్రీలహృదయముల కాకర్షకములు కాఁజాలునో యీ నాటకము చక్కఁగా వ్యక్తము చేయుచున్నది.

దంభవామన మాఅంగముల నాటకము. భాగవతమందలి వామనచరిత్ర కిందు మత్స్యపురాణాంతర్గతమైన జయంతీ శుక్రుల వివాహవృత్తాంతము కూడ జతచేయఁబడినది. మాయాసత్యశుక్రుల సమావేశముతోఁ గూడిన చతుర్థాంక మత్యంత హృద్యముగా నున్నది. బలి వేసిన ప్రశ్నములకా వామనుఁ డిచ్చు నుత్తరము లర్థద్వయస్ఫోరకములై భాగవత పద్యములవలెనే వ్యంగ్యవిలసితములై యున్నవి. బలివామనుల శీలము లిందు

చక్కఁగా పోషింపఁబడినవి. ఇందు వీర మంగి; శృంగారాద్భుతము లంగరసములు.

ప్రభావతీప్రద్యుమ్నము పింగళి సూరన ప్రబంధమునకు నాటకరూపము. ఇందు అయిదంకము లున్నవి. తిరుపతిశాస్త్రిగారి నాటకము నారంభించి యొండురెండంకములు రచించి దివంగతులు కాఁగా వేంకటశాస్త్రిగారు శిష్టభాగమును పూరించియుండిరి. ఇందలి శుచిముఖిపాత్రమున తిరుపతిశాస్త్రిగారు మరణించినతరవాత నొంటరిగా జీవితము పుచ్చు వేంకటశాస్త్రిగారు పదేపదే స్ఫురించుచుందురు. ఇందు కవుల స్వీయవృత్తాంతము పెక్కుచోట్ల గర్భితమైయున్నది. వజ్రనాభపదార్థమై ఇంద్రుఁ డొనరించు ప్రయత్నమే ఇందలి ప్రధానవస్తువు. అందు గౌరీ శుచిముఖులును, కృష్ణప్రద్యుమ్నులును అతనికిఁ దగిన సాహాయ్య మొనరించిరి. ఈ ప్రయత్నము ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహముతో సంబద్ధమైయున్నది చతుర్థాంకమునందలి అంతర్నాటకము కవికల్పితమైనట్టిది. ఇందు నటకులైన గదసాంబప్రద్యుమ్నులు వజ్రనాభాదులకు క్రోధోద్రేకము గల్గింతురు. కృష్ణుఁడు పంపిన చక్రము సాహాయ్యమున ప్రద్యుమ్నుఁడు వజ్రనాభాదుల శిరములు ఖండించును. ఇందలి శుచిముఖపాత్ర చిత్రణ మద్భుతముగా నున్నది. ఇందు వీరమంగి రసము; శృంగారాద్భుతము లంగములు.

గజాననవిజయ మను నామాంతరముగల చవితిచంద్రుఁ డను నాటకమున తొమ్మిదంకము లున్నవి. ఇది తిరుపతిశాస్త్రిగారి రచన. వినాయకచతుర్థి నాఁడు పూజానంతరము చెప్పికొను కథలందలి విషయమే ఇందలి వస్తువు. శమంతకోపాఖ్యానము కూడ నిందుఁ జేర్పఁ బడినది. వీర మిందలి ప్రధానరసము.

తిరుపతికవులు రచించిన మొదటి నాటకము పండితరాజము. మహాకవియు, లాక్షణిక శిరోమణియు, నాంధ్రుఁడు నైన పండితరాయలు ఢిల్లీపాదుషా కొమార్తయైన లవంగి ని వలచి వివాహమాడిన వృత్తాంత మిందలి వస్తువు. తిరుపతి కవులు లవంగీ పండితరాయలు భూలోకమున జన్మించిన సరస్వతీచతుర్ముఖులనియు, లవంగి బ్రహ్మణ కన్యయనియు, వివాహానంతరము వారు వినిర్మలయశస్సుతో జీవించిరనియు వర్ణించి పండితరాయల కున్న కళంకముతోపాటు కథా విధానమునందలి విషాదాంతత్వమును గూడ తొలఁగించిరి. పంచమాంకమున గంగాస్తవపూర్వకమైన పండితరాయల భక్తి రమ్యముగా వర్ణింపఁబడినది. కవు లిందు ప్రసక్తికల్పించుకొని వర్ణాంతర వివాహాది సాంఘిక విషయములను గూర్చియు, సామంత ప్రభువులస్థితిగతులను గూర్చియు చర్చించిరి. వారు నానారాజసందర్శన సందర్భములఁ దాము రచించిన కొన్ని పద్యముల నిందు సమయోచితముగా ప్రవేశపెట్టుటయేకాక స్వీయప్రతిభా విశేషములను గూడ ధ్వనింపఁ జేసిరి. పండితరాయల గంగాలహరి యందలి శ్లోకములు పంచమాంకములో సరసముగా ననువదింపఁ బడియున్నవి. శృంగారరసప్రధానమైన యీ నాటకము రమణీయకల్పనా మనోహరమును, హృద్యమునై యున్నది.

పోలవరము జమీందారుగారి ప్రేరణముచే తిరుపతిశాస్త్రిగారు ఎడ్వర్డు పట్టాభిషేక నాటకమును రచించిరి. ఇందు నాటక లక్షణములన్నియుఁ బ్రయత్నపూర్వక

ముగా ననుసరింపఁబడి మొదటి ముద్రణమున సూచితములైనవి. ఇందు కథా చమత్కార మేమియు లేదు. కవిత్వము మాత్రము ప్రశస్తమై కవుల దేశాభిమానమును, రాజభక్తిని చాటుచున్నది.

వ్యసనవిజయ మసంపూర్ణమైన ప్రకరణము. ప్రకటితములైన మూఁడంకములలో సప్తవ్యసనములలో నొకటగు ద్యూతమునకు వశులై ధనమానప్రభావములను గోల్పోయి నీతిబాహ్యమైన జీవితమును పుచ్చు జూదరులదుస్థితి వర్ణింపఁ బడియున్నది. ఇందలి పాత్రలు నామములు వేఱుగా నున్నను- కవులకాలమున జీవించిన వారే యని తోఁచుచున్నది. ఈ నాటకము పదబహుళమై కవుల యాశుకవితా ప్రావీణ్యమును, లోకజ్ఞతను చాటుచున్నది. సువర్ణపాత్రిక మను నింకొక ప్రకరణము గూడ తిరుపతి వేంకటకవులు రచించియుండినట్లు తెలియుచున్నది. విప్రనారాయణుని చరిత్ర మిందలి వస్తువు. ఆ భక్తునియందలి దయచే రంగధాముఁడు దేవాలయమునందలి సువర్ణపాత్రను వేశ్యమాత కంపఁగా నదియే విప్రనారాయణుని దోషిగా నిరూపించిన ప్రధానాంశమును బురస్కరించుకొని నాటకమున కాపేరు పెట్టఁబడినది. వేశ్యాలోలత వలని యనర్థముల నుపదేశించుటయే ఇందలి పరమార్థము. ఆరంభమున కామవైరాగ్యముల కింద్రసభలో జరిగిన వివాద మిందు మిక్కిలి రసవంతముగా నున్నది. వైద్యశేఖరులైన పండిత డి. గోపాలాచార్యుల వారి ప్రేరణచే తిరుపతిశాస్త్రిగారు జీవానందమను వైద్యశాస్త్రసంబంధి సంస్కృత నాటకమును గూడ ననువదింప నారంభించినట్లు తెలియుచున్నది. కాని యది నాందీపద్యానువాదముతోనే ముగిసినట్లు కనిపించుచున్నది.

పైని పేర్కొనఁబడిన రూపకములనే కాక పల్లెటూళ్ళ పట్టుదలలు, అపూర్వ కవితావివేచనము, త్రిలోకవిజయము, కవిసింహగర్జనలు, రసాభాసము మున్నగు ప్రహసనములను గూడ తిరుపతి వేంకటకవులు రచించియుండిరి. సమాజము నందలి కొన్ని లోపములను, జుగుప్సాకరములైన ప్రవర్తనలను సంస్కరింపవలె నను ఉద్దేశముతో వారు వానిని చేపట్టియుందురు. వానివలన సమకాలిక పరిస్థితులయెడ తిరుపతి కవుల కున్న యభిప్రాయములను తెలిసికొనవచ్చును.

తిరుపతివేంకటకవులు రచించిన వచనగ్రంథమును అనువాదములు, విమర్శలు, చరిత్రలు, వ్యాసములు అను నాల్గు భాగములుగా విభజించవచ్చును. వీనిలో అనువాదము లన్నియు తిరుపతిశాస్త్రిగారు రచించినట్లుగను, స్వతంత్రము లన్నియు వేంకటశాస్త్రిగారు రచించినట్లును గనఁబడును. వేంకటశాస్త్రిగారి వచనరచనలు కొన్ని గ్రాంథికభాషయందును, కొన్ని వ్యావహారిక భాషయందును రచింపఁబడినవి.

కాశ్మీరదేశీయుఁడైన బిల్హణమహాకవి సంస్కృతమున రచించిన పదునెనిమిది సర్గములతోఁ గూడిన విక్రమాంకదేవచరిత మహాకావ్యమును, జైనముని గుణనంది శిష్యుఁడైన వీరనంది రచించిన పదునెనిమిది సర్గముల చంద్రప్రభుచరిత మహాకావ్యమును, తిరుపతి శాస్త్రిగారు వచన రూపమున నాంధ్రీకరించిరి. ఇందలి వచన శైలి

ఆలంకారికమై, ప్రౌఢమై, ధారావాహియై యలరారుచున్నది. అట్లే తిరుపతిశాస్త్రిగారు బాణుఁడు సంస్కృతమున రచించిన శ్రీహర్షచరితమునందలి మొదటి మూఁడుచ్ఛ్వాసములను వచనమున నాంధ్రీకరించి సరస్వతీపత్రికలో ప్రకటించిరి. శ్లేషవిరోధాభాసయమకానుప్రాసాద్యలంకారములతోడను, దీర్ఘసమాసములతోడను కూడియుండు బాణుని వచనమును వారు భావబంధురముగను, సరససుందరముగను ఆంధ్రీకరించి యుండిరి. ఈ మూఁడుచ్ఛ్వాసములలో బాణుని స్వీయచరిత్రము కలదు. తిరుపతిశాస్త్రిగారు రవీంద్రనాథఠాగూరు గారు రచించిన కొన్ని కథలను 'రవీంద్రనాథ ఠాగూరు కథ' లనుపేర తెలుఁగువచనమున కనువదించిరి. అది మ్యాక్‌మిలన్ కంపెనీ వారిచే ముద్రింపఁబడినది.

తిరుపతివేంకటకవుల రచనలలో 'భారతవీరు'లని యొక వచనగ్రంథ మున్నది. మహాభారతమునందలి కొందఱు వీరులకథ లిందు సరళశైలిలో వ్రాయఁబడినవి. వేంకటశాస్త్రిగారిని జయపురసంస్థానాధీశులైన విక్రమదేవవర్మగారు సన్మానించిన సందర్భమున 'విక్రమచెళ్ళపిళ్ళ' యను గ్రంథము రచింపఁబడినది. వేంకటశాస్త్రిగారు శ్రీరావు గంగాధరరామారావుగారికి షష్టిపూర్తి జరిగిన సందర్భమున 'షష్టిపూర్తి'యను గ్రంథమును, తనధర్మపత్ని దివంగతురాలైనప్పుడు 'సతీజాతక'మను గ్రంథమును, తిరుపతిశాస్త్రిగారు కీర్తిశేషులైనప్పుడు 'దివాకరాస్తమయ'మను గ్రంథమును రచించి యుండిరి. దివాకరాస్తమయమున జంటకవు లిరువురికిని గల సంబంధమును, వారి రచనలలో నెవరెవ రేభాగములు రచించిరను విషయమును సూచింపబడినవి.

తిరుపతివేంకటకవుల సారస్వతవిమర్శలలో కొన్ని భారతాది గ్రంథములకు సంబంధించినవి. కొన్ని అన్యులు వారి రచనలను గుఱించి కావించిన విమర్శలకు ప్రత్యుత్తర రూపములైన ప్రతివిమర్శలు. వారి భారతవిశేషము లను చిన్నగ్రంథమున కొన్ని శబ్దములయు, సంధులయు ప్రాసములయు సాధుత్వము ప్రయోగపూర్వకముగా నిరూపింపఁబడియున్నది. పాశుపతము, పురశ్చరణము, శృంఖలాతృణీకరణము అనునవి రామకృష్ణకవులు తిరుపతికవుల రచనలను గూర్చి కావించిన విమర్శలకు సమాధానములు. అట్లే ప్రభావతీప్రద్యుమ్న నాటకముపై వచ్చిన విమర్శలకును, కొప్పరపుకవులు శ్రీపాదవారు మున్నగువా రొనర్చిన విమర్శలకును సమాధానము లిచ్చుచు వారు ప్రకటించిన ప్రతివిమర్శలు పెక్కు భాషాసారస్వత రహస్యములను వివరించుచు జిజ్ఞాసువులకు మార్గదర్శకములై యున్నవి.

షష్టిపూర్తియైన పిమ్మట వేంకటశాస్త్రిగారు తాము యౌవనమున కావించిన శ్రీ యాత్రను వర్ణించుచు నొక గ్రంథమును రచించిరి. ఇందు ప్రసంగవశమున స్వీయచరిత్రకు సంబంధించిన పెక్కువిషయములు వివరింపఁబడియున్నవి. అది అప్పటి దేశకాల సంఘమతాది పరిస్థితులను చక్కఁగా వెల్లడించుచు నవలవలె, కథవలె, పాఠకుల నలరించును. ఆంధ్రమునందలి యాత్రావర్ణన గ్రంథములలో దీనికి విశిష్టమైన స్థానమున్నది.

తిరుపతి వేంకటకవుల వచనగ్రంథములలో 'కథలు గాథలు' అను పేరఁ బ్రకటింపఁబడిన సంపుటములు మిక్కిలి ముఖ్యములైనవి. ఇవన్నియు వేంకటశాస్త్రిగారు ఆయా పత్రికలలో నప్పుడప్పుడు ప్రచురించిన వ్యాసములు. వానిలో కొన్ని సాహిత్య చర్చలకును, కొన్ని స్వీయచరిత్రకును, కొన్ని ప్రసిద్ధకవిపండితాదుల జీవితములకును, కొన్ని పూర్వ స్మృతులకును, కొన్ని సాంఘిక సంప్రదాయ విమర్శకును, కొన్ని కావ్యాంగములైన రసవర్ణనాదులకును, కొన్ని ఆంధ్రీకరణ గ్రంథసంస్కరణ విధానమునకును సంబంధించినవి. వీని యన్నింటిలో వారి స్వీయానుభవము పుష్కలముగా గోచరించును. వానిని ఇరువదవ శతాబ్ద పూర్వార్థమున నాంధ్రదేశమున ప్రవర్తిల్లిన సాంఘిక సారస్వత సన్నివేశములకు మణిదర్పణములని చెప్పవచ్చును. ఇవి విషయగంభీరములును, హాస్యవిమర్శన చమత్కార శోభితములును, శాస్త్రచర్చాపూర్వకములును, శబ్దప్రయోగ రహస్య ప్రదర్శకములునై శాస్త్రిగారి సర్వతోముఖ పాండిత్య ప్రతిభా ప్రకాశము చాటుచున్నవి. ఇందలి శైలి వ్యావహారిక మయ్యు గంభీరమును, అత్యంత శక్తియుక్తమునై యలరారుచున్నది. ఆంధ్రవ్యాస వాఙ్మయమునకే 'కథలు-గాథలు' తలమానికము లని చెప్పఁదగినట్టివి.

తిరుపతివేంకటకవుల రచనలవలెనే వారి యవధానములు, రాజసందర్శనములు, చాటువులు, కవితావివాదములు కూడ నాంధ్రదేశమున నపారమైన కవితాచైతన్యము కలిగించినవి. వారు పెక్కుచోట్ల నష్టశతావధానము లాచరించియుఁ, బలువురు రాజులను, మంత్రులను, సంపన్నులను దర్శించి ఆశుకవితాప్రదర్శన మొనరించియు, దేశము నల్గడల నాంధ్రకవిత్వమునెడ నభిమానము నతిశయింపఁ జేసిరి.

అవధాన మొక కవితా వినోదము. ఈ కళ ఆంధ్రదేశమునవలె మఱెచ్చటను వర్ధిల్లియుండలేదు. తిరుపతివేంకటకవులు అభినవ పండితరాయబిరుదాంకితులైన శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యుల వా రొనరించిన యవధానములను గాంచి తాముకూడ దాని నభ్యాసము చేసిరని చెప్పుదురు. వారు పలుచోట్ల పలుమా ర్లవధానము లొనరించి వానికి బహుళప్రచారము కావించిరి. ఆకళకు అసాధారణ గౌరవాదరములు కలిగించిన వారు తిరుపతివేంకటకవులే. లోకమున శతావధాని బిరుదాంకితు లనేకులున్నారు. కాని వారిలో నిజముగా నూఱుమందికిని నిర్విఘ్నముగా పద్యములు చెప్పఁజాలినవారు కొలఁది మందియే. తిరుపతికవులు సంపూర్ణ శతావధానములు పెక్కుమాఱులు గావించి విద్వద్రాజ పరిషత్తుల ప్రశంస లందుకొని యున్నారు. ఒక నూఱుమందికే కాక వేయి మందికైనను ఆశుకవిత్వము చెప్పనేర్తు మని వారొక్కచో నుడివి యున్నారు.

అవధానకాలమునఁ జెప్పఁబడు పద్యములు ఆశుప్రోక్తము లగుటచే సాధారణముగా నం దర్థగాంభీర్యమును, రసస్ఫూర్తియు, పదప్రయోగౌచిత్యములును మృగ్యములై యుండును. తిరుపతి కవుల యవధాన పద్యములలో నందు కపవాదము లని చెప్పదగిన వెన్నో యున్నవి. కాకినాడ శతావధానమందలి "శ్రీమద్ధరణిజాత సీమంతినీ మణీహాస ద్విగుణిత ప్రభాననుండు" అను సీస పద్యమును, బందరు శతావధానమందు

లక్ష్మీపార్వతుల వాక్కలహమును వర్ణించు "గంగాధరుఁడు నీ మగం డని నవ్వంగ వేషధరుండు నీ పెన్మి టనియె" అను సీస పద్యమును ఇందుకు నిదర్శనములు. ఇవి ధారాశుద్ధి శోభితములై ప్రశాంతముగాఁ గూర్చుండి ఆలోచించి చెప్పిన పద్యములకెం దును తీసిపోకుండ నున్నవి. సరసుఁ డొకఁడు వేశ్యయింటి కేగి రాత్రి తెల్లవార్చిన విధ మును వారిట్లు వర్ణించియుండిరి.

"సరసుని వైపు వీపు, నలచానమొగం బటు గోడవైపు నా
సరసుఁడు కేలుచాపు నలచానఁయు జన్నులఁ జేయిమోపు నా
సరసుఁడు కోర్కెఁ జూపు, నలచాన తొడం దొడలోన దోపు నీ
వరుసనె తెల్లవారె నొక వైఖరి నొక్కని కొక్క వేశ్యతోన్."

ఈ పద్యము శబ్దార్థ చమత్కారములతోఁగూడి సరససుందరమై కవుల సమయస్ఫూ ర్తిని, కవితాకౌశలమును జక్కగా వ్యక్తము చేయుచున్నది. తోటరామచంద్రపుర మున "పరిణామోజ్జ్వల పంచవర్ణయుతమె" ఇత్యాదిగా నింద్రచాపమును వర్ణించుచు చెప్పిన పద్యము విని యది యవధానరచిత మని యెవ్వరును భావింపరు.

అవధాన సమయముల పృచ్ఛకు లడిగిన ప్రశ్న లెట్టివైనను తిరుపతికవులు వాని కన్నిటికి సరసముగను, హృద్యముగను, కొన్నిచోట్ల హాస్యపూరితముగను సమా ధానము లొసఁగియుండిరి. అవధానములందు వారు పకోడి మొదలు పరబ్రహ్మము వఱ కును గల పదార్థముల నెన్నిటినో వర్ణించియుండిరి.

"సెనగపిండి ఉల్లిపాయ చిన్నమిర్పకాయలుం
జొనిపి యందు నల్ల మింత చొన్పి ముద్ద చేసియున్
అనలతప్తమైన నేతియందు వైచి వేచినన్
జను పకోడి యనెడి పేరఁ జక్కనైనఖాద్యమై".

నూజివీడులో జరిగిన యవధానమున పకోడీ ప్రియులెవ్వరో అడుగఁగా చెప్పిన పద్య మిది. ఇట్లే వారు కిరసనాయిలు, పొడుము, చీపురుపుల్ల, అగ్గిపెట్టె, చెదపురుగు మున్నగువానినిగూర్చికూడ పద్యములు చెప్పి పృచ్ఛకులను తృప్తిపఱిచియుండిరి.

తిరుపతికవు లుభయభాషాకవితాశోభితులగుటచే నెవ్వరైన నడిగినచో సంస్కృతమునఁగూడ నాశువుగా కవిత్వము చెప్పియుండిరి.

"ప్రాలేయ ప్రచురా నిశాః పరిమళత్కుందా లతామంటపాః,
శ్చూతాః కోకిలసంకులా, జలగృహా మాద్యన్మయూరస్వనా
వ్యర్థాస్స్యు ర్న తదర్థ మీష దపి మే చింతా పరం జాయతే
కిం వక్ష్యామి కురంగశాబనయనే వ్యర్థా శరచ్చంద్రికా."

అనుశ్లోక ముదాత్తకవితామయమై అత్యంత హృద్యముగా నున్నది. ఇందలి సరసున కేవి వ్యర్థములైనను విచారము కలుగలేదుకాని, శరచ్చంద్రిక వ్యర్థమగుట మాత్రము సంతాపము కలిగించినది.

అవధానములందు సమస్యాపూరణము మిక్కిలి క్లేశకరమైన విషయము. కొన్ని సమస్యలు తలయు తోకయులేక అసలు పూరించుట కవకాశముండునా యను ననుమాన ముదయించుచుండును. తిరుపతివేంకటకవు లనన్యసాధ్యములును, దుష్కరప్రాస యుక్తములును నగు సమస్యల నెన్నిటినో సంస్కృతాంధ్రముల రెండింట సరసమనోహరముగా పూరించియుండిరి. "సంధ్యావందన మాచరింపవలదా చౌశీతి బంధమ్ముల న్"1 "అంధుం దర్శనిశీథమందుఁ గనె నయ్యర్కేందు బింబంబులన్,2 "గణచతుర్థి నాఁడు ఫణిచతుర్థి", మున్నగు క్లిష్టములైన సమస్యలను బూరించిన విధ మందుకు నిదర్శనము. "వ్యాఘ్రో మృగం వీక్ష్యహి కాందిశీకః" అను సమస్యను వా రిట్లు పూరించిరి.

"శ్రుతేపి మన్నామని కాందిశీకో
రామో భవే ది త్యభయం వదంతం
సీతే త్యవోచ ద్దశకంధరం చే
ద్వ్యాఘ్రో మృగం వీక్ష్య హి కాందిశీకః"

నా పేరు విననంతనే రాముఁడు పరుగెత్తవలసినదే యని రావణుఁడు పలుక, సీత "అయినచో లేడిని చూచి పులి పరుగెత్తు" నన్నది. రెండును అసంభవములే యని ఇందలి భావము.

అష్టావధానమున వ్యస్తాక్షరి, నిషిద్ధాక్షరి అనునవి చాల క్లేశమును కలిగించు నంశములు. తిరుపతివేంకటకవులు తమ కపరిచితములైన ఆంగ్లము, అరవము మున్నగు భాషలందుఁ గూడ వ్యస్తాక్షరిని నిర్దుష్టముగా నాచరించి అనిబిసెంట్, పెన్దార

---

1. "వింధ్యాద్రిప్రభ నొప్పు బల్కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పఁగలేక వెఱ్ఱివయి యేలా మంచియారాతిరిన్
వంధ్యం జేసెదు, కాముకేళి యనఁగాఁ బాండిత్యమా, లేక నీ
సంధ్యావందనమా చరింపవలదా చౌశీతిబంధమ్ములన్."

2. "పుంధర్మేత సరస్వతీ కవులతో భూపాలకుం డాదితే
యాంధస్తీక్ష్ణగభ స్తిబింబముల నుద్యద్వృత్తి వర్ణించి స
ద్గ్రంథంబుల్ రచియింపుఁడీ యనఁగఁ దద్గ్రంథాను సంధాన ని
ద్రాంధుం దర్శనిశీథమందుఁ గనె నయ్యర్కేందుబింబమ్ములన్."

మొదలైన యాంగ్లేయుల కాశ్చర్యము కలిగించి యుండిరి. వారు నిషిద్ధాక్షరికి చెప్పిన పద్యములు కూడ సర్థవంతములు, ధారాశుద్ధి శోభితములునై యుండుట మిక్కిలి ప్రశంసా పాత్రయైన విషయము. కొన్ని సందర్భములయం దవధానములలో రెండర్థముల పద్యములను శ్లోకములను గూడ చెప్పఁజాలుట వారి యపారమైన పాండిత్యమునకు నిదర్శనము.

"సరోజై స్సంబంధం వ్రజతి భజతే సత్పథగతిం
సదా ప్రీత్యా ధత్తే కుసుమశరసూనుం త మనఘం
పదం రక్తం ధత్తే సుదృగుపకృతిం చాపి తను తే
తతో హంసో నూనం భవతి ఖలు హంసో యతివిభో"

ఇందు సూర్యునికి హంసకును అన్వయించునట్లుగా రెండర్థములు సాధింపఁబడినవి. క్లేశకరములై అవధానాశు కవితా ప్రదర్శనములను వినోదప్రాయముగా పరిగణించిన వారు తిరుపతి వేంకటకవులు. అందుచేతనే వారు-

"శతఘంటకవనమ్ము సల్పుసంగతి యన్నఁ
గరతలామలకమ్ము గాదె మాకు,
అష్టావధాన కష్టావలంబన మన్న
నంబికొండయ దండనంబు మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న
నల్లేరుపై బండినడక మాకు"

అని వ్రాకుచ్చియుండిరి. ఒకచోట శతావధానమును సర్కసుతో బోల్చుచు వా రిట్లు చెప్పియుండిరి.

"తిరుపతి వ్యాఘ్రమై బయలుదేఱిన శిష్యులు గున్నయేన్గులై
వఱలఁగ దేరఁగాఁదగిన వారలు బెబ్బులిపిల్ల లెల్లమా
ర్తురు కపికుర్కురమ్ము లయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధాన మను సర్కసు చూపితివమ్మ శాంకరీ"

శతావధానము సర్కసువంటిదే కాని కేవల దేహపరిశ్రమతోఁ గాక ప్రతిభావంతమైన మానసిక పరిశ్రమముతోఁ గూడి శ్రోతల కపారములైన యానందాశ్చర్యములను చూఱ యిచ్చుచుండును.

తిరుపతివేంకటకవులాయా రాజులను దర్శించి నప్పుడు వారు పంపుకొన్న అర్జీలును, ప్రసక్తాను ప్రసక్తముగాఁ జెప్పిన పద్యములును నానారాజసందర్శనమను పేర గ్రంథముగా ముద్రింపఁబడియున్నవి. ఆ పద్యములలో నాశువుగా జెప్పినవి గూడ

చాలగలవు. కొన్నియెడల వారు రాజమిత్రులను ఆస్థానపండితులను తద్వారా రాజ సందర్శనము చేసియుండిరి. కొన్నియెడల నాస్థానపండితు లీర్ష్యాగ్రస్తులై తమయెడ రాజులకు వైముఖ్యము కలిగింప యత్నింప, నెట్లో రాజదర్శనము సంపాదించి వారి దుఃస్వభావమును వెల్లడించి ద్విగుణీకృతములైన గౌరవసన్మానములను బొందియుండిరి. నానారాజసందర్శనమునందలి పద్యములవలన తిరుపతివేంకటకవుల ఆత్మవిశ్వాసమును, ధైర్యసాహసములును, సమయస్ఫూర్తియు, ఉదాత్తప్రకృతియు తేటతెల్లము లగును. వా రేరాజును దర్శించినను 'మీరు రాజులైనచో మేము కవిరాజుల'మని ధీమాగా పల్కినవారే కాని దీనముగా యాచించినవారు కారు. గుణగణములనుబట్టియే ప్రశంసించిరిగాని యధముల నింద్రులు చంద్రులని అనవసరముగా పొగడియుండలేదు.

"మీకు రాజపదము మాకును గవిరాజ
పదము గల దిఁకెందుఁ గొదువలేదు
కాన సామ్య మిచ్చి మానించు టొప్పదే
ముద్దుకృష్ణ యాచభూవరేణ్య !"

అని వేంకటగిరి రాజుతో చెప్పినపద్యము వారి ధైర్యమును ఔదాత్త్యమును సూచించుచున్నది. వారు సన్మానముల ద్వారా ధనము సంపాదించుటకే కాక యశస్సంపాదనమునకే పలువురు రాజులను దర్శించియుండిరి.

"రాజమిత్రుల మదికాక రాజబంధు
వులము, కవిరాజులము పలువురు గలట్టి
కులము వారము మా కెందుఁ గొదువ లేదు
కీర్తికైరాక సుమి వనపర్తిభూప !"

అని వారు వనపర్తిరాజుగారితోఁ జెప్పిన పద్య మిందుకు నిదర్శనము. తమ పాండిత్యమునో కవిత్వమునో అవధానమునో దర్శింపకుండ రాజులు కావించిన సన్మానములు వారికి తృప్తికలిగించెడివి కావు. గద్వాలరాజుగారు సభ చేయింపకయే సన్మానము చేయనెంచి నపుడు వారు-

"ఏ కవి యెట్టివాఁడొ మఱి యేకవి కెట్టి విశేషపాండితీ
శ్రీ కలదో విచారణము చేయుటయే కనకాభిషేకమౌఁ
గాక తదన్యపద్ధతి జగమ్ము సమస్తము ధారవోసినం
జేకుఱునే ముదమ్ము పరిశీలనసేయుము రామభూవరా !"

అని చెప్పుట ఇందుకు దృష్టాంతము. త మ్మపండితులైన వారితో సమానముగా సత్కరించుచో నా సన్మానము ఘనమైనదైనను వారి కానందహేతువయ్యేడిది కాదు. ఎవరైన రాజులు తమ్ము లాఘవ పఱిచినట్లు తోఁచినచో వా రించుకయు లెక్కచేయక "తగ వెఱిం

గియు పక్షపాతమ్ము పూని మమ్ము నిరసించు టంత క్షేమమ్ము కా"దని ధైర్యముతో మందలించెడివారు.

తిరుపతికవు లుదారులైన రాజులనుగూర్చి చెప్పినపద్యములు కొన్ని మృదు మధురములును భావగంభీరములునై మహాకావ్యములందలి పద్యములతో పోటీ చేయుచు వారి గుణపక్షపాతమును ప్రకటించుచున్నవి.

"ఎందఱఁ జూపెనేని వరియింపదు మాకవితాకుమారి క
న్నందుకు దేశముల్ దిరుగు టబ్బెను సౌఖ్యము లేకపోయె నా
నందనృపాల ! నీదుసుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దలయూచెఁ గావునఁ దటాలున దీనిఁ బరిగ్రహింపుమా."

అని ఆనందగజపతి మహారాజులుంగారిని గూర్చియు, "ఇను గంటిన్ నిను గంటి భేద మొక యింతేనిం గనన్‌రాదు" ఇత్యాదిగా కిర్లంపూడి రాజును గూర్చియు వారు చెప్పిన పద్యము లిందుకు దృష్టాంతములు. సభ చేయించుట కాలస్యమైనప్పుడును బెక్కు దినము లొక్కచో నుండిపోవలసి వచ్చినప్పుడును తమపాట్లు రాజులకుఁ దెల్పుచు చెప్పిన పద్యములు కొన్ని మిక్కిలి సరసములై ఇంపు నింపుచున్నవి. "కఠినమ్ము లగు రాళ్ళు కరపికట్టిన రామభజనాలయమ్ములే పడకలాయె" అని వేంకటగిరి రాజుగారికి వ్రాసి కొన్న అర్జీలోని పద్య మాయూర వారు పడిన యిడుములను చక్కగా వర్ణించుచున్నది. గద్వాలలో నిట్లే నాలస్యముగా రాజదర్శనము లభించిన విమ్మట రాజుగారు కుశల ప్రశ్నము కావింపగా వారు "చదువు నేర్పించెను చర్లబ్రహ్మయ్యశాస్త్రి, వంట నేర్పించె గద్వాలరాజు" అని చెప్పి తా మన్నిదినములును స్వయముగా వంట చేసికొనుచు పడిన క్లేశము వ్యక్తము చేసిరని వినుచుందుము. శ్రీనివాస విలాసము నాంధ్రీకరించి కొని రమ్మని ఆత్మకూరురాజుగారు ఆజ్ఞాపింప తిరుపతికవులందు కీయకొని సెలవిమ్మని వేడుచు నీ క్రింది హృద్యమైన పద్యము చెప్పియుండిరి.

"వేసవి దగ్గరాయె మిము వీడుటకున్ మన సొగ్గదాయె మా
వాసము దూరమాయెఁ బరవాస మొనర్చుట భారమాయె మా
కోసము తల్లిదండ్రు లదిగో యిదిగో యని చూచుటాయె వి
శ్వాస మెలర్ప వే సెలవొసంగినఁ బోయెదమయ్య భూవరా !"

కొందఱు రాజులు తమ పాండితికిఁ దగినట్లు సన్మానింపని సందర్భమున వారు వ్యంగ్యరీతి నిరసనము సూచించి వారినుండి చివరి కర్హ సమ్మానము పొందిన సందర్భములు కూడ కొన్నియున్నవి. శ్రీ గోదే గజపతిరాజుగారికి వ్రాసిన అర్జీలో—

"సంగరశక్తి లేదు వ్యవసాయము సేయుట సున్న సంతలో
నంగడి వైచి యమ్ము టది యంతకు మున్నె హుళక్కి ముష్టికిన్

బొంగు బుజాన వైచుకొని పోయెద మెచ్చటికేని ముష్టిచెం
బుం గొనిపెట్టి మొక్కటి యమోఘ మిదే కద దంతిరాణ్ణృపా !

అను పద్య మందుకు నిదర్శనము. శ్రీనివాస విలాసము నాంధ్రీకరించి యాత్మకూరు నృపాలునకు వినిపించుటకుముం దనూయాగ్రస్తులగు పండితులను గూర్చి చెప్పిన క్రింది యుత్పలమాలిక యా పండితుల ఈర్ష్యావైరస్యములనే కాక కవుల కుండవలసిన లక్షణములను గూడ చక్కగా వివరించుచున్నది.

"శ్రీ వెలయంగ సత్కవిత చెప్పెడివాఁ డనఁ బండితుండునుం
గావలె లౌకికోత్తరుఁడు గావలె బుద్ధివిశేషధుర్యుడుం
గావలె భోగి యోగియును గావలెఁ గొంటెలలోన గొంటెయుం
గావలె మంచిచెడ్డ యన కీ సకలమ్ము నెఱుంగఁ గావలెన్."
...............వగలాడి రసానుభూతికిన్
ద్రోవ యెఱుంగనట్టి యొక నూతన వైదికసార్వభౌము రె
మ్మోవిని నొక్కనాఁడు మొగముం గడకొత్తి యిసీ! తుధూ! తుధూ!
నీ! వెఱిదాన! మంచియును జెడ్డయు నేర వపాత్రురాల! నా
పావనమైన యోష్ఠమును బాడుగఁ జేసితి వింకఁ గాశికిం
బోవలెఁ బంచగవ్యమును బుచ్చుకొనన్వలె నంచుఁ దిట్టుఁగా
నీ వగలాడిచేష్ట లివి యీగతి నుండునటం చెఱుంగునే"

రాజాస్థానములను దర్శించినప్పు డాయారాజుల కోరిక ననుసరించియు, సందర్భము ననుసరించియు తిరుపతికవులు చెప్పిన ప్రాసంగికపద్యములు శ్రీనాథుని చాటువులవలె సరససుందరములై యలరారుచుండును. గద్వాలరాజుగారు స్త్రీలకు సౌందర్యహేతువులైన యవయవము లన్నియు పురోభాగముననే యుండ జడమాత్రము వెనుక నుండుటకు కారణమేమి యడిగినప్పుడు "పురుషాయిత మొనర్చు పూబోఁడి కటిమీఁద నాట్యమ్ము సలుపు పుణ్యమ్ము కొఱకొ" ఇత్యాదిగా వారు చెప్పిన పద్యము వారి సమయస్ఫూర్తికిని, రసవత్కవితా కౌశలమునకును నిదర్శనము. ఆత్మకూరు సీతారామభూపాలుఁడు పెండ్లిపందిరిలోని చాందినీని వర్ణింపుఁ డని కోరఁగా తిరుపతిశాస్త్రిగారు—

"నీ యౌదార్యము రాకకు న్మిగులఁగా నీ విచ్చు పేరీవికై
యాయావేళల నేమి కావలయునో యంచున్ సురాగమ్ము నీ
కై యేతెంచె నటంచు నెంచె దను నే నీచాందినిన్ సోమరా
డ్దాయాదా! నృపసార్వభౌమ! వర సీతారామభూపాలకా".

అని యాశువుగాఁ జెప్పియుండిరి. అట్లే వేంకటశాస్త్రిగా రచ్చటి గ్యాసులైటునుగూర్చి,

"నాసోదర్యుల దానధర్మపటిమన్ నాతండ్రి గాంభీర్యవి
ద్యాసంపన్నతచే జయించితివి నేనా మున్నె నీకీర్తిచే
గాసిం బొందితి ప్రోవు మంచు శశి యీ కాలమ్మునన్ దీపమై
తా సేవింపఁగ వచ్చె కిన్గొనుము సీతారామభూపాలకా"

అని చెప్పియుండిరి.

లౌభ్యవశమున తమ్ముచితరీతిని గౌరవింపనివారిని గూర్చి వేంకటశాస్త్రిగారొక
ప్పుడు తిరుపతిశాస్త్రిగారితో నన్యాపదేశముగా నీ క్రిందిపద్యమును చెప్పియుండిరి.

"ఒక యేఁగానికిఁ జిన్నికుఱ్ఱనికి నాయుష్కర్మ చేయించి దా
నికినై కాని యొసంగి తక్కసగముం దెమ్మన్న నాచేత లే
దకటా నాఁ గను క్షౌరపుంగృతికిఁ దా నంగీకృతిం జొన్పు లౌ
భ్యకులాయం బగు ముద్దరాలిచరితం బాలించితే తిర్పతీ".

మీసములనుబట్టి వారు పండితులుకారని కొంద రాక్షేపింప తిరుపతికవులు చెప్పిన,

"దోస మటం చెఱింగియును దుందుడు కొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుబాసలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పగా
రోసము గల్గినం గవివరుల్ మము గెల్వుఁడు గెల్చిరేని ఈ
మీసము తీసి మీపదసమీపములం దల లుంచి మ్రొక్కమే"

అనుపద్యము సర్వాంధ్రలోకవిదితమైనది. మేమును అవధాన మొనరింపఁగలమని
డంబములు పలికి కృతార్థులు కాకపోయినవారిని గూర్చి గద్వాలలో వారొకప్పుడు
అన్యాపదేశముగాఁ జెప్పిన—

"నాలుగామడ దాఁట నా నేర్పు మీఁద నా
చేతఁగాదను నొక్కకోతిగాఁడు"

...............................

"ఇట్లు పల్కుచునున్న కపీశ్వరులు శి
రములు వంపంగ శతయోజనములవార్ధి
దాటి వచ్చిన ని న్నెన్నఁ దరమె మాకు
నాంజనేయ ! కవిధ్యేయ ! యప్రమేయ".

అను సీసపద్యము వారి నెంతో వ్యంగ్యముగా హేళనచేయుచున్నది. రాజులు పట్టాభి
షేక పరిణయోత్సవ సందర్భములందును, విక్టోరియా, తిలక్, పోలవరము జమీం
దారుగారు మున్నగు మహనీయులు కీర్తిశేషులైన సందర్భమునను, తిరుపతి వేంకట
కవులు చెప్పిన రసవంతములైన పద్యము లెన్నో యున్నవి. వారు పిండిబొమ్మ

నుద్దేశించి యన్యాపదేశముగాఁ జెప్పిన పద్యములు భావగంభీరములైనవి. ఆశువుగాఁ జెప్పిన పద్యములుకూడ భావముననఁగాని పదప్రయోగముననఁగాని రస ననఁగాని కొఱ వడక సహృదయహృదయంగమములై యలరారుచుండుట యప్రతిమానమైన వారి ప్రతిభాసంపదకును అవిచ్ఛిన్నమైన అభ్యాసమునకును నిదర్శనములు.

తిరుపతి వేంకటకవుల శైలి విశిష్టమైనది. వారు మహాపండితులయ్యు ననవసర సమాసాడంబరము ప్రదర్శింపరు ; అసహజములైన యలంకారములకై యత్నింపరు ; మారుమూలపదముల నన్వేషింపరు ; వ్యర్థపదములకు చోటీయరు.

"తనకు నాల్గు నిఘంటుపదములు వచ్చు
ననుచుఁ బదిమందికిని దెలియంగ మాఱు
మూల పదములు గుప్పిన ముచ్చటగునె
ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁగాక".

అను పద్యము పదప్రయోగ విషయమున వారికిఁ గల యభిప్రాయమును వెల్లడి చేయు చున్నది. జాతీయములు, శ్రవణ సుభగములు, సరస సుప్రసన్నములునైన పదములే వారి కవిత్వమునం దెల్లెడ ప్రత్యక్షములగును. అది ఆంధ్రభాష మాటాడనేర్చిన వారం దఱి నాకర్షింపజాలుట కిట్టి ప్రసాదగుణ బంధురమైన శైలియే కారణము. ఆశువు చెప్పి నను ఆలోచించి చెప్పినను వారి పద్యములు వియద్గంగాభంగసదృశములై నిరర్గళ ముగాఁ బ్రవహించుచుండును. వారి విస్తృతములైన రచనలలో కుంటినడక గల పద్య మొక్కటియుఁ గానరాదు. గద్వాలరాజుగారిని సందర్శించినప్పుడు వారు చెప్పిన క్రింది సీసపద్యము వారి కవితాశైలిని లెస్సగాఁ బ్రకటించుచున్నది.

"ముద్దు ముద్దుగఁ జెప్పఁ బూనితిమా వన్నె
లాడి తీయని మోవి లంచమిచ్చు
గరినమ్ముగాఁ జెప్పఁ బూనితిమా ప్రౌఢ
కాంత వక్షోజముల్ కాన్క యొసఁగు
తీక్ష్ణరీతిని జెప్పఁ దొరకొంటిమా వాలుఁ
గంటి లేఁజూపు సుంక మ్మొసంగు
మిశ్రరీతిని జెప్ప మేకొంటిమా బోఁటి
బిగువు కౌఁగిలి పన్నుఁ బెట్టి తీరు
నాశుధారాకవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు దండయిచ్చి తీరు
నాంధ్రగీర్వాణభాషలయందు మాకు
ధళితపండితటోపః గద్వాలభూప !"

వ్యాకరణ విషయమునఁ గూడ వారి దృష్టి చాల విశాలమైనది. వ్యాకరణ సూత్రముల కంటెను మహాకవుల ప్రయోగములకే వారధికమైన ప్రాధాన్య మొసంగిరి. మఱియు శబ్ద ముల కంటె రసమునకే వా రెక్కువ గౌరవ మొసంగుదురనుటకు,

"లలిత ప్రబంధములలో
పల యమకము దూర్చి రసము పా డొనరింపన్
వలయునె పెరుగును వడ్లును
గలబోసిన ముచ్చటగునె కవివరులారా!"

అను లక్షణా పరిణయమందలి పద్యము తార్కాణ మగుచున్నది. వారు రమణీయము లని తోచినచోట్ల నన్యదేశ్యపదములను గూడ విరివిగా వాడియుండిరి. కృతకములైన యలంకారములకుఁగాని, మారుమూల పదములకుఁగాని చోటీయక వా రుభయభాషలం దును కవిత్వము సాగించి దానిని పండిత పామరజన ప్రీతిపాత్రము కావింపఁజాలినారు. ఒక విమర్శకుఁడన్నట్లు వారి రచనలు ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యమును, ఆధునిక కవిత్వమునకు నాందిని బఠించిన వనుటలో సందేహములేదు.

వ్యుత్పత్తికి తగిన ప్రతిభ, ప్రతిభావ్యుత్పత్తులకుఁ దగిన అభ్యాసము కలిగి సుమా రొక అర్ధశతాబ్దికాల మాంధ్రకవితాసామ్రాజ్యము నేలిన విద్వత్కవిసార్వ భౌములు తిరుపతి వేంకటకవులు సమాన వయస్కులు, సమాన ప్రతిభులు నైన యా కవిపుంగవుల కలయిక ఆంధ్ర కవిత్వమున కొక యపూర్వమైన శోభ నావహించినది. పెక్కు రసవత్కావ్యములు రచించి, అవధానాశుకవిత్వములను బ్రదర్శించి, పలువురు శిష్యులను తమంతటివారి నొనర్చి, వా రాంధ్రదేశమున నఖండమైన కవితా చైతన్యము నావహించిరి.

"ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు చూడఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములన్ గ్రహించినార మె
వ్వానిని లెక్కసేయ కనివారణదిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధు లంచు పేరు గనినారము నీవలనన్ సరస్వతీ."

అని వారు సరస్వతీదేవిని గూర్చి కృతజ్ఞతాపూర్వకముగాఁ జెప్పినపద్యమునం దతిశ యోక్తి యిసుమంతయుఁ గానరాదు. జ్ఞానము వచ్చినదాది మరణపర్యంతము కవితాతప స్సొనరించి స్వతంత్రులై పట్టింపు వచ్చినచో దేవునైన లక్ష్యపెట్టక దివ్యతేజముతో విరాజిల్లిన కవిధీరులు వారు. వారి పేరులు సర్వాంధ్రజన సంతతస్మరణీయములు.

"పలుపలుకు లేల కవితా
లలితాంగికి కొప్పులో నలంకరణమ్ముల్
కలిపించిరి లేజాజుల
తెలిమల్లెలతావి పెల్లు దిక్కుల నరయన్."





# వికాసలహరి

ఉ ప న్యా స మ ం జ రి

## కార్యక్రమాల వివరణ

స్థలం : ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు

సమయం : సాయంత్రం 5—30 గం॥లకు

### ప్రథమ సమావేశము 7-10-1973 ఆదివారం

సమయం: సాయంత్రం 6 గం॥

వికాసమూర్తి : నన్నయ భట్టారకుడు

అధ్యక్షులు : డా॥ బి. ఆర్. శాస్త్రిగారు

ముఖ్య అతిధులు, వికాసలహరి, ప్రారంభకులు : శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

'ఉదయం' 'కథావాహిను'ల ఆవిష్కర్తలు :

శ్రీ రావూరి వేంకట సత్యనారాయణరావుగారు

ఉపన్యాసకులు : ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

### ద్వితీయ సమావేశము 21—10—1973 ఆదివారం

వికాసమూర్తి : బమ్మెర పోతన

అధ్యక్షులు : ఆచార్య బి. రామరాజుగారు

ముఖ్య అతిధులు : 'మందారమకరందాలు' ఆవిష్కర్తలు :

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారు

ఉపన్యాసకులు : డా॥ సి. నారాయణరెడ్డిగారు

## తృతీయ సమావేశము 4-11-1973 ఆదివారం

వికాసమూర్తి : **పింగళి సూరన**

అధ్యక్షులు : **డా॥ పాటిబండ మాధవశర్మగారు**

ముఖ్య అతిధులు : ఆంధ్ర బ్యాంక్ జనరల్ మేనేజరు
శ్రీ ఎమ్.వి. సుబ్బారావుగారు

ఉపన్యాసకులు : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు

## చతుర్థ సమావేశము 18-11-1973 ఆదివారం

వికాసమూర్తి : **కందుకూరి వీరేశలింగం పంతులు**

అధ్యక్షులు : **డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావుగారు**

ముఖ్య అతిధులు : న్యాయమూర్తులు ఒ. చిన్నపరెడ్డిగారు

ఉపన్యాసకులు : ఆరుద్రగారు

## ఐదవ సమావేశము 2-12-1973 ఆదివారం

వికాసమూర్తి : **తిరుపతి వేంకటకవులు**

అధ్యక్షులు : సాహిత్య అకాడమీ కార్యదర్శులు,
**శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు**

ముఖ్య అతిధులు, ఆవిష్కర్తలు : మహాకవి శ్రీ దాశరథిగారు

భారతీమిత్ర, భారతీభూషణ పథకాల ఆవిష్కర్తలు : శ్రీ జి. ఎల్. సంఘిగారు

ఉపన్యాసకులు : ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు





# ఎందరో మహానుభావులు...

తెలుగు ప్రజల్లో సమ్యగవగాహననూ, సాహితీ ప్రసరిణాన్ని, ఇతోధికంగా ఇనుమడింపజేయాలనే సత్సంకల్పంతో యువభారతి రూపొందించి నిర్వహిస్తున్న కార్యక్రమాలు విజయవంతం గావడానికి ఎందరెందరో సహృదయులు తోడ్పడి, నిర్మల మనస్సుతో నిరంతర దీక్షతో పనిచేసే వాళ్ళకు ఉత్తముల సహృదయ సహకారాలు అందుతూనే ఉంటాయనే సత్యాన్ని రుజువు చేశారు.

యువభారతి వహించిన భారం పెద్దదే. కాని భాషాభిమానులు భారం మోస్తున్న మాకు అండగా నిలిచి మా బరువును కాస్త తక్కువ చేసినవారయినారు. యువభారతి చేపట్టుతూన్న బృహత్తర కార్యక్రమాలు సిగపూవు వాడకుండా జయప్రదం కాజాలవు. ఎందరెందరో ఎన్నెన్ని విధాలుగానో మాకు చేయూతనిచ్చినారు. వారిపట్ల కృతజ్ఞతా భావాన్ని అక్షరాల్లో తెలుపుకోడానికి సాహసిస్తున్నాం.

కావ్యలహరి, చైతన్యలహరి, మహతి కార్యక్రమాలను నిర్వహించిన మాపై బాధ్యత పెరిగింది. యువభారతిపట్ల సాహితీప్రియులు ప్రదర్శిస్తున్న ప్రత్యయంవల్ల మేమింకా పదిలంగా నిర్వహణ బాధ్యతలను స్వీకరించటానికి ఉద్యుక్తులమవుతున్నాము. ఈ వికాసలహరి కార్యక్రమానికి సంబంధించిన ఆలోచనలకు, రూపకల్పన చేయడంలో మాకు సలహాలను అందించి దీవించిన పెద్దలు, యువభారతి గౌరవసభ్యులు, శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డాక్టరు సి. నారాయణరెడ్డి, డాక్టరు జి.వి. సుబ్రహ్మణ్యంగార్లకు మా మనఃపూర్వక అభివాదములు.

తమ ఆవరణలో తాత్కాలిక కార్యాలయాన్ని ఏర్పరచటానికీ, ఉపన్యాస సభలను ఏర్పాటు చేయడానికీ అనుమతించి ప్రోత్సాహాన్నందించిన పెద్దలు ఆంధ్ర సారస్వత పరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి ఔదార్యాన్ని మేము మరువలేము

తెలుగు జాతికి సంస్కృత భిక్షపెట్టి, తెలుగుజాతి వికాసానికి తోడ్పడి. తరతరాలకు మార్గదర్శకులై నిలిచిన వికాసమూర్తులపై ఉపన్యాసాలిచ్చి, వ్యాసాలనందించిన ప్రఖ్యాత ఆంధ్ర సాహిత్యాచార్యులు శ్రీయుతులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, ఆరుద్ర గారలకు మా భక్తిపూరకాభివందనములు.

ఉత్తమ సాహిత్యాధ్యయనం పట్ల ఆసక్తిని పెంపొందించాలనే ఉద్దేశంతో మేము రూపొందించిన కార్యక్రమాలకు తమ ఆశీస్సులను అందించి ఆముఖంగా 'వీచిక' ను

కూర్చి వికాసలహరి శీకగాలను చిందింపచేసిన సహృదయ శేఖరులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి పట్ల మా అభిమానాలను ప్రకటించుకోకుండా ఉండలేం.

'వికాసలహరి' ఉపన్యాసమంజరి సమావేశాలు నిర్విఘ్నంగా జయప్రదంగా కొనసాగేందుకు ఆయా రోజుల్లో అధ్యక్షులుగానూ, ముఖ్య అతిథులుగానూ విచ్చేసిన రసహృదయులు శ్రీయుతులు రావూరు వేంకట సత్యనారాయణ రావుగారు, ఆచార్య బి. రామరాజుగారు, ఎమ్ వి. సుబ్బారావుగారు, వానమామలై వరదాచార్యులుగారు, పాటిబండమాధవశర్మగారు, న్యాయమూర్తులు ఒ. చిన్నపరెడ్డిగారలకు మా ధన్యవాదాలు.

వికాసలహరికి సంబంధించిన సాహిత్యావసరాలకు అండగా నడిచిన మా యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకులు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారికి నమస్సులు. 'వికాసలహరి' పేరును సూచించిన మాసభ్యులు శ్రీ రెడ్డిరాఘవయ్యగారికి, కృతజ్ఞతలు!

'వికాసలహరి'ని తమ కరకమలాలతో ఆవిష్కరించిన మహాకవి దాశరథిగారికి మా హార్దికాభివందనములు.

వికాసలహరి కార్యక్రమాలకు అవసరమైన వేలాది రూపాయలను సేకరించడానికి తోడ్పడిన, వందలాది 'సాహితీమిత్రు'లకు భాషాభిమానులకు యువభారతి ఋణపడివుంది. ఈ సేకరణలో మాకు తోడ్పడిన మిత్రులలో ముఖ్యులు శ్రీమతి ఇ. వసుమతిరెడ్డిగారు, శ్రీ వి. రామకిష్టయ్యగారు, శ్రీ పాండురంగారెడ్డిగారు. వారికి మా కృతజ్ఞతాభివందనాలు.

తమ మాతృభాష తెలుగు కాకపోయినా, అర్థికంగా, హార్దికంగా సహకరిస్తున్న శ్రీ జి. ఎల్. సంఘిగారికి మా హృదయపూర్వక అభివందనములు.

బంగారానికి పర్యాయపదంగా మారిపోయిన కాగితాన్ని మా కార్యక్రమా విలువలు తెలుసుకుని సమయానికి అందించిన ఆర్. ఎమ్. త్రివేది అండ్ సన్స్ వారికి, ముఖ్యంగా శ్రీ రాజమణిగారికి మా నమస్కృతులు.

సమావేశాల నిర్వహణలో వ్యక్తిగతంగా శ్రద్ధవహించిన ఆంధ్రసారస్వత పరిషత్తు కార్యాలయకార్యదర్శి శ్రీ హరికిషన్‌రావుగారికి నమస్సులు.

వికాసలహరి ప్రాధాన్యానికి ఆకృతి నిచ్చేలా ముఖచిత్రాన్ని తీర్చి ఇచ్చినవారు మా యువభారతి గౌరవసభ్యులు శ్రీ శీలా వీర్రాజుగారు. వారికి మా ధన్యవాదాలు. అవసరమైనప్పుడల్లా అక్షరాలంకరణకు పూనుకొని ప్రచురణల అందానికి మారాకు హత్తిన సుధామకు అభినందనాలు. రంగురంగుల పోస్టర్లను తీర్చిదిద్దిన మా సభ్యుడు జీడిగుంట వెంకట్రావుకి సాహితీ మిత్రులు లక్ష్మణమూర్తిగారికి మా అభినందనలు.

మాలో ఒకరై 'వికాసలహరి' ముద్రణ కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా నిర్దుష్టంగా నిర్వహించిన నాగార్జున ప్రింటింగ్ వర్క్స్ అధినేతలు శ్రీ ఎన్.వి. నారాయణగారికి, అచ్చుపోతలో నైపుణ్యాన్ని ప్రదర్శించిన శ్రీ పి. వి. గండయ్య గారికి నమస్సులు.

కార్యక్రమాల వివరాల ప్రచారానికి తదితర అచ్చుపనిలో సర్వవిధాల తోడ్పడిన విజయశ్రీ ప్రింటర్స్ అధినేతలు శ్రీ ఎ. సూర్యనారాయణగారికి నమస్సులు. వికాస లహరి కరపత్రాలను అచ్చుపోసి ఇచ్చిన ఆంధ్రరచయితల సంఘ సహకార ముద్ర ణాలయం వారికి నమస్సులు.

ముఖపత్రాన్ని కళాత్మకంగా ముద్రించిన విస్టాస్ ప్రింటర్స్ నారాయణగారికి మా కృతజ్ఞతలు. అందమైన బ్లాకులను పోతపోసి అందించిన మోహన్ ప్రోసెస్ వారిని మరువలేము.

కార్యక్రమ వివరాలు నలుగురికీ తెలుపడంలో తోడ్పడిన పాత్రికేయులు శ్రీ పి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రిగారు, శ్రీ పి. దామోదరస్వామిగారు శ్రీ సురమౌళి ప్రభృతులకు నమస్సులు. వికాసలహరి కార్యక్రమాలు పదిమందికీ తెలియటంలో ఉచిత రీతిని సహకరించిన మిత్రులు శ్రీ కోపెల్ల శివరామ్‌గారికి కృతజ్ఞతలు! వికాసలహరి ఉపన్యాసాల సారాంశాన్ని ఆంధ్రభాషేతరులకు పరిచయంచేసిన శ్రీ పాతూరి శ్రీరామ శాస్త్రిగారికి వందనములు.

వికాసలహరి కార్యక్రమాల ప్రాధాన్యాన్ని గురించి అశేష ఆంధ్రావళికి ప్రసారంచేసిన ఆకాశవాణి నిర్వాహకులకు కృతజ్ఞతాభివందనములు.

వికాసలహరి పుస్తకాన్ని వారికి అందించే వీలు కల్పించిన సాహితీమిత్రులకూ, ప్రచురణపూర్వ విరాళమిచ్చి సహకరించిన సహృదయులకూ మా కృతజ్ఞతలు.

యువభారతి, పుస్తకాలను ప్రచురించి అమ్ముకునే వ్యాపారసంస్థకాదు. మాతృ భాషావికాసానికి తపస్సుచేస్తున్న యువకమండలి. సాధ్యమయినంత తక్కువధరకు ఉత్తమసారస్వతాన్ని అందించడానికి ప్రయత్నంచేస్తున్న సంస్థ.

మాతో సహకరించినవారు మాకు ఆప్తులు. వారినందరినీ పేరుపేరునా ఇక్కడ ఉదహరించడం సాధ్యంకాదు. సహృదయంతో ఔదార్యంతో మాకు చేయూతనిచ్చిన భాషాభిమానులకు మే మెప్పుడూ ఋణపడివుంటాము.

పెద్ద ఎత్తున కార్యక్రమాలను నిర్వహించడానికి ఆర్థిక బలమేకాదు, అంగ బలమూ అవసరమే. మా సభ్యులలో కొందరు విశేష శ్రమకోర్చి, నెలల తరబడి తమ తీరిక సమయాన్ని త్యాగంచేసి, ఈ కార్యభారాన్ని నిర్వహించారు. కొందరు సాహితీ మిత్రులూ సహకరించారు. కార్యాలయ నిర్వహణాభారాన్ని చిరునవ్వుతో కొనసాగించిన మిత్రుల సహకారం లేనిదే ఇంత పెద్దఎత్తున కార్యక్రమాలు నిర్వహించడం కష్టసాధ్య మయ్యుండేది. మా కార్యవర్గం సహకారం, సభ్యుల ప్రోత్సాహం మరువలేనిది.

సింగంపల్లి వెంకటేశ్వరరావు
కార్యదర్శి,

యువభారతి




# యువభారతి సాహిత్యోద్యమం

సమాజ వికాసం కోసం సాహిత్యంలో ఏదో ఒక ఉద్యమం ప్రతి యుగంలోనూ పుట్టుతూనేఉంది. సాహిత్యంలో నూత్న ప్రక్రియలనూ ప్రయోగాలనూ సాగించే ప్రయత్నం రచయితలకు సంబంధించింది. రచయితలు రత్నాల్లాంటి రచనలు చేయవచ్చుకాని, వాటిని సమాదరించే సాహిత్య రసికత్వం సమాజంలో లేకపోతే సారస్వతమంతా బూడిదలో పోసిన పన్నీరు కావలసిందే. కాబట్టి సాహిత్యంమీద సామాజికులకు సౌముఖ్యం కలిగించే ప్రచారోద్యమం ప్రతికాలంలోను అవసరం! అందు వలననే యువభారతి—

"చుట్టూరా ఆవరించుకునివున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న ధ్యేయంతో పదిసంవత్సరాలుగా సామాజిక సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది.

## సమాజ సమగ్ర వికాసం

అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆర్థికసమస్యలకూ, సాంకేతిక వైజ్ఞానిక శాస్త్రాభ్యుదయానికీ, పారిశ్రామికప్రగతికీ ప్రజాజీవితంలో ప్రాముఖ్యం కలిగినా, సాంస్కృతిక వికాసానికి తోడ్పడే కళాభిరుచి, సాహిత్యపిపాస సముజ్జ్వలంగా వికాసం చెందినప్పుడే జాతి సర్వతోముఖ వికాసాన్ని సాధిస్తుంది. ఆర్థికమైన అభివృద్ధితోపాటు, హార్దికమైన అభ్యున్నతి జాతి సమగ్రజీవితానికి ఎంతైనా అవసరం! మెదడు పెరిగినంతగా మనసు పెరగకపోతే మర కంటె మనిషి మహనీయుడు కాలేడు.

## ఆశయం

ఉద్యమానికి ఉన్నతమైన ఆశయం కావాలి మొదట. సామాజిక స్పృహ ఎన్నడూ లేనంత ఉన్నతప్రమాణాలలో ఉన్న నేడు సమాజంలో

సాహిత్యాభిరుచి పెంపొందించే ధ్యేయం ఉదాత్తమైనదనటంలో అభిప్రాయ భేదం ఉండదు. యువభారతి కృషి నేటి సమాజానికి అవసరం!

## సాహిత్యసంస్థ

ఉద్యమాన్ని వ్యక్తిగాకంటె సమష్టిగా నిర్వహించటం ప్రజాస్వామ్యవ్యవస్థలో ప్రయోజనాత్మకం. సమష్టిగా నిర్వహించే సాధనాలు సంస్థలు. యువభారతి సాహిత్యోద్యమాన్ని నిర్వహించే సాహిత్య సాంస్కృతిక సంస్థ.

## నిర్వహణం

ఉన్నత ధ్యేయాలను ఉత్సాహవంతులూ, సుశిక్షితులూ అయిన కార్యకర్తలు నిర్వహించాలి. యువభారతి పదిసంవత్సరాలుగా సుశిక్షణలతో ఉత్సాహంతో కార్యక్రమాలను నిర్వహిస్తూ సమాజంలో సాహిత్యచైతన్యాన్ని కల్గించింది. అది కలకాలం కొనసాగాలని ఆకాంక్షిస్తున్నది.

యువభారతికి రాజకీయాలతో ప్రమేయంలేదు. ఆదికవితనుండి అభ్యుదయ కవితదాకా సాహిత్యం ఏ మార్గంలో వెలువడినా అది ప్రజలకందాలన్నదే దాని ధ్యేయం. సమాజాన్ని సాహిత్యం ప్రతిబింబిస్తే సాహిత్యాన్ని సమాజం సమాదరించాలని యువభారతి ఆశయం. సాహిత్యాన్ని సమీక్షించే శక్తి సమాజానికేర్పడితే సాహిత్యం సమాజంమీద ప్రభావం వేయకలుగుతుంది. అందుకే యువభారతి ఉత్తమ సాహిత్యాన్ని పరిచయం చేసే సాహిత్యసభలు, చర్చాసదస్సులు నిర్వహిస్తోంది. అందరికీ అందుబాటులో ఉండే పుస్తకప్రచురణను చేపట్టింది. యువలోకంలో ఉత్తమసాహిత్యాభిరుచి కలిగించేందుకు ఉత్సాహంగా పనిచేస్తోంది.

## సహృదయుల సహకారం

యువభారతి కార్యక్రమాలమీద విశ్వాసంకుదిరిన సహృదయులు సాహితీమిత్రపథకంక్రింద ఇప్పటికే దాదాపు 5 వేలమంది తమ సహకారాన్ని అందిస్తున్నారు. అందుకే యువభారతి కృతజ్ఞతలనుప్రకటిస్తున్నది.

## దాతల కొక విన్నపం

దేశాభ్యుదయానికి సాహిత్యచైతన్యం అక్షయమైన పెట్టుబడి. అది ఒకరోజులో గడించేదికాదు. ఒకతరంలో ఆగిపోయేదికాదు. కలకాలం ఆ

లక్ష్యంతో పనిచేసే సంస్థకు చేయూత ఇవ్వటం సహృదయుల కర్తవ్యం. యువభారతికి భవిష్యత్తులో పదికాలాలపాటు ఈ సాహిత్యోద్యమాన్ని నిర్వహించటానికి వదాన్యుల చేయూత అవసరం.

సంపన్నులైన సహృదయులు సాహిత్యాన్ని సమాదరిస్తేనేకాని సమాజంలో సర్వతోముఖవికాసం సాధ్యంకాదు. పదిసంవత్సరాల యువభారతి చరిత్ర మీకందరికీ తెలుసు. అది పనిచేసే తీరు మీ ఆదరాభిమానాలను చూరగొంటున్నదని మేము భావిస్తున్నాము. మీ హార్దికమైన సౌజన్యంతోపాటు ఆర్థికమైన సహకారాన్ని యువభారతి అభ్యర్థిస్తున్నది.

## శాశ్వత నిధి

యువభారతి సుస్థిరభవిష్యత్ కార్యక్రమాలకోసం ఒక శాశ్వతనిధిని రూపొందించింది. భారతీమిత్ర. భారతీభూషణ పథకాలద్వారా కనీసం 5 లక్షల రూపాల నిధిని సేకరించాలని సంకల్పించింది. ఆ నిధి సేకరణలో విరాళాలద్వారా సహకరించండని సాహితీబంధువులైన దాతలను యువభారతి ప్రార్థిస్తున్నది.

## భారతీమిత్ర

యువభారతికి రూ. 116-00 లు విరాళంగా చెల్లించిన వదాన్యులను యువభారతి శాశ్వత సాహితీమిత్రులుగా పరిగణిస్తూ భారతీమిత్రులుగా గౌరవిస్తుంది. ఈ మొత్తాన్ని ఒక్కసారిగా ఇవ్వలేకపోయినా పది వాయిదాల్లో చెల్లింపవచ్చు. వారికి సాహితీమిత్రులకంటె ఎక్కువ సదుపాయాలు అందుబాటులో ఉంటాయి. 1974లో ఈ పథకంద్వారా ఒక లక్షరూపాయలు సేకరిద్దామని యువభారతి యత్నం !

## భారతీభూషణ

ఆర్థికంగా అదృష్టం పండి, ఆదరాభిమానాలతో ఆంధ్రభారతికి చేయూతనిచ్చే దాతలను యువభారతి వారి వితరణరూపమైన విరాళాలను అందించండని అర్థిస్తున్నది. రూ. 558 లు గాని, రూ. 1,116-00 లు గాని అంతకుమించిన మొత్తాన్నిగాని విరాళంగా ఇచ్చిన వదాన్యులను యువభారతి విశిష్టసాహితీమిత్రులుగా పరిగణించడంతోపాటు భారతీభూషణులుగా సన్మానిస్తుంది. యువభారతి ప్రచురణలన్నీ ఉచితంగా పొందుతుంటారు.

'భారతీభూషణ' పథకం ద్వారా 1974 లో కనీసం నాలుగు లక్షల రూపాయలు పోగుచేసి, యువభారతికి ఒక సొంతభవనం, శాశ్వతమైన ఉపన్యాసవేదిక, ఒక కళాక్షేత్రం, జాతీయగ్రంథాలయస్థాయిలో ఒక పుస్తకాలయం, 'రీడర్స్ డైజెస్ట్' వంటి ఒక పత్రికా ప్రచురణం మొదలైన ఎన్నో పథకాలను రూపొందించాలని యువభారతి ప్రయత్నం.

జనసామాన్యానికి, ఉత్తమ సాహిత్యాన్ని అనువైన పద్ధతిలో అందిస్తున్న యువభారతి సాహిత్య కృషికి, భాషాభిమానులు తోడ్పడతారనీ, యువభారతి ప్రచురణలను సాదరంగా ఆహ్వానిస్తారనీ, ఆశిస్తున్నాను.

డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం
ప్రధాన సంపాదకులు
యువభారతి ప్రచురణలు

---

"చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది"




---



## 1974 లోనే

# ప్రతిభాలహరి

ప్రతిభాలహరికై ఎన్నికైన ప్రతిభామూర్తులు

* శ్రీనాథుడు
* తెనాలి రామకృష్ణుడు
* పానుగంటి లక్ష్మీ నరసింహా రావు
* కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ
* మహాకవి శ్రీ శ్రీ




**YUVABHARATHI**

CELEBRATES
THE
CENTENARY
OF TELUGU NOVFL
WITH THE
PUBLICATION OF

**TELUGU**
**NOVEL**



DATE OF RELEASE

**24-3-1974**

"ANANDA" UGADI



PRE-PUBLICATION
PRICE ... Rs. 5-00

POST-PUBLICATION
PRICE ... Rs. 10-00

HURRY UP TO OWN
YOUR COPY!




## యువభారతి

## స్నేహాహ్వానాన్ని స్వీకరించండి!

**యువభారతి సాహిత్యోద్యమ నిర్వహణలో తోడ్పడండి!**
**సాహితీమిత్ర, భారతీమిత్ర, భారతీభూషణులుగా చేరండి!**

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్త్వికసాధనం లేదని, యువభారతి విశ్వాసం. వీలైనంత ఎక్కువమందికి, వీలైనంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించ గలిగితే- సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందించడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుందనీ- నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుందనీ- జాతి సమగ్రవికాసానికి అవసరమైన సమ్యక్ దృష్టి ఏర్పడటానికి దోహదకారి కాగలదనీ, యువభారతి నమ్మిక.

యువభారతి కృషిలో పాలు పంచుకొని, సాహిత్యోద్యమనిర్వహణలో బరువు బాధ్యతలను సాదరంగా స్వీకరించే సహృదయులను సాహితీమిత్రపథకం ద్వారా యువభారతి ఆహ్వానిస్తున్నది. పదివేలమంది సాహితీమిత్రుల సహకారాన్ని పొందాలన్న ఈ ప్రయత్నంలో, ఇప్పటికి దాదాపు 5,000 మంది సాహితీమిత్రుల సౌజన్యాన్ని యువభారతి పొందగలిగింది.

**సాహితీమిత్రులు — యువభారతి**

సాహితీమిత్రులుగా యువభారతిలో చేరటం అంటే మీ అండదండలను మాకు హృదయపూర్వకంగా అందించటానికి అంగీకరిస్తున్నారన్నమాట.

**'యువభారతి' సాహితీమిత్రులకు ఈ పథకంలో లభించే సదుపాయాలు**

1) ప్రతి సంవత్సరం ఐదు రూపాయలు చెల్లించడంతో చేరిననాటి నుండి ఒక సంవత్సరం పాటు యువభారతి సాహితీమిత్రులుగా పరిగణించబడతారు. 2) తక్షణమే ఒక ఉచిత పుస్తకం. 1974 లో ప్రచురించే 'ప్రతిభాంహారి' ఉచితంగా అందుతుంది. నేరుగా అందించడం గాని, పోస్టు ద్వారా పంపటంగాని జరుగుతుంది 3) యువభారతి మిగిలిన ప్రచురణలను (దాదాపు అన్నింటినీ) 25% మినహాయింపుతో సొంతం చేసుకొనే సదుపాయం మీరు చేరిననాటి నుండి ఒక సంవత్సరంపాటు ఉంటుంది. 4) ప్రత్యేక రచనా సంకలనాలలో పాల్గొనవచ్చును.

## 1974 లో రూ. 1,00,000 ల నిధి సేకరణ

యువభారతి తాను నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని పదికాలాల పాటు పదిలంగా సాగించేందుకై ఒక బృహత్తర పథకాన్ని రూపొందిస్తున్నది.




1974 వ సంవత్సరంలో కనీసం లక్ష రూపాయల నిధిని సేకరించాలని యువభారతి సంకల్పిస్తున్నది. ఈ నిధి సేకరణకై రూపొందించిన కొత్తపథకం భారతీమిత్ర. అంటే 'యువభారతీ' మిత్ర అన్నమాట !

కేవలం రూ. 116 చెల్లించడంతో మీరు శాశ్వతంగా యువభారతి భారతీమిత్రులుగా పరిగణింపబడుతారు. ఒకేసారి రూ. 116 చెల్లించడంకష్టం అనుకోండి! సహృదయులందరికీ మందహాసంతో చెల్లించే అవకాశాన్ని కల్పించే ఉద్దేశంతో వాయిదాలపై చెల్లించే వీలు కలిగిస్తున్నాం.

## ఈ పథకంలో సమకూరే సదుపాయాలు

1) యువభారతి నిర్వహించే కార్యక్రమాల వివరాలు మీకు తెలుపబడుతాయి. 2) యువభారతి సాహితీమిత్రులకు ఒకఉచిత పుస్తకమూ- ఆ సంవత్సరపు లహరీ ఉచితంగా అందించటం జరుగుతున్నది. యువభారతి భారతీమిత్రులకు ప్రతి సంవత్సరమూ అటువంటి ఉచిత పుస్తకాలు రెండు, ఆ సంవత్సరపు లహరి మాత్రమే కాక, పాకెట్ డైరీ కూడా కలిపి ఒకేసారి నేరుగా అందించటంగానీ, రిజిష్టర్డు పోస్టుద్వారా పంపటంగానీ జరుగుతుంది.




సాహితీ బంధువులై సారస్వత ప్రసరణానికి తోడ్పడే వదాన్యులు తమ సహకారాలను పెద్ద మొత్తంలో అందించి యువభారతి కృషిని ప్రోత్సహించేందుకు యువభారతి భారతీభూషణ పథకాన్ని ప్రారంభిస్తున్నది.

రూ. 558 లు గాని, రూ. 1,116 లు గాని అంతకుమించిన మొత్తంగాని, అందించే వదాన్యులను 'భారతీ భూషణు'లుగా యువభారతి సమాదరిస్తుంది.

ఇలా పెద్ద మొత్తంలో విరాళ మిచ్చిన 'భారతీభూషణు'లకు యువభారతి వెలువరించే అన్ని ప్రచురణలనూ శాశ్వతంగా ఉచితంగా అందించటం జరుగుతుంది.

యువభారతి కృషికి మీ చేయూత నందించండి !

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3



# సాహితీ మిత్రులకు యువభారతి లేఖ - 2

సహృదయులైన సాహితీమిత్రులకు నమస్సులు.

మీ సాహితీ ప్రియత్వాన్ని యువభారతికి పెట్టుబడిగా అందించి, మీ సహృదయాన్ని చవిచూడ నిచ్చినందుకు మనసారా కృతజ్ఞతలు.

ప్రతి ఒక్కరినీ ప్రత్యేకంగా పలుకరిద్దామని ఎంతగా ఉన్నా, అందరికీ పేరు పేరునా స్వదస్తూరీలో ఉత్తరం వ్రాయటంలోని ఇబ్బందిని, సహృదయులైన మీరు పోల్చుకోగలరనీ, ఆ మేరకు అచ్చుపోసినంత మాత్రాన, ఆత్మీయతలో లేశమైనా తగ్గనట్టే భావించమనీ విన్నవిస్తూ, కొన్ని ముఖ్యమైన విషయాలు ప్రస్తావిస్తున్నాము. ఈ విషయాలను గమనిస్తారనీ, మీ సమాధానం, మనస్ఫూర్తి సహకారం లభించగలవనీ నిరీక్షిస్తుంటాము.

1. ఈనాటికి సాహితీమిత్రుల సంఖ్య దాదాపు 5000. యువభారతిని 10,000 మంది సహృదయులకు, సన్నిహితం చేయాలన్న మన లక్ష్యంలో మీ సహకారాన్ని అర్థిస్తున్నాం. ప్రతిఒక్కరూ-కనీసం మరొక్కరికి యువభారతిని పరిచయంచేస్తే రానున్న "ఆనంద" ఉగాది నాటికన్నా, లక్ష్యాన్ని చేరుకోగలం.

   ప్రతిసాహితీమిత్రుడు, కనీసం మరో అయిదుగురికైనా యువభారతికి పరిచయంచేయడం కర్తవ్యంగా భావించి వారిని సాహితీమిత్రులుగా చేర్చటానికి ఉద్యమించాలి. మీరు చూపిస్తున్న అభిమానానికి యువభారతి ఋణం తీర్చుకో లేదు కాని, కృతజ్ఞతాసూచకంగా మీ మనసు మురిసి, మీరుమెచ్చే, మీరు ఆశ్చర్యపడే, పుస్తక బహుమానం ఒకటి అందిస్తుంది. మీ సహృదయాన్ని కించపరుద్దామని కాదు-మా అభిమానాన్ని సవినయంగా ప్రకటించుకొందామని ఈ ప్రోత్సాహం.

2. సాహితీమిత్రులలో చాలామంది, తమ సభ్యత్వాన్ని 1974 ప్రతిభాలహరి (శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, మహాకవి శ్రీ శ్రీ లపై ఉపన్యాస మంజరి)కై పొడిగించారు. మరి, మీ సభ్యత్వాన్ని పొడిగించడం మరిచి పోరుగదూ!

3. మన సాహితీ స్నేహానికి సంకేతంగా, వికాసలహరిని అందిస్తున్నాము. మీ అభిప్రాయాలు తెలియజేయండి.

4. యువభారతి భారతీమిత్రులుగాచేరి, కేవలం రు. 116లు చెల్లించడంతోసాహితీ మిత్రులకన్న ఆకర్షణీయమైన అదనపు సౌకర్యాలను, శాశ్వతంగా సొంతం చేసుకోవచ్చు. అదీ వాయిదాలపై చెల్లించవచ్చు. వివరాలు పంపించమంటారా?

5. "ఆనంద" ఉగాది నాటికి-సాహితీమిత్రుల ప్రత్యేక కవితా, కథా సంకలనాలు వెలువరించే పథకంలో పాల్గొనే ఉత్సాహం చూపుతారుగదూ! గడువు తేదీ లోపుగా రచనలు పంపండి.

"ఆనంద" ఉగాది నాటికి - మరి రెండు మంచి పుస్తకాలు.

---

i. ఆరుద్ర రసార్ద్రమైన వ్యాఖ్యతో "వేమన్నవేదం" ఒక్కరూపాయికే! పోస్టేజి 0.25 పైసలు అదనం.

ii. వేయిపడగల మొదలు ప్రపంచ సాహిత్యానికి చక్కని కానుకలుగా నిలువ గలిగే 22 తెలుగు నవలలకు ఇంగ్లీషులో పరిచయ వ్యాసాల సంకలనం Telugu Novel ప్రచురణ పూర్వవిరాళం రు. 5-00 లు. ప్రచురణ అనం తరం వెల రు. 10-00. రిజిష్టర్డు పోస్టేజికి అదనంగా రు. 2-00 అవుతుంది కానీ, శ్రమ అనుకోక, మరో 5 ప్రతులకైనా ఆర్డర్లు సేకరిస్తే పోస్టేజి/ రవాణా ఖర్చులభారం మేమే భరించి పంపుతాం. Telugu Novel పూర్తి వివరాలకు కార్డువ్రాయండి.

7. "మందారమకరందాలు"

పోతన మినీ భాగవతం - లక్ష ప్రతులందించాలన్న ధ్యేయంతో రూపాయికే అందిస్తున్నాం. మొదటి ముద్రణ ప్రతులు 25,000 చెల్లిపోయాయి. రెండవ ముద్రణ వెలువడింది. మరి, మీ ప్రతిని స్వంతం చేసుకోవడమే కాదు, మీ ఆత్మీయుల తరఫున మీరే పూనుకొని - లక్ష ఎదల్లో పూలు పూయించడానికి పూనుకోండని విన్నవిస్తున్నాం. ప్రతి తెలుగు ఇంట తెలుగుతనం తొణికిస లాడేందుకు దోహదం చేయండని అర్థిస్తున్నాం.

8. సాహితీవాహిని పరంపర ధ్యేయం – మీకు విశదమే.

విశ్వసాహిత్య సౌరభాలనేకాక, సాహితీ, సాంస్కృతిక, వైజ్ఞానిక, విషయాలను సైతం ప్రజలకందించాలని సంకల్పిస్తూ, సాహితీవాహినిని ద్వైమాస పత్రికగా వెలువరించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

'ఆనంద' ఉగాదినుండి ద్వైమాస పత్రికగా వెలువరిద్దామని యత్నం. చందా దారులుగా సహకరిస్తారు గదూ!

9. సంకల్పించిన "యువత" గోష్ఠి – పెద్దఎత్తున నిర్వహించదలచిన దృష్ట్యా 1974 కు వాయిదా వేయక తప్పిందికాదు. వివరాలన్నీ 'ఉగాది'నాటికి తెలియ పరుస్తాం.

10. వాణిజ్య నాడి తెలిపిన విషయాలను, జాతి సాహిత్యపరమైన అవసరాలకు అనుసంధించడంద్వారా – సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి అవసరమైన నిర్మా ణాత్మక ఆలోచనా సరళిని సృష్టించగలిగే సాహిత్యాన్ని – వీలైనంత ఎక్కువ మందికి, వీలైనంత తక్కువ వెలకు అందించడంద్వారా ప్రజాస్వామ్య వ్యవస్థకు నారుపోసే ప్రతిభా సౌమనస్యాలు జనావళిలో ఇతోధికంగా పెరగ డానికి తోడ్పడగలమని మా "యువభారతీయు"ల విశ్వాసం. ఈ లక్ష్యసాధనకై యువభారతి ప్రచురణలను (దాదాపు అన్నింటినీ) 25% తగ్గింపుకు సొంతం చేసుకొనే సదుపాయాన్ని మీరు వినియోగించుకుంటున్నారా? ఈ సదవకాశాన్ని సొంతం చేసుకొండి. మీ మిత్రులకు యువభారతి ప్రచురణలను పరిచయం చేయండి.

11 ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ –

యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు చిరునామాకు వ్రాయాలనీ, మని యార్డర్లూ – ఈ చిరునామాకే పంపాలనీ –

వ్యక్తిగతంగా కలుద్దామనుకుంటే – ఏ రోజైనా సాయంత్రం 4 నుండి 9 గం॥ వరకు, హైదరాబాదు తిలక్ రోడ్‌లోనున్న ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలలోని యువభారతి కార్యాలయానికి విచ్చేయాలనీ గుర్తుంచుకోండి.

12. మీరు వ్రాసే ఉత్తరాలలో – మీ సాహితీమిత్ర సంఖ్య ఉదహరించడం మరువ కండి. మీ చిరునామా స్పష్టంగా వ్రాయండి.

13. తెలుగు సామెతల సంకలనం – "ప్రజాసూక్తం" పేరిట –

ఈ వికాసలహరితోపాటు ఆవిష్కరిస్తున్నాం. 72 పేజీలు – అందరికి 2 రు. సాహితీమిత్రులైన మీకు ఒక్క రూపాయే. పోస్టేజి అదనం అన్నవిషయం మామూలే!

14. ఓ ముఖ్య విషయం -

యువభారతి గురించి మీరేమనుకుంటున్నారు? మన ప్రచురణలు మీకు నచ్చుతున్నాయా? యువభారతి కార్యకలాపాల గురించి మీ అభిప్రాయాలు తెలుసుకుందామని ఉంది. భవిష్యత్తులో కార్యక్రమాలను రూపొందించడంలో మీ సూచనలకు తగు ప్రాధాన్యం కల్పించే సౌకర్యం కలిగించండనీ విన్నపం.

15. అన్నింటికన్న ముఖ్యం -

అడపాదడపానయినా - ఓ కార్డుముక్క వ్రాసి, పలుకరిస్తారు గదూ! ఏర్పడిన ఈ సాహితీస్నేహం, కలకాలం కొనసాగేందుకు సహకరించండి.

16. మీ సహకారం ఊతగా, ఉత్సాహంతో ముందడుగు వేస్తున్న యువభారతికి - మీరు ముందుంటారన్న నమ్మకంతో - తెలుగుతల్లికి మరిన్ని మణిహారాలను సమర్పించాలన్న మా ప్రయత్నాలకు, మీ అందరి ఆదరణా, మనఃపూర్వక సహకారమూ అందిస్తారన్న విశ్వాసంతో -

మీ ఆదరాన్ని సదా ఆకాంక్షిస్తూ -

సమావేశకర్త

2-12-1973

యువభారతి

చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది



*Cover Printed by VISTAS PRINTERS, Hyd.*